

"ఉత్తర"

ఫొటో : నందగోపాల్—మద్రాసు.


24 సెప్టెంబరు
నుండి విడుదల!
పద్మినీ
పిక్చర్స్





శభాష్
పిల్లా!
(తెలుగు)
శివాజీ గణేశన్
రంగారావు
బి.సరోజాదేవి
చంద్రబాబు
కుసుమ కుమారి
FLOODLIGHT
studio
SARIGAM
మాటలు,పాటలు: శ్రీ శ్రీ., దర్శకత్వం: బి.ఆర్.పంతులు
విజయ రిలీజ్

# ఆంధ్రసచిత్ర వారపత్రిక



**Founder**
**K. Nageswara Rao**

స్థాపితము
1908



సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్



సంపుటము 54
సంచిక 2

23-9-59

వికారి భాద్రపద బహుళ షష్ఠి



విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0



ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీథి
మదరాసు-1.


# విషయానుక్రమణిక

ముఖచిత్రం:
'కృష్ణలీలలు' చిత్రంలో
లక్ష్మీరాజ్యం



# ఉత్తరాలు

## "విద్యార్థులకు మాత్రమే"

ఆర్యా,

పై శీర్షిక క్రింద ఎస్. శివగిరిరావుగారు విద్యార్థులకిచ్చిన సలహాలు చదివాను. బహుశా వారు అది వ్రాస్తున్నప్పుడు "చాలా గమ్మత్తుగా వ్రాస్తున్నానుకదూ!" అని తమను తామే అభినందించుకొనివుంటారు. కాని ఆ సూచనలు చాలా అసహ్యంగాను, అసభ్యంగాను వున్నాయని ఎవరైనా అంగీకరిస్తారు. దీనివలన వారు పఠితలకు గొప్ప వినోదాన్ని కల్గిస్తున్నానని అనుకొనివుంటారు. కాని అది విద్యార్థులమీద ఎలాంటి ప్రభావాన్ని కల్గివుంటుందో ఆలోచించివుండరు.

ఎ. వి. కోటిరెడ్డి,
శ్రీకాకుళం.

* పొరపాటే

* * *

ఈ సలహాలు లెక్చరర్లున్నన పొందుటకు ఉపయోగించవచ్చు, కానీ సులువుగా ప్యాసయేందుకు కాదు. పరీక్ష పేపర్లను విలువకట్టేవారు విశ్వవిద్యాలయాధికారులన్న విషయం మర్చిపోయారేమో!

కె. కుమారిని,
హైద్రాబాదు.

* ఇదికూడా పొరపాటే

## పొమాటో

"అదీ-ఇదీ" శీర్షిక (9-9-59)లో "పొమాటో" అనే కొత్త మొక్క చైనా రైతు కనిపెట్టాడని ప్రచురించారు. కాని ఈ మొక్కను మొదట తయారు చేసింది రష్యన్ ప్రొఫెసరు టి. డి. లైసెంకో. మీరీ విషయము "ప్లాంట్ బ్రీడింగ్"పై ఏ ప్రమాణ గ్రంథమునైనా తిరగవేసి చూడవచ్చును. ఇకముందు ఇటి తప్పులు ప్రచురించరని ఆశిస్తున్నాను.

సి. బి. తుకారాం, తిరుపతి.

* చైనా రైతు కనిపెట్టాడని ఇటీవల ప్రముఖ వార్తాపత్రికలన్నీ ప్రముఖంగా ప్రకటించాయి.

## తెలుగు వెలుగులు

"తెలుగు వెలుగులు" అన్న శీర్షిక చాలాబాగుంది. ప్రతివారం ఆంధ్ర నాయకుల గూర్చి విపులంగా వ్రాస్తారని ఆశిస్తున్నాను.

గరికిపాటి, హైద్రాబాదు.

మీరు ప్రచురిస్తున్న క్రీడారంగం చాలా కుతూహలం కలిగిస్తున్నది. ఇంకా ఎక్కువ విషయాలతో, విశేషాలతో ఈ శీర్షికను ఎక్కువ ఉత్తేజకరంగా చేస్తారని ఆశిస్తున్నా. తెలుగులో సరైన క్రీడా పత్రికలు లేకపోవడం చాలా విచారకరమయిన విషయం. కావున మీరు ఈవిషయంలో తగినశ్రద్ధ చూపిస్తారని ఆశిస్తున్నా.

పి. నాగేశ్వరరావు, గుడివాడ

(53-వ పేజీ చూడండి)



# రాజధాని కబుర్లు

ప్రవీణ్

## 'వైద్యార్థుల' అగచాట్లు

కోడీ, కుంపటీ రెండూ నా దగ్గరుంటే ఆ సూర్యుడు మాత్రం ఎలా ఉదయిస్తాడు? ఎలా తెల్లవారుతుంది?—అని ప్రశ్నించిన పూర్వకాలపు ముసలిదాని మీద గౌరవంవల్ల కాబోలు, 'మా చేతిమాత్ర పడందే రోగులు ఏ మొహం పెట్టుకొని వైకుంఠయాత్ర చేస్తారు?' అని ప్రశ్నిస్తున్నారు రాజధానిలో వైద్యులు కొందరు.

ఐదేసి సంవత్సరాలు వైద్య కళాశాలల్లో శిక్షణపొంది వచ్చినతర్వాత వైద్యులకు తామిచ్చే మందుల్లో ఈ మాత్రం విశ్వాసం కలగడంలో ఆశ్చర్యంలేదు. ఈ కాలంలో ప్రభుత్వం ఏ విధంగా నడుస్తూందంటే, హఠాత్తుగా గుండెపగిలి చచ్చిపోయిన ఎన్. జీ. ఓ; అంతటితో తృప్తిపడక, "నేను ఫలానారోజున ఫలానా కారణాలవల్ల చచ్చిపోయాను కనుక కాజువల్ లీవు దయచేస్తారా?" అంటూ అధికారుల దివ్యసముఖానికి అర్జీ పడేసుకుంటాడు.

ఆ వాటు తప్పించుకోడం కష్టం.

అర్జీ దాఖలు చేసుకున్న అధికారులు, "నువ్వు చచ్చిపోయావని డాక్టర్ సర్టిఫికేట్ పంపించు; లేకపోతే, వెంటనే డ్యూటీలో చేరు!" అని ఆజ్ఞాపిస్తారు. అకౌంటెంటు జనరల్ కూడా అంతే అంటారు: ఇదివరకొకసారి చెప్పానుగదా ఆ కార్యాలయం ఏ విధంగా పని చేస్తుందో?

అందువల్ల రోగాలకంటె, మందులకంటె—డాక్టర్లు ఇచ్చే సర్టిఫికెట్లకే ప్రాముఖ్యత 1959 వ సంవత్సరంలో! ఈ విషయం డాక్టర్లుకూడా గుర్తించారు. ప్రభుత్వ ఆసుపత్రుల్లో ఉచితచికిత్సకి పోయే వేలాది రోగులకి మందులు మాకులు సరిగా లభించడం లేదు, 'దవాఖానాలు' దయలేని గవాఖానాలయ్యాయ్; 'ధర్మాసుపత్రులు' ధర్మం అంటే ఏమిటో ఎరుగనివయ్యాయ్.

ఈ వాక్యాలు రాస్తూంటే, కొందరు డాక్టర్లు కళ్ళకు కట్టినట్టు కనపడుతున్నారు: దయార్ద్రహృదయులు. సేవాతత్పరులు. జీతాన్ని రూపాయి అణా పైసల్లోను—నయాపైసలవాలి కాబోలు!—విధి నిర్వహణను గంటలు, నిముషాలు, సెకన్లలోను లెక్కపెట్టుకోడం చేతగానివారు. మనం ఎంత బాధపడుతున్నామో, ఆసుపత్రుల్లో తోటి ఉద్యోగుల నిర్లక్ష్యాన్ని చూసి, వీరంత బాధపడుతున్నారు.

కాని—'దయలేని దవాఖానా' లను గూర్చి ఈ వారం రాయను. ధర్మమెరుగని ధర్మాసుపత్రుల ప్రస్తావన ఈ వారం వద్దు. పైవారం చూద్దాం! ఈ వారం—రేపు మనకు మందులిచ్చే నేటి విద్యార్థుల సంగతి పరిశీలిద్దాం!

### గాంధీ 'వైద్యార్థుల' బ్రహ్మచర్యం

అలోపతీ వైద్యంలో శిక్షణ ఇచ్చే కళాశాలలు రెండున్నాయి రాజధాని నగరంలో. పట్టమహిషి సంతానం ఉస్మానియా వైద్యకళాశాల. రెండోభార్య బిడ్డ గాంధీ వైద్యకళాశాల. ఈ గాంధీ వైద్య కళాశాల విద్యార్థులగోడు వినండి.

రెండు వైద్యకళాశాలలు ప్రభుత్వం వారివే! రెండూ ఉస్మానియా విశ్వవిద్యాలయానికి అనుబంధంగా పనిచేసేవే. ఐతే గాంధీ వైద్యకళాశాల విద్యార్థులు బషీర్ బాగ్ వద్దనున్న తమ కళాశాల కార్యాలయంలో జీతం కట్టిరావాలి. ఈ జీతంలో భాగంగానే ఆటపాటలకి, లైబ్రరీకి రుసుం స్వీకరిస్తుంది గాంధీ వైద్యకళాశాల.

ఈ వైద్యకళాశాలకి సంబంధించిన నాలుగవతరగతి ఎం.బి.బి.ఎస్. విద్యార్థులు ఉస్మానియా కళాశాలలో భాగంగా పరిగణించబడతారు. వారికి ఆ కళాశాలలోనే పాఠాలు (ప్రేక్టికల్స్), వార్డుపని. చదువుకోడానికి వైద్యగ్రంథాలు కావాలంటేమాత్రం అక్కడ దొరకవు. ఉస్మానియాలో జరిగే ఆటలలో పోటీలలో పాల్గొనడానికి వీల్లేదు. వాళ్లు గాంధీ వైద్యకళాశాలకి జీతం కడుతున్నారు గదా మరి?

వాళ్ళు ఉదయం ఏడు గంటలు మొదలు సాధారణంగా సాయంత్రం వరకు పని చేయాలి. కాని పుస్తకాలు లైబ్రరీలో తీసుకోవాలంటే; బంతీ బేటూ చేత్తోపట్టుకోవాలంటే కొన్ని మైళ్ళదూరంలోఉన్న బషీర్ బాగ్ రావాలి. ఎలా వస్తారు? బస్సులున్నాయ్. ఉస్మానియాకి ఒకటి, గాంధికళాశాలకి ఒకటి రెండు బస్సులున్నాయ్.

గాంధీ వైద్యకళాశాల విద్యార్థులు—నాలుగవ తరగతి విద్యార్థులతో సహా—సంవత్సరానికి ఆరు రూపాయలు జీతంలో భాగంగా చెల్లించుకుంటారు. పైన సెంకు ఐదు రూపాయలు చొ॥న చెల్లించుకుంటేగాని గాంధీ కళాశాల బస్సులో ప్రవేశం లేదు. పుస్తకాలకి, ఆటలకి తప్పిస్తే వారు బషీర్ బాగ్ కి రానవసరం లేదు. ఉస్మానియా బస్ బషీర్ బాగ్ పోదు. పోయినా, వారికా బస్సులో ప్రవేశం లేదు.

క్లాసుల్లో ఒక విద్యార్థి లేచి ప్రశ్న అడిగితే "ఓ! నువ్వు గాంధి మెడికల్ కళాశాల వాడివి కదూ?" అంటారుట కొందరు అధ్యాపకులు "అంతా అర్థం ఐపోయిందిలే!" అన్నట్టు.

ఇక మూడవ తరగతి విద్యార్థుల గోడు వినండి. వీళ్లు జీతాలు బషీర్ బాగ్ లో కడతారు. పాఠాలు ఉస్మానియా కళాశాలలో. వార్డు పని సికిందరాబాదు స్టేషన్ వద్దనున్న కె. ఇ. ఎమ్. ఆసుపత్రిలో.

ఉస్మానియాలో ఇంతమంది విద్యార్థులు తరగతులకు ఒకేసారి హాజరు కావడానికి అవకాశం లేదు. కనుక, ఉదయం ఉస్మానియా వారికి – థియరీ క్లాసులు జరిగితే, మధ్యాహ్నం వీరికి జరుగుతాయి. లేబరేటరీలో వీరికి ఉదయం పనుంటే, మధ్యాహ్నం వారికి పనుంటుంది.

మరి జీతాలు బషీర్ బాగ్ లో కట్టే 'గాంధేయులు' ఉస్మానియావారులు కారు కదా! ఒక పూట పని చేయడానికి నియమింపబడిన ప్రొఫెసర్లు రెండోపూట పని చేయడానికి అంగీకరించలేదట. ఉస్మానియా లేబరేటరీలోని రసాయనిక ద్రవ్యాలు గాంధేయుల పై ఖర్చుచేయడానికి, ఉస్మానియా అధ్యాపకులు అంగీకరించ లేదట! ఈ సంవత్సరం రాజీ కుదిరి, గాంధీ వైద్యకళాశాల కొంత డబ్బు ఇచ్చుకొనే పద్ధతిపైన, రసా

# ★ రాజధాని కబుర్లు ★

యనిక ద్రవ్యాలు కొన్ని వసతి పిల్లలకు కూడా ఇవ్వడానికి పట్టుపట్టి అంగీకరించిందని వినికిడి!

ఉస్మానియా విద్యార్థులకి వసతి సౌకర్యాలున్నాయి: అవి ఇంతవరకు గాంధేయులకు నిర్వచించబడలేదు. ఊరి బయట కొన్ని మైళ్ళదూరంలో హుమయూన్ నగర్ లో ప్రైవేటుగా నడుపుకుంటే కొన్ని ఏర్పాట్లు చేస్తామన్నారట అధికారులు: ప్రభుత్వం వసతిగృహాన్ని నడపడానికి సిద్ధంగా లేదు.

ఈలోగా, ఉస్మానియా కళాశాల హాస్టల్ లో కనికరించి కొందరు నాలుగవ తరగతి గాంధీయులకు కొన్ని 'సౌకర్యాలు' అధికారులు కల్పించారట! మంచిది. ఆసుపత్రిలో రోగులకే పడకలు లేనప్పుడు గాంధీ వైద్యార్థుల కెందుకు? నేలపై పక్కలు పరుచుకు పడుకొని, దగ్గరలోని గురంధాల రిజర్వాయర్ల గాడ్పులను లెక్క చేయక కఠిన బ్రహ్మచర్య దీక్షా పరులైనారట ఈ గాంధేయ వైద్యార్థులు.

వీరూ రేపటి మన వైద్యులు! నేటి మన వైద్యులను రేపు పరిశీలిద్దాం!

## ఉస్మానియాలో కాబోయే 'వైద్యార్థులు'

రాష్ట్రంలో కొన్ని వందల ఆసుపత్రుల్లో వైద్యులు లేరని ప్రకటించింది ప్రభుత్వం - సగర్వంగా! మందుల్లేకుండా మనుష్యులు ఎలా చచ్చిపోతారో చూస్తాం!' అన్న 'కోడి-కుంపటి-ముసలమ్మ' వేదాంతంలో డాక్టర్లకే కాదు; ప్రభుత్వానికే విశ్వాసం ఉన్నట్టుంది!

ఈ విశ్వాసం వైద్యకళాశాలకు విద్యార్థులను తీసుకోడంలో ప్రతిఫలిస్తోంటుంది ఏటేటా! గత సంవత్సరం ప్రధాన న్యాయస్థానంలో ఎన్నో రిట్లు దాఖల్ అయ్యాయి. వెనుకపడిన తరగతులకు, స్త్రీలకు ఇన్ని స్థానాలు అనమం ఇస్తామన్నప్పుడు, సమర్థులైన అభ్యర్థులున్నా అన్నే ఇస్తాననడం సమర్థనీయం కాదని ఈ రిట్ల ఫలితంగా తేలిన విషయం.

గడచిన సంవత్సరాల్లో ఇంటర్వ్యూ పద్ధతివల్ల చాలా అన్యాయాలు జరుగుతున్నాయని తేలింది. అందువల్ల ఈ పద్ధతి తీసేయాలని తెలంగాణా ప్రాంతీయసంఘం నిర్ణయించింది. ఈ సంఘం సూచనను ప్రభుత్వం సహృదయతతో అంగీకరించింది; అప్పటికున్న నిబంధనలన్నీ మార్పించింది; కొత్తవి ప్రకటించింది.

వెనుకపడిన తరగతులకు కొన్ని స్థానాలు కేటాయించినప్పుడు అర్హత ననుసరించి ఆ స్థానాలు ముందు భర్తీ చేయించవలసింది. మిగిలిన విద్యార్థులను సాధారణ కులాలు అగ్రకులాలు అనడం లేదు - విద్యార్థులతో కలిపివేసి మిగిలిన స్థానాలు నింపవలసింది. ఈ విధంగా చేయడంవల్ల వెనుకబడిన తరగతులకు ఈయవలసిన స్థానాలు ఇవ్వడం, మిగిలిన కులాలవారిలో అర్హులకు స్థానాలు లభించడం జరిగేది.

కాని ఈ విధంగా చేయడానికి, అధికారులు మొహమాట పడ్డారేమో ననిపిస్తుంది. అవసరించండి.

జంట నగరాలనుండి ఎన్నికైన విద్యార్థులు 49 మంది. ఇందులో వెనుకబడిన తరగతులకు కేటాయించబడిన స్థానాలు తొమ్మిది; షెడ్యూల్డు తరగతులకు, కులాలకు 6. 34 గురు అర్హతను బట్టి ఎన్నికైనారు.

ఈ ముప్పైనలుగురిలో ప్రథముడికి నూటికి 72.25 మార్కులు వచ్చాయి. చివరి అభ్యర్థికి 60.5% మార్కులు వచ్చాయి. వెనుకబడిన తరగతులవారిలో- కేటాయించబడిన స్థానాల్లో- ప్రథమునికి 59.5% వచ్చాయి; చివరివానికి 56% మార్కులు వచ్చాయి. షెడ్యూల్డు కులాలకు, తరగతులకు కేటాయించబడిన స్థానాల్లో మొదటివానికి 51.5% చివరివానికి 44% వచ్చాయి. సాధారణంగా కులాలతో నిమిత్తం లేకుండా ఎన్నికైన వారిలో ఐదుగురు వెనుకబడిన తరగతులవారు, ఒకరు షెడ్యూల్డు తరగతులకు చెందినవారు ఉన్నారు.

అధికారులు ఎవరికీ అన్యాయం జరగనీయని పద్ధతిలో నిబంధనలు చేసుకుంటే ఈ ఆరుగురు విద్యార్థులకి తప్పక స్థానాలు లభించేవి; కాని 44% వచ్చిన షెడ్యూల్డు తరగతుల అభ్యర్థి, 56% వచ్చిన వెనుకబడిన తరగతుల అభ్యర్థి మిగిలినవారితో సమానంగా పోటీ చేయవలసి వచ్చేది.

ఇప్పటి ఎన్నికవిధానం ఫలితంగా నూటికి అరవై మార్కులు తెచ్చుకున్న అభ్యర్థులకు స్థానం లేకుండాపోయింది వైద్యకళాశాలలో. నూటికి నలభైనాలుగు తెచ్చుకున్న విద్యార్థి రేపు ఇంజక్షన్ సూది పట్టుకొని మనవద్దకు వస్తాడు. ఈ ఉద్యోగాలలో కేటాయింపులు ఉన్నాయిగదా?

ఇంతకంటె అన్యాయం తెలంగాణా జిల్లాలనుండి వచ్చిన విద్యార్థులకు జరిగింది. అక్కడ (1) సాధారణ తరగతుల్లో 75.5%-57% మధ్య 88 విద్యార్థులకు, (2) వెనుకబడిన తరగతుల్లో 57%-54% మధ్య 20 విద్యార్థులకు (3) షెడ్యూల్డు తరగతుల్లో 51.5%.



మద్రాసు పోలీసు శతవార్షికోత్సవాలు ఇటీవల వారంరోజులపాటు జరిగిన సందర్భంలో 7వ తేదీన "కావలగ కడమై" అనే తమిళ నాటకాన్ని తమిళ సినిమా నటీనటులు ప్రదర్శించారు. ఈ నాటకంలో పోలీసు అధికారిగా పాల్గొన్న శివాజీ గణేశన్ పోలీసు ఇన్స్పెక్టరు జనరల్ శ్రీ బాలకృష్ణశెట్టికి ముఖ్యమంత్రి శ్రీ కామరాజ్ నాడార్ ద్వారా ఒక బిల్లు బహూకరించుచున్న దృశ్యం.

40% మున్న 6 గురు విద్యార్థులకు స్థానం లభించింది. అగ్రకులస్తుడనబడే విద్యార్థికి 56% మార్కులున్నా స్థానం లేదు. 40% మార్కులవానికి అర్హతవల్ల కాదు, చదువువల్ల కాదు; ఆలోచనాశక్తివల్ల కాదు–పుట్టుకవల్ల కాదు. తెలివితేటలమీద, అర్హతమీద పన్నులు విధించే చట్టాలు మరే స్వతంత్ర దేశంలోనూ ఉండవనుకుంటా.

వెనుకపడిన తరగతులవారిని ముందుకు తీసుకునిరావడానికి యత్నం చేయడం తప్పని కాదు. తప్పక కొన్ని కోట్లు కేటాయించి అభివృద్ధిచేయండి. సమానార్హతలుగల ఇరువురు అభ్యర్థులున్నప్పుడు–వెనుకబడిన తరగతుల అభ్యర్థులను తప్పక ప్రోత్సహించండి. ఉద్యోగాలలో అర్హతలననుసరించి జనాభాననుసరించి స్థానాలనివ్వండి. మంత్రివర్గంలో మరో మూడు నాలుగు స్థానాలివ్వండి. సమర్థులైన ఉత్సాహపరులైన యువకుల ఉత్సాహంపై పన్ను వేయకండి; ఇది దేశానికి మంచిది కాదు, భవిష్యత్తును నిర్మించుకునే సాధనం కాదు.

ఒకపక్క కట్టిన ప్రాజెక్టులు కూలిపోతూంటే, బాధ్యతలేని వైద్యులవల్ల రోగుల ప్రాణాలు ఎగిరిపోతూంటే–భవిష్యత్తు దిశైనా చూసి ఆనందించవద్దా మేము?

## 'నివేదికలగూరగంప'

'రద్దీరహదార్లు': జి. పి. ఓ. (రైల్వే పరిభాషలో) సంధివద్ద రద్దీను గురించి రాసిన వెంటనే చర్యతీసుకున్న అధికారులు అభినందనీయులు కాని– గమనించవలసిన విషయం మరొకటి ఉంది. ఏబిడ్సునుంచి తిలక్ రోడ్డు దిశ పోయే బండ్లకు అనుమతిచ్చిన సమయంలోనే డబుల్ డెక్కర్లు, కార్లుపోవడం తటస్థిస్తోంది. ఇవి రిక్షాలకు సైకిళ్ళకు కుడిప్రక్కలనుంచి వస్తాయిగదా! గందరగోళం ఏ విధంగా తగ్గినట్టు. ఇక్కడ ట్రాఫిక్ పరిస్థితిని ట్రాఫిక్ అధికారులు వ్యక్తిగతంగా వచ్చి పరిశీలించాలి.

'పేవ్‌మెంటు గందరగోళం': కుంభకర్ణుని ఖర్మమా అని నగరంలో అన్నిచోట్ల పేవ్‌మెంట్లు లేవు. పైన చెప్పిన సంధినుంచి అబీద్ కార్నర్ వరకు పేవ్‌మెంటున్నా, అవి చిన్న చిన్న దుకాణాలతోటి, పెద్ద దుకాణాలకు వచ్చే సైకిళ్ళతోటి నిండి ఉంటాయి. రోడ్డుకి అటూ ఇటూ కార్లు తోరణం కట్టి ఉంటాయి. మనుష్యులు రోడ్లపై నడవక ఏం చేస్తారు? ప్రమాదాలు జరక్కుండా ఎలా ఉంటాయ్? ఎవరో అధికారులు?– ఇది కూడా పరిశీలించాలి.

'క్యూపద్ధతి': బస్సుస్టాండువద్ద క్యూలు నిలబెట్టే బాధ్యత తనది కాదంటారు దైవాధీనం బస్ సర్వీస్ పెద్దలు. పైగా–'ప్రజల్లో క్యూ హేబిట్ లేదు' అంటారు పెదవి విరిచి. పేలెస్ టాకీసులో టికెట్ల కోసం క్యూలో నిలబడటంలేదా జనం? వారే ప్రక్కనున్న బస్సుకోసం ఎందుకు ఎగబడతారు? ప్రధానకార్యదర్శి ఇటు పోలీసు శాఖకి, అటు 'ప్రభుత్వ దైవాధీనం బస్ సర్వీస్'కి నాయకులు కనక, సమాచారశాఖ పంపే ఇంగ్లీషు అనువాదం చదివైనా వెంటనే చర్యతీసుకోవాలి. లేకుంటే– రోజురోజుకి లావౌతూన్న జేబుదొంగల జేబులు ఇంకా లావౌతాయి.



# "తమ మిత్రులు శత్రులగుట తథ్యము..."

"బలం కొద్దీ యుద్ధం
ఫలం భలే! సరిహద్దు!
కాలానికి లేదు హద్దు –
దేశానికి హద్దు గద్దు –
దలైలామా' నీవు.—
'టిబెట్ చాకొలెట్' నాకు
పంచశీల వదులే తీసుకో
పంచెన్‌లామా 'మా పక్షం' కొనుక్కో
మిత్రరాజ్య సమితిలో మాకుసీటు వద్దు –
శత్రుభోజ్య సమితిలో చైనా ఇప్పిద్దూ."

చైనా తన శబ్దవహాస్త్రాలు చూపి, మెక్‌మహోన్ రేఖ మాపి, దమననీతి చూపి, సరిహద్దులపై దురాక్రమణ చేస్తున్నట్లు ఒక శ్వేతపాత్రలు!

చైనా దురాక్రమణ, జీవితభీమా కార్పొరేషన్; ముంద్రా వ్యవహారం, జాతీయాభివృద్ధి మండలిలో ఆహార విషయంపై సుదీర్ఘ చర్చలు! ఈ వారం వార్తలలో ముఖ్యమైనవి.

చైనా విషయం ఆలోచించండి. చైనాకు సంబంధించి ఎవరి ప్రమేయమూ లేకుండా మనమే దానిని శ్రేష్ఠులంగా నిలచి బలపరచాం అనేకసార్లు. ఆఖరుకు మొన్న ఇండియాపై తీవ్ర అధిక్షేపణలతో చైనా పంపిన అధికార పత్రంలో కూడా ఇండియా 'స్వయం కృతాపరాధాలు' పేర్కొనబడ్డాయి! చైనాకు మిత్రరాజ్యసమితిలో సభ్యత్వం కోసం ఇండియా చేసిన కృషిని మరొకమారు ప్రధానమంత్రి స్మరించారు.

ప్రధానమంత్రి మాటలు కొన్ని గాలా ప్రాముఖ్యం వహించి ఉంటాయి. హంగేరీ విషయంలో ఎవరూ సైన్యాలను పంపలేకపోయారు. అలాగే టిబెట్ రక్షణకు కూడా ఎవరూ సైనికదళాలు పంపలేదని శ్రీ నెహ్రూ అన్నారు. "బ్రిటన్, ఫ్రాన్స్ దేశాలు ఈజిప్టును కబళించబోయిన తరుణంలో మాత్రం ఏం జరిగింది? ఇండియా సైనిక దళాలు ఈజిప్టు రక్షణకు పంపిందా? అసలు ఇండియాకు సంబంధించి సైన్యాల ప్రసక్తే లేదే– అయినా ప్రపంచ దృక్పథంలో ఇండియాకు ప్రముఖ, ప్రత్యేకస్థానం ఉంది.' ప్రపంచ ప్రజల సానుభూతిని, ఏకీభావాన్ని ఇండియా సాధు పొందగల్గడంవల్లనే ఈజిప్టు నుంచి బ్రిటన్ ఫ్రాన్సులు వైదొలగక తప్పింది కాదు" అని శ్రీ నెహ్రూ ప్రసంగించారు.

హంగేరీ విషయంలో ఇండియా ఎంతనిశితంగా విమర్శ జరిపిందో–దురాక్రమణ చేస్తున్న వారిపట్ల తీవ్ర అధిక్షేపణ తెలిపిందో, టిబెట్ విషయంలో అంతగట్టిగా ప్రవర్తించనేలేదు. చైనా దురాక్రమణను అంతగట్టిగానూ విమర్శించనేలేదు. దీనితో ఇండియాకు కమ్యూనిస్టులపట్ల, పాశ్చాత్య సామ్రాజ్యవాదులపట్ల విభిన్న దృక్పథాలు ఉన్నవనే అనుమానం బయలుదేరింది.

చైనాతో గల సరిహద్దు వివాదాలు మధ్యవర్తి తీర్పుకు నివేదించటానికి ప్రధానమంత్రి సుముఖంగానే ఉన్నారు. కొన్ని సరిహద్దు వ్యవహారాల్లో మధ్యవర్తి పరిష్కారాలకు ఇదివరలో ప్రధానమంత్రి తీవ్ర వైముఖ్యం ప్రకటించిన సందర్భాలూ ఉన్నాయి ఇండియాను రెచ్చగొట్టి చైనా యుద్ధానికి దిగదనే విశ్వాసం కూడా ప్రధానికి ఉన్నట్లు కనిపిస్తూ ఉంటుంది. రెండుదేశాలు కలసి తలపడితే నే కదా యుద్ధం. ఇంతకూ చైనాకేది కావాలో అది ఇచ్చేస్తే సద్దుమణిగితే ఇబ్బందేముంటుంది. చైనా టిబెట్‌ను పట్టుకున్నంత వరకు ఇండియా దలైలామాను వదలదు. టిబెట్‌ను చైనా దక్కించుకొనగా దలైలామాకు ఇండియా ఆశ్రయమిచ్చింది. చైనాదృష్టిలో దలైలామా "భారతదేశానికి పారిపోయిన చైనా పౌరుడు!" దలైలామా భారతదేశంలో ఉండి 'టిబెట్‌ను కబళించిన చైనా విధానాన్ని' నిరసిస్తున్నంతకాలమూ, మిత్రరాజ్య సమితిలో చైనాకు స్థానం సంపాదించిపెట్టడానికి ఇండియా చేసినకృషి చౌ–ఎన్–లైకి కూడా జ్ఞాపకంరాదు. వచ్చినా మనసు మార్చదు.

ఇవికాక మిగతావన్నీ చిల్లరమల్లర తగాదాలు. భూటాన్, ఈశాన్య సరిహద్దు ప్రాంతం, సిక్కిం, లడక్‌లలో చైనాకావాలంటున్న స్వల్పభాగాలు.

ఈ తగాదాల దుమారాలిలా ఉధృతంగా ఉన్నా శాంతియుత సహజీవనం స్ఫూర్తి చిహ్నంగా నిలిచిఉంది "పంచశీల". "పంచశీల"కు రెండు విలక్షణమైన లక్షణాలున్నాయి. పంచశీల ఒడంబడికకు లోనైన దేశాలు వదిలివేసే బయటి దేశాల ఆంతరంగిక వ్యవహారాలలో ఈ కూటమిలోని యే దేశమైనా కల్పిం

చైనా
లడక్
కాశ్మీర్
టిబెట్
లాసా
నేపాల్
సిక్కిమ్
భూటాన్
ఢిల్లీ
ఖాట్మండూ
అస్సామ్
అలహాబాదు
హిందూదేశము
కలకత్తా
బర్మా
బంగాళాఖాతము
మక్‌మహాన్‌రేఖ
నిర్ణయసరిహద్దు
అనిర్ణయసరిహద్దు

## "కృశ్చేవ్ అమెరికా వెళ్ళాడు"

లోకసహోదరినీకు కట్టనున్నది రాఖీ
ఒప్పుకో ఒప్పుగా దేవా! కృశ్చేవా!
ప్రపంచమనే పచ్చతోరణపు మంటపంలో
సోషలిస్టుస్నేహగీతాదేవి పాణిగ్రహణం చేసి
అందరినీ ఆనందింప చేయ్
వరుడా! ఐసెన్‌హోవరుడా!

అమెరికాతిథ్యం అనుభవించు
కృత్రిమ-ఇనుపతెరలు చించు
కృశ్చేవుడ! కోట్లకొలది జనుల "సేవ్" మయ్యా.
టాల్‌స్టాయి ఋషి పుట్టిన దేశపు
నేతను బంధింపు ప్రేమ పాశమున.
చేయీ చేయీ కలిపి వ్రాయండి
అభయ గీతం శాంతి లిపితో.

ఐకూ! ఇప్పుడు చిత్తగించకు పరాకూ!

—గోపాల చక్రవర్తి.

చుకోవచ్చు. ఇది ఒకలక్షణం. ఆ ప్రకారం టిబెట్‌ను కబళించిన 'చైనా అంతరంగిక వ్యవహారం'లో మాత్రం జోక్యం చేసుకో కూడదట! ఏ దక్షిణ ఆఫ్రికా శ్వేతజాతీయుల గొడవో అయితే ఫరవాలేదు.

పంచశీల యొక్క రెండవలక్షణం చేసు మరోటి ఉందని తెలియవచ్చింది. "పంచశీల" కూటమిలోని ఏ కమ్యూనిస్టు దేశమైనా సాటి దేశపు సరిహద్దు ప్రతిపత్తిని త్రోసి రాజనవచ్చు ననేది ఆ రెండో లక్షణం! లేకపోతే ఇండియాపట్ల చైనా వైఖరికి ఏమిటి వ్యాఖ్యానం?

'పంచశీల'ను గూర్చి ఇండియా ప్రకటించిన పుస్తకాల తాలూకు ప్రతులు మాత్రం చైనా జాతీయ పుస్తక భాండాగారాల్లో, గ్రంథాలయాల్లో భద్రంగా ఉన్నాయి.

1856 లో 'జర్నల్ ఇక్ టైమ్' అనే పత్రికలో ఏమియల్ ఇలా వ్రాశాడు. "దక్షిణప్రాంతాలపైకి తమ రాజ్యం వ్యాపించినప్పుడు గాని రష్యన్‌లు ఎంత దండశాసనులో తెలియరాదు. ఇదివరకు ప్రపంచం కని విని యెరుగని వింత నిషూంతలు పుట్టుకు వస్తాయి వారి హయాంలో పరిపాలన చీకటిలాగా నీరవంగా, మంచులా నిశ్చేతనంగా కరుడుగట్టుకుపోయి, ఇనుములాగ బలిష్ఠంగా ఉంటుంది. పరిహారం లేని బానిసత్వమే ఆ పరిపాలనా లక్ష్యం. పర్యవసానం."

ఇక ఇంకా కొత్తసంగతులు నేర్చుకొనడానికి రష్యన్‌లు పెకింగుకు పోవలసి ఉన్నారన్నమాట!

* * *

జీవితభీమా కార్పొరేషన్‌పై లోకసభలో జరిగిన చర్చ శ్రీ టి. టి. కృష్ణమాచారిని నిర్దోషిని చేసింది. తిరిగి కేంద్ర మంత్రివర్గంలో చేరే అర్హత ఆయనకు అపాదించింది. హెచ్. యం. పటేల్, జి. ఆర్. కామత్‌ల విషయమై యూనియన్ పబ్లిక్ సర్వీసెస్ నివేదికపై లోకసభలో ఏకగ్రీవంగా నిరసన, నిరాకరణ ప్రకటితమైనాయి. కాంగ్రెస్ పార్టీ నిధులకు ముంద్రా మొదలయినవారు విరాళాలు కట్టబెట్టారని ఆరోపిస్తూ వివియన్ బోస్ కమిషన్ కూడా విమర్శించింది. అయితే ఒకటి. చాగ్లా కమిషన్ గాని, వివియన్ బోస్ కమిషన్ గాని పూర్తిగా నిజమేమిటో తెలుసుకోవడం సాధ్యం కాలేదని అంగీకరించాయి. పార్లమెంటు సభ్యులుకూడా ఇప్పుడిక అసలు నిజం బయటికి రావాలని పట్టుదలగా లేరు. హెచ్.ఎం. పటేల్ ను, తదితర సర్వీసు ఉద్యోగులను విమర్శించడంలో వారు సేట్ సాహెబ్ ముంద్రాజీని పూర్తిగా విస్మరించినట్లు కనపడతారు. టర్నర్ మోరిసన్ సంస్థానాలు మించిపోతున్నా ఆయిన ఏస్టేట్ల పెరుగుదల ఎవరూ గుర్తించినట్లే కనపడదు. ఈ వాటాలగొడవ సమగ్రంగా కూపీలు లాగి తేల్చినట్లే లేదు. మొత్తంమీద ప్రభుత్వమూ ముఖ్యంగా జీవితభీమా కార్పొరేషనూ కూడా గుణపాఠం నేర్చుకున్నాయని శ్రీ ఫిరోజ్ గాంధి విశ్వసించి ఉండవచ్చు. ఆయన విశ్వాసం నిజమో అబద్ధమో భవితవ్యమే తేల్చవలసి ఉంది.

ఇక్కడే ప్రయివేటు, పబ్లిక్ రంగాలకు గల ప్రధాన వ్యత్యాసం తేటతెల్లం కాగలదు. ముంద్రా ప్రయివేటు రంగంలోనిభీమా కంపెనీలద్వారా ధరవరల హెచ్చు తగ్గులు జాగ్రత్తగా కనిపెట్టి మరీ దిగినట్లు కనిపిస్తుంది. తెలివి తక్కువగా దిగినవి కూడా చివరకు లాభాలు చేకూర్చి పెట్టాయంటే ఏమిటి అంతర్యం? ఏది ఏమైనా ముంద్రా వాటాల తొలగింపుపట్ల జీవితభీమా కార్పొరేషన్ ఏమీ ఆతురత చూపుతున్నట్లు తోచదు.

ఈ 'లోలో' గొడవల ఆలోచన పార్లమెంటుకూ పట్టినట్లు కనిపించదు.

* * *

ఆహార విధానం పూర్వంలాగా 'యథాప్రకారం' ఉండిపోవాలని మొన్న జాతీయాభివృద్ధి మండలి సుదీర్ఘ చర్చల ఫలితం!

ఇటీవల కొన్ని మాసాలుగా ప్రభుత్వ ఆహారవిధానం తీవ్ర విమర్శకు గురి అవుతున్నది. వాద దావాగ్నిలో పడ్డ ఈ ఆహార విధానాన్ని రక్షించాలనుకుంటే అప్పటి ఆహారమంత్రి శ్రీ అజిత్ ప్రసాద్ జైన్ రాజీనామా యివ్వక తప్పిందికాదు. అయితే దానికింకొక కారణమూ ఉన్నది. బహిరంగంగా ప్రభుత్వ ఆహారవిధానం విఫలమైందని శ్రీ జైన్ ప్రకటించడమే అందుకు కారణం.

శ్రీ ఎస్. కె. పాటిల్ నూతన ఆహార మంత్రిగా నియుక్తులయినారు. రాజ్యసభా ప్రాంగణంలో ఆయనచేసిన ప్రథమ ఉపన్యాసంలో (ఆహారమంత్రిగా) ప్రభుత్వపరంగా ఆహారధాన్యాల వ్యాపారానికి తమ తీవ్ర వ్యతిరేకతను ఆయన తెలియజేశారు. కాగా ఎన్నడూ కలిసి (ఏపనీ చేయని) రాని ప్రణాళికా సంఘం, ఆహార వ్యవసాయ మంత్రిత్వశాఖ, సామాజికాభివృద్ధి, సహకార నీటిపారుదలశాఖలు, రాష్ట్ర ప్రభుత్వాలు ముందు ఒక్క తాడుమీద నిలబడి కలసికట్టుగా సహకరించాలని శ్రీ పాటిల్

(54-వ పేజీ చూడండి)

# సౌష్ఠవం



అప్పుడే టైలరు పెళ్ళి బట్టలు ఇచ్చివెళ్ళేడు.

జరీ జాకెట్టు తొడుక్కుని సావిత్రి అద్దం ముందు నిలుచుంది. కోయంబత్తూరు పట్టు జాకెట్టు-ఆకుపచ్చరంగుది నాలుగువేళ్ళ వెడల్పున మంచిరకం జరీ అంచు దీనికి 'మేచ్' అయే చీరకట్టుకోవాలని ఆమెకు అనిపించింది. ముందురోజున ఆయన కొని తెచ్చిన కాశ్మీరు సిల్కు చీర - లేతాకు పచ్చది కట్టుకుంది.

ఎంతబాగుంది!

ఈసారి తను ఎంత నిండుగా ఉంది!

ఈ చీర ఖరీదు డెబ్భైఅయిదుట.

ఇన్నాళ్ళకి...ఇన్నేళ్ళకి తను డెబ్భై అయిదు రూపాయిల చీరకట్టుకుంది.

సావిత్రి ఒళ్ళు పులకరించింది.

'ఏం సావిత్రీ' నన్ను మరిచిపోయావా? ప్రతిబింబం ప్రశ్నించింది. 'ఎందుకు మరిచిపోయానూ? నిన్ను మరిచిపోలేను కాబట్టే-నీతో పోల్చుకుంటున్నాను కాబట్టే నాకిప్పుడింత ఆనందం!' అనుకుంది సావిత్రి. అమ్మ ఎక్కడ సుఖపడిపోతుందో అని పిల్లలంతా తరుముకొచ్చారు గాని అప్పటికి తన కింకా పాతిక నిండలేదు!

ఈ సంసారపు ఖర్చులు ఎప్పుడూ ఉన్నవే అనుకుని-కాపురానికి వచ్చిన ఎనిమిదేళ్ళలోనూ మొదటిసారి స్వతంత్రించి-పక్కింటావిడ తెప్పించుకుంటూంటే తనూ సరదాపడి-వెంటనే డబ్బు అడగని పద్ధతిలో మైసూరు జార్జెట్ చీర ఏమైతే అయిందని తెప్పించేసుకుంది. సరి...ఆ డబ్బు తీర్చడం కోసం ఎన్ని పాట్లు పడిందో...

'ఏమండీ,ఏమండోయ్...ఇలాచూడండీ... కొట్టువాడు ఇవాళే యింటికొచ్చి అడ్డమయిన మాటలూ ఆడి వెళ్ళేడు. అయినా అంటే వాడిది తప్పా? ఎన్నాళ్ళని తిప్పుతాను? ఈ నెలకి ఓ ఇరవైయేనా వాడిచేతిలో పెత్తేగాని,

...ఇరవై కాకుండా ఒక్కదమ్మిడీ అయినా ఇవ్వను. ఈ నెలకాదు కదా పన్నెళ్ళు అయినా ఇవ్వను. నన్నడక్కుండా నిన్నెవడు ఆరెట్టుకోమన్నాడు? ఈ పెత్తనం ఎవడిచ్చాడంట? చంటి పిల్లలా సరదాలూ నువ్వూ సిగ్గులేదూ? మొగుడిచేత ఇలాంటి మాటలు బాగా అలవాటయిన సావిత్రికి నిజంగా సిగ్గూ లేదు. అభిమానమూ లేదు. ఆమె కంట్లో కన్నీళ్ళు తిరగలేదు. ఏదో బుద్ధి తక్కువ కొద్దీ నే కొన్నాను. తీరా ఇన్నాళ్ళయాక వాడు తిరిగి పుచ్చుకోడుగా. ఏమండీ ఇదిగో ఒక్క పదిహేనైనా ఇవ్వండి మీరు సిగరెట్లకి తగలేసే వంతలేదూ...'

సొమ్మయ్ హాయిష్ మెచ్చినట్టు నేను ఖర్చు పెడతాను. నువ్వెవరివి నన్నడగడానికి?

ఆయన అనడమూ బాగానే ఉంది తను పడడము బాగానే ఉంది. ఆ మధ్య సుశీల జబ్బుగా ఉందని తెలిసి పుట్టింటికి వెళ్ళినప్పుడు తను ఆవిడ్ని కదిపి చూసింది.

'అమ్మా, ఓ యాభైరూపాయలుంటే ఇద్దూ తరవాత పంపుతాను...'

అయ్యో బాబోయి యాభైరూపాయిలే! నేనెక్కడ తెచ్చేది సావిత్రీ? ఈయేడాది సిస్తులయినా సరిగ్గా వసూలుకాలేదు. ఇంట్లో ఖర్చులు నువ్వు ఎరగంది ఏముందే?

అడిగిందే తడవుగా ఆవిడ అన్నీ ఏకరువు పెట్టింది.

పెద్దాడేమో మళ్ళీ బీకాం గుద్దించేసి ఇంట్లో అఘోరిస్తున్నాడుట.

రెండోవాడికి యింకా ఎక్కడా సీటు రాలేదు, అప్లికేషన్లకే ఎంతయినా అవుతోందిట.

ఇక సుశీల పరీసరి టైఫాయిడ్తో యిల్లు చేరుకుంది. ఏదో బతికి బయటపడింది గాని దాని ఇంజక్షన్లూ పళ్ళరసాలు టానిక్కులకీ, నెలకి యాభై పైగా అవుతోందిట.

ఇక సూరేశు పరీసరి...ఒళ్ళోకెళ్ళే పిల్లా...దాని బట్టలూ పుస్తకాలూ తిప్పని పరి ఖర్చుట.

ఇక ఆఖరాడు ఎస్సెస్సెల్సీ అక్టోబరుకి చదువుతున్నాట్ట. వాడి ప్రవేటు మేష్టారికి నెలకి ఇరవైట.

ఇంకా ఎన్ని టాటాలు ఉన్నాయిటో!

ఇవన్నీ ఎవరికి తెలియనివిటా? అక్కడితో అపుతే బాగానే ఉండును.

'ఈ పిల్లల్ని నాకు అంటగట్టి తవదారి తను చూసుకున్నారు. దిక్కుమాలిన దాన్ని ఆయనతో నేనూ వెళ్ళలేక పోయాను'

అమ్మ కళ్ళనీళ్ళు తుడుచుకుంది... సావిత్రి మొహం ముడుచుకుంది. తల్లీ తోడూ అంటారు. ఇదేకాబోలు. అందుకనే అవాళ వచ్చేస్తూంటే ఆవిడ రైలు ఖర్చులకని పదిహేను రూపాయలు తనచేతిలో పెడితే ఏమందీ?

'నా కక్కర్లేదమ్మా, చాలా యిచ్చావ్, చాలా పుచ్చుకున్నాను...చాలు...నీ దగ్గరే ఉంచు. వచ్చేజబ్బు వస్తున్నా పాపం నీకు బోలెడన్ని ఖర్చులూ, నువ్వేం చేస్తావ్'

ఆవిడ మొదట వెలవెలబోయింది— అంతట్లో ఎలా వచ్చిందో ఆ నవ్వు ముసిముసిగా నవ్వింది...

'అంతట్లోనే తేలిపోయావుటే నా తల్లీ...ఏమంటే అన్నావు గాని సొమ్ము తీసుకో...

ఇష్టం లేదు గాని సొమ్ము ముఖ్య విశేషం, అవసరం అంతటిది...తను పుచ్చుకోబోతూంటే ఆవిడ మరోపుల్ల విరుపు మాట అందించింది.

'...మొత్తానికి మా అల్లుడు బాగానే నేర్పాడే మాటలూ!'

'మధ్యని ఆయనెందుకు అనవసరంగా ఆడిపోసుకుంటావ్. నువ్వు ఇవ్వనూవద్దు, నేను పుచ్చుకోనూ వద్దు. నీకు మా కిచ్చే పక్షంలో అసహజపు ఖర్చులు గాని తక్కినవన్నీ అతి సహజమేగా! అయినా ఇందులో ఆయన మాట ఏముంది గనక? ఆడకూతుర్ని అభిమానం చంపుకోలేక దేవులాడుతున్నాను గాని నాకు లేకపోయినా ఆయనకింకా మిగిలి ఉందిలే సిగ్గు! మళ్ళీ మీగుమ్మం తొక్కరా?'

ఈసారి ఆవిడ వంచిన తలెత్తలేక పోయింది. లేకపోతే...ఊరుకుంటూంటే మీద మీదకు వస్తుందా?

ఒక్క చీరకు ఇంత అల్లరా? ఆ తరవాత ఏడాదిన్నరపాటు నానా యిబ్బందిపడి మిగిల్చి ఆ చీరడబ్బు కొట్టువాడి మొహాన్ని కొట్టేందుకు తను ఎన్ని పాట్లు పడిందనీ!

ఇవాళ...తను...హాయిగా...మొగుడు కొని తెచ్చియిస్తే...దర్జాగా...ఒకటికాదు, రెండుకాదు డబ్భై అయిదు రూపాయల కోక కొనుక్కుంది! తను 'జహీ' అని ఎవర్నీ అడగనక్కర్లేదు.

ఎవరి పెట్టుపోతలూ తనకి అక్కర్లేదు.

నిజానికి డబ్భై అయిదు రూపాయల చీర కొనే స్తోమతు ఆయనకి ఎక్కణ్ణుంచి వచ్చిందీ?

వెయ్యి రూపాయిలు చేతిలో పడబోతున్నాయి కనక.

'వెయ్యి రూపాయిలే! 'ఎక్కడివీ?' ప్రతిబింబం నిలదీసింది. సావిత్రి మొహం ముడుచుకుంది.

'నీకక్కర్లేనివి లేవు...అన్నీ తెలిసి తెలియనట్టు అడుగుతావు. అందుకనే నువ్వంటే అందరికీ ఒళ్ళుమంట.

అని విసుక్కుంది సావిత్రి. విసుక్కుంటూనే జరిగినది తలుచుకుంది. ఎప్పుడూ లేంది ఆ రోజు...అంటే ఇది పదిరోజుల క్రిందటి ముచ్చట...ఆయన చాలా హుషారుగా ఉన్నారు. పిల్లలికి పీచు మిఠాయికొని తెచ్చి పెట్టేరు. తనకేమో యిష్టమని మల్లెపువ్వులు తెచ్చియిచ్చారు. పిల్లలు భోంచేసి పడుకోగా... పెద్దది ఎంగిళ్ళు తీస్తూంటేగా తిన్ని డాబామీదకి రమ్మన్నారు.

'మీ సూరీడుకి మంచి సంబంధం కుదిర్చాను.'

ఎవరి గుణాలు వారికి ఉండుగాక— సావిత్రి మాత్రం చాలా సంతోషించింది.

'ఎంత మంచికబురు చెప్పేరండీ...పాపం ఒక్కత్తీ నానా కష్టాలూ పడుతోంది. ఈ ముద్దు దాని పెళ్ళి అవదేమో అని మా అమ్మ మంచం కూడా ఎక్కింది. వయస్సొచ్చినా మా తమ్ముళ్ళ వల్ల ఎటువంటి సాయమూ లేకపోయె...ఇంతకీ ఎవరూ, ఎక్కడా...ఏమిటీ...'

ఎక్కడో కాదు ఈఊళ్ళోనే ఉన్నారు. అబ్బాయి ఎం ఎస్సీ చదువుతున్నాడు. బావుంటాడు కూడా...తండ్రి లేడుగాని తల్లి సుబ్బమ్మగారని ఉంది. ఒక్కడే కొడుకూ...బోలెడంత ఆస్తి...స్వంత ఇల్లూ...మావి తోటా...'

'హాయండి బాగుంది...కట్నం ఎంతా?'

చూస్తుండగానే ఆయన మొహం మారిపోయింది.

'ఈ రోజుల్లో ఏమంత ఎక్కువలే, ఆరువేలు.'

'అమ్మయొయ్యో ఆరువేలే...మూడు వేలు దాటి ఎవరికీ ఇచ్చెగగదే ఆరువేలే,!' ఎక్కణ్ణుంచి తెస్తుందండీ...'

'లేకపోతే, తెచ్చిన సంబంధాలన్నీ ఇలా తిరక్కొట్టేస్తూంటే నువ్వుకూడా మీ అమ్మతో కలిసి కట్టకట్టుకుని గంగలో దిగు. నాకేం? పదిమంది మనుషులు పది కాలాల పాటు తినే ఆస్తుందే...కనుచూపు మేర ఎక్కడ చూసినా పెద్దలు గడించి పారేసిన భూములున్నాయే...లంకంత స్వంత ఇల్లుందే...బంగారు కణికెలు చేయించి కూడా పటిగాసుతుందా ఆవిడ? మన పెళ్ళినాడు ఏం పెట్టిందో అంతే. గొర్రెతోక జీతంతో ఒంటిచేతి సాయంతో పట్నంలో నెగ్గుకొస్తున్నానే...కాణీ కళ్ళజూపిందా ఆవిడ? మంచిగా కుదరనిచోట వంచనే మందు. నిజం చెప్పవలసి వస్తే ఆ కట్నంలో నాలుగు వేలు అతనివీ, వెయ్యి రూపాయిలు మనవీను...'

ఆయన నాలిక్కరుచుకున్నారు. తను తెల్లబోయి ఆయన వైపు చూసింది.

'ఆ దేలోపాయి కారీ ఏర్పాటు, అంతే...'

సావిత్రి గుండె దడదడ కొట్టుకుంది. ఆమె పెదవులు వణికాయి. ఆమెలో ప్రతి అణువూ వద్దు...వద్దు...అని అరిచాయి.

'మనకొద్దు. ఇలాంటి కక్కుర్తి పనులు మనకి ఎంతమాత్రం వద్దు. వద్దొద్దు. దీనికి నే నెంతమాత్రం ఒప్పుకోను'.

అంత గట్టిగానూ ఆయన అరిచారు. 'అవును, ఎందుకొప్పుకుంటావు? "ఒక కోడల్ని ఒకలాగా ఇంకో కోడల్ని మరోకలాగా చూసే అత్తలు చాలామంది ఉన్నారు. కాని ఒక కూతుర్ని ఒకలాగా మరొక కూతుర్ని ఇంకోలాగా చూసే తల్లులే అరుదు. కొంచెమేనా సిగ్గూ అభిమానమూ ఉండి జరిగినది జ్ఞాపకం తెచ్చుకుంటే సరి...'

ఆయన గబగబా క్రమెట్లు చప్పుడు చేసుకుంటూ దిగిపోయారు.

ఆయన మాటా పూర్తిగా కొట్టిపారెయ్యడానికి వీల్లేదు మరి.

అయిన అనుభవాలు అలాంటివి.

తన పెళ్ళికి ఆయనకి వెయ్యినూటపదహార్లు కట్నమిచ్చారు.

తన పెద్దచెల్లి తాయారు మొగుడికి మూడు వేలు యిచ్చారుట. ఇస్తే ఇచ్చారు ఎవరికి

# ★ స్వార్థం ★

కావాలిటా? ఎవడికొచ్చావాలీ పెద్ద సొమ్ము? చిత్రం, అమ్మమాట మాత్రమయినా తనతో చెప్పలేదు. పోనీ, అలా అని ఊరుకుందా ... వీళ్ళతో వాళ్ళతో రహస్యంగా అంటుందిటా—

'బాబ్బాబు, గంపెడు పిల్లల తల్లిని... ఒంటి ఆడకూతుర్ని ... ఇలా మూడు వేలు యిస్తున్నామని వాళ్ళకి తెలియనియ్యకండి బాబూ, మా పెద్దల్లు నసలే కోపిష్టి...ఆయనతో వెయ్యినూట పదహార్లనే చెప్పండి' ఆవిడ అతి గడుసుతనంగాని ఇలాంటివి దాగమంటేమాత్రం దాగుతాయా? ఇంకా ఒక అడుగు అవతలే ఉంది, ఆ వియ్యాలాగు కష్టం సుఖం చెప్పుకోవలసినవాళ్లూ–ఇంటికి పెద్దల్లుడూ, పెద్దకూతురూ పరాయివాళ్లూ అయిపోయారా? ఆయనకి ఒళ్లు మండిందంటే మండదూ? ఎందరెన్ని చెప్పినా వినకుండా, పెళ్లికయినా ఉండకుండా లేచి చక్కాపోయారు. ఇంకా అంతో ఇంతో నుంచివారు కాబట్టే తన్నయినా ఉంచారు. అదీ గ్రహించినవారు లేరు.

రెండో చెల్లి సుశీల పెళ్లికి రాను మొర్రో అని ఆయన భీష్మించుకూచుంటే పెద్ద తమ్ముడువచ్చి బలిమాలి తీసికెళ్లేడు.

అయితే అంత భేదబుద్ధి అయితే మనసులు విరిగి పోయాయంటే విరిగిపోవూ? తాయారు మొగుడికేమో నాలుగువేళ్ళ వెడల్పుజరీ అంచుపంచె పెడితే ఈయనకేమో మూడువేళ్ల వెడల్పుది పెడుతుందా? ఏమీ అని అనుకుంటే.

అయ్యొయ్యో...ఎంత పొరపాటు జరిగిందీ! గుడ్డిదాన్ని సరిగ్గా చూసుకోలేదు తల్లీ...కొట్టువాడు ఒడానికొకటియిచ్చాడు కాబోలు. మళ్ళీ మరోపంచె వెంటనే తెప్పించి ఇస్తాగా అని నలుగురికీ వినపడేలా రాగాలు మొదలెడుతుందా? తనకే కారం రాసినట్లయిందే,ఆయనకి ఒళ్లు మండిందంటే మండదూ?

'అక్కర్లేదండీ...చేసిన అవమానంచాలు అయినా మీతప్పు ఏముందీ? ఆయనేమో డాక్టరూ, రెండు చేతులా సంపాదిస్తున్నాడు. నేనా బతికలేని బడిపంతుల్ని. ఎవరి తాహతుకి తగినట్టు వారికి పెట్టేరు. మీ తప్పేముంది?'

అంతే. ఇలా మూడుముళ్లూ పడ్డాయో లేదో తన కుటుంబం రైలెక్కారు. అంత సులువుగా మరిచిపోయే అనుభవాలా యివి? వాళ్లంతా ఉన్నవాళ్లు, తనులేంది. అందుకే అమ్మవాళ్లకే పెడుతుంది. తల్లివనీ తండ్రివనీ ఇది బొత్తిగా అన్యాయం. అన్యాయానికి అన్యాయం చెయ్యడమే న్యాయం. ఇంతకి ఇదెవరిసొమ్ము గనక తనతల్లి సొమ్ము తనుతింటే తప్పా? 'లేదు...లేదు...తప్పు లేదు...' అనుకుంది సావిత్రి అయిదు వేలలో వెయ్యితనవి. అయినా అనుకోడంలో ఉందిగాని ఆవిడ నిజంగా అయిదు వేల కట్నం యివ్వలేదా యేమిటి? అయిదు వేలేం కర్మ పదివేలయినా గుమ్మరించగలదు.

అంగీకరించడానికి సిద్ధమయ్యేసమయంలో సావిత్రి మనస్సులో ఒక సందేహం విద్యుత్తులా ప్రవహించింది ... నిలువెల్లా పీడించింది... అన్నీ బాగున్న సంబంధం ... మొగపెళ్ళివారు ... పెళ్ళికొడుకు తల్లి యీయన్ని బతిమాలుకుని ఈయనకి లోపాయికారీగా వెయ్యిరూపాయలు లంచమియ్యకోవలసిన అవసరం ఏమొచ్చింది? పెళ్ళికొడుక్కి ఏదయినా, ఏదయినా లోపం ఉందా?

ఆయన మళ్ళీ డాబా మీదకి రాగానే అడిగేసింది. చెప్పేదాకా ఊరుకోలేదు. 'ఆ అబ్బాయి కేం, కడిగిన ముత్యం. ఏ విధాన్ని చూసినా లోటులేదు. అయితే ఆ సుబ్బమ్మగారు బాగా గయ్యాళిదని గంజాం అంతా ప్రసిద్ధిట. వాళ్ళమధ్య మన వైపు వచ్చేశారు. ఆస్తంతా ఆవిడ పేరే ఉందిట. ఎవరి పేర్న ఉంటే మనకేం? కొడుక్కి పెట్టక ఏం చేసుకుంటుంది? కాస్త నుంచి మాట అడుతే ఇట్టే లొంగదీసుకోవచ్చు... ఇంతకీ కోడల్ని అనని అత్తగారెక్కడుంటుంది గనక?... ఏం అలా చూస్తావ్, మీ నూరీడు ఏమీ కష్టపడిపోదు లే...అసలంతా స్థిరపడి పోయింది కూడాను ... ఆవిడ మన పిల్లని ఎక్కడో చూసిందిట. చాలా నచ్చిందిట. ఎలాగయినా దీన్నే చేసుకుందామని పట్టుపట్టి నన్ను కబురంపించి అడిగింది. నే నేం చెప్పినా ఎంత చెప్పినా ఒప్పుకునేలా ఉంది. అయినా నేను తొందర పడ్డానా? ఊహుఁ ఒక్క వెయ్యి మనదనుకున్నాను. అంతే. ఇది నాకూ ఆవిడకీ తప్ప ఆవిడ కొడుక్కైనా తెలీదు. అప్పుడే పెళ్ళికొడుకు వెళ్ళడం, పిల్లని చూసుకోడం మీ అమ్మ వాళ్ళడిగిన కట్నానికి ఒప్పుకోడం అన్నీ జరిగేయి. ఒక్కసారి చెప్పి నిన్ను ఆశ్చర్యంలో ముంచెద్దామని ఊరుకున్నాను. అంతేకాదు. మీ అమ్మ మూడెకరాల భూమిని అమ్మకానికూడా పెట్టిందట. సొమ్ము వసూలు కాగానే నా ద్వారా సుబ్బమ్మగారికి అందజెయ్యడానికి కూడా ఏర్పాటు పూర్తయింది. ఈ దెబ్బతో మనకి

మనకీ కొంచెం విరోధాలుకూడా తగ్గుతాయి. ఏం, అలాతగ్గడం నీకు యిష్టం లేదా ?'

'బాగుందండీ నాకిష్టంలేకపోడవేమిటి... అబ్బాయి అన్నివిధాలా బుద్ధిమంతుడంటున్నారుకదా...సరే...అయినా అడిగిపుచ్చుకుంటే ఇస్తుందేమో ఈసారిగట్టిగా అమ్మనడిగిచూదాం...ఇది మోసంకాదా అని' ఈసారి ఆయన భగ్గుమని తనమీద మండిపడ్డారు.

'అబ్బే ఇదేమోసం ఆనాడు మీ తాయాగారు పెళ్ళికి మూడువేలు కట్నమిచ్చి నలుగురి దగ్గరా వెయ్యినూటపదహారు అని చెప్పడం మోసంకాదు! అవును. ఈ ప్రపంచంలో ప్రతీదీ మోసమే. ఉన్నమాట పెళ్ళాంబిడ్డలకి చెప్పకోడంకూడా మోసమే. నేను నేనైచెప్పాను కాబట్టి నీకీ సంగతి తెలిసింది. చెప్పకపోతే ఏంచేసునో...'

# ★ స్వార్థం ★

ఈదెబ్బతో తను పూర్తిగా ఓడిపోయింది. నిజమే. తనొకటీ ఆయనొకటీ అనుకోని మనిషి కాబట్టే ఈసంగతి తనకి తెలియ బరిచారు. చెప్పకపోతే ఆయన్ని అడిగేవారెవరు?

అదిగాక ఒకటా రెండా వెయ్యిరూపాయలు. స్కూలుమేష్టరు జీవితంలో వెయ్యి రూపాయలు విలువ ఎంత ఎక్కువైనది! అయినా తిన్నగా అడుగుతే ఆవిడ ఎప్పుడిచ్చింది గనక! సుశీల మొగుడు ఫారెన్ వెడతానంటే అమ్మ వెయ్యిరూపాయలు నిలుచున్నపళంగా ఇచ్చింది. అప్పుఅని పైకి చెబుతుంది, ఎవడు నమ్ముతాడు? స్కూలికీ ఇంటికీ దూరమనీ సైకిలు కొనుక్కుంటానని ఆయన మూడేళ్ళనుంచి అడుగుతూంటే ఇదిగో అదిగో అనడమేగాని కొనికళ్ళ జూపిన పాపాన్నిబోయిందా? తల్లేమిటి పిల్లేమిటి, ఎలాంటివాళ్ళకి అలా చెయ్యాలి.

'మీరలా చెబుతే అలా మసిలేదాన్ని, ఆడదాన్ని...నాకేం తెలుసు? మీరు చెప్పింది సబబే అనిపిస్తోంది. మీయిష్టం' అనేసింది.

'అమ్మ అలా అద్దంముందు ఎంతసేపు కూచుంటావే? ఇలా చూడు, ఎలా ఉన్నాయి నాబట్టలు?

సావిత్రి నిద్రలోంచి లేచినట్టు—అటునుంచి యిటు తిరిగి చూసింది. పెద్దకూతురు ఇందిర అప్పుడే టైలరు తెచ్చిన కొత్త పరికిణీ జాకట్టు కట్టుకుంది. పక్కింటి శేషు అత్తిచేత జడ వేయించుకుని మూడు గుప్పాలులూ అయి వచ్చింది. అదేకాదు, అందరూను.

'నావెలా ఉన్నాయే?' అని ముందుకొచ్చింది రెండోది, సీత.

'నావో, మరినావో' అంటూ అందరూ తన్ని చుట్టబెట్టేశారు. ఆఖరికి ఏడాదయినా వెళ్ళని బాబీగాడు పహా-బాడీ మేజారు ఒక కాలిలోనే రెండు కాళ్ళూ ఎక్కించుకుని బోర్లాపడ్డాడు. చిట్టి వాణ్ని లేవదీసి సరిగ్గా తొడిగింది'

'మరి నా బత్తిలో' అంటూ వచ్చీ రాని మాటలతో అమ్మనడిగాడు. సావిత్రి వాణ్ణి ఎత్తుకు ముద్దెట్టుకుంది.

'అందరి బట్టలూ భేషుగా ఉన్నాయి' అంటే పిల్లలు సావిత్రిని విడిచిపెట్టలేదు. అందరికన్నా ఎవరివి బాగున్నాయో చెప్పి తీరాలన్నారు.

'ముందు బాబీగాడివి బాగున్నాయి. తరవాత వేమో చిట్టివి.'

'అవును—తెల్లగా ఉంటాడని వాడంటే నీకు ముద్దూ. వాడికి సైలానుగుడ్డ తీసుకుని నాకు మామూలిది కుట్టించావు. ఛీ—యీ చొక్కా నాకొద్దు.' అని అయిదేళ్ళ రఘు ఏడుపు ప్రారంభించాడు.

'నీకు బాగా సాయంచేస్తుందని చిట్టంటే నీకు యిష్టమూ. అందుకనే దానికి మంచి మంచి రంగులూ ఎంచి కొంటావు.'

అని ఇంకా ఏమో అనబోతోంది సీత; సావిత్రి ఫెళ్ళుని ఒక్క లెంపకాయ వేసింది. ఆచేత్తో రఘుకీకూడా ఒకటి వేసింది.

'ఛీ....వెధవల్లారా....చిన్నప్పట్నుంచీ వెధవ గుణాలూ మీకూను. పొండి అవతలకి పొండి...పోతారా పోరా.'

పక్కింటి శేషులత్త పరుగెత్తుకుని వచ్చింది.

'పనివేళా పిల్లల్ని ఏడిపించావుటమ్మా... మాకుంచిదాన వేనమ్మా సావిత్రమ్మా! మీరూ నలుగురు అప్పచెల్లెళ్ళు ఉన్నారు. ఒకరికన్నా ఒకరికి తక్కువా అని ఎప్పుడూ అనుకోనే లేదుటమ్మా. నోరెరగని గుంటనాగమ్మలు కాబట్టి వాళ్ళని చావగొట్టేవ...ఇదే పెద్దవాళ్ళయితే వాళ్ళనెవరేం చెయ్యాలో' అనుకుంటూ పిల్లల్ని వెంటబెట్టుకు పోయింది. సావిత్రి నోట మాట రాలేదు!

ఈ పిల్లల దెబ్బలాటలు ఎప్పుడూ ఉన్నాయి, ఈ విడి వెనకేసుకు రాడమూ ఎప్పుడూ ఉంది. కాని ఇవాళ ఆవిడడిగిన ప్రశ్నలు. మళ్ళీ మళ్ళీ గుచ్చి గుచ్చి తన్ని బాధిస్తున్నాయి...ఆ ప్రశ్నలు ఆవిడని ఎంతగా కలచివేశాయో ఆమె మొహం చూస్తేనే తెలుస్తుంది. కాని సావిత్రి మొహం ఎలా ఉందో ఎవరూ చెప్పడం కష్టం. ఎంచేతంటే రెండు చేతులతోనూ మొహాన్ని దాచుకుని మోకాళ్ళమీద పెట్టి కూర్చుంది. ఎంతసేపు కూచుందో గాని ఎవరో తలుపుతట్టినప్పుడు మాత్రం మొహాన్ని చేతుల్ని తొందరగా చీర చెంగుతో తుడిచేసుకుని తలుపు తీసింది. ఆ వచ్చింది వాళ్ళవూరు మునసబు రామయ్య.

'ఇదేమిటి బుల్లెమ్మగారూ ఎన్నిసార్లని తలుపు కొట్టనూ...అరచి అరచి నోరు నొప్పెట్టి పోయింది. ఇంట్లో లేరేమో అనుకున్నాను...అదేమిటి— ఆ బుగ్గల్నిండా ఆ మరక లేమిటి, ఏడుస్తున్నారా?'

సావిత్రి అప్పటికిగాని ఈ లోకంలోపడలేదు.

'అబ్బెబ్బె నిద్దరోయానండీ... నాన్న కల్లోకి వచ్చారూ...'

మునసబు కళ్ళు పైచెంగుతో తుడుచుకున్నాడు.

'ఎంతటి పర్మాత్ముడు! బతికిన నాలుగు రోజులూ హంసలా బతికాడు...మాఇంటి బుల్లెమ్మగారూ, ఈ కవరు అమ్మగారు మీ కిమ్మన్నారు. పట్నంలో కోర్టుపనుండి వచ్చాను తల్లీ...కవర్లో సొమ్ముందిట... లెక్క చూసుకోండి. మళ్ళీవస్తా వేళయిపోతోంది'.

'భోజనానికి ఇక్కడికే రావాలిసుమండీ' అని సావిత్రి అనేలోగానే ఆయన దాటేశాడు. హడావిడిమనిషి. సావిత్రి గబగబా కవరువిప్పింది. పది వందరూపాయలనోట్లూ ఒక ఉత్తరమూను! ఉత్తరం సారాంశం ఇదే.

ఇంటికి పెద్దమ్మాయివి. కాని నీకెప్పుడూ సంతుష్టిగా పెట్టే అవకాశం నాకు కలగలేదు. ఇందులో వెయ్యి రూపాయలు పంపుతున్నాను, పెళ్ళికి బట్టలూ అవీ కుట్టించుకోండి. పెద్దదాన్ని అయిపోయాను. మీరిద్దరూ నా పొరపాట్లు మన్నించి ఈసొమ్ము తప్పకుండా తీసుకోమని నాకోరిక. ఇంకా ఇంకా బతుకుతానని మొగపిల్లల పెండ్లిళ్ళు కళ్ళజూస్తాననీ నాకేం నమ్మకం లేదు. ఈ పెళ్లి నేను చేసే ఆఖరి పెళ్లి అనుకుంటున్నాను. ఆడపిల్లల పెళ్లిళ్ళయినా చేశాననే తృప్తితో నా బరువు చాలావరకు తీరుతుంది. ఈ పెళ్ళి మీ ఆయనే కుదర్చడం మా అదృష్టం. మిగిలిన భూమి పూర్తిగా అమ్మేస్తే పదివేలు పైగా వచ్చాయి. అప్పులు తీర్చెయ్యగా ఎనిమిదివేలు మిగిలేయి. ఈ పెళ్ళికి ఎలా లేదన్నా ఏడు వేలు అవుతాయి కదా. ఇక మిగిలిన వెయ్యా మీకు. మొగపిల్లల కింక యిల్లు మిగిలింది. రెక్కల మీద బతుకుతే. వాళ్ళకిది చాలు. మీరిద్దరూ పదిరోజులు ముందుగా ఇక్కడకు వచ్చి ఉండాలని నా ప్రార్థన.'ఇవేనా కనుమూపు మేరభూములు! ఇందుకేనా, ఇవన్నీ తెలిసింతనే నా తల్లని అన్నాళ్ళూ సాధించింది? ఇందుకోసమేనా తను మొగుడితో కలిసి వెయ్యి రూపాయలు సబ్లీగ్గా మిషను కొంటున్నది?

'ప్రభూ! పతనమయ్యే ఆఖరిక్షణంలోనయినా కళ్ళు తెరిపించావు' సావిత్రి చేతులెత్తి నమస్కరించింది.

కేవలం పశ్చాత్తాపంవల్ల పాపం పరిష్కృతమౌతుందని ఆమెకేం నమ్మకం లేదు. దీనికి ప్రతిక్రియ చెయ్యాలి. ప్రశాంతి పొందాలి. ఏమిటది? ఎలాగ ఈ మోసాన్ని ఆపడం?

(63 వ పేజి చూడండి)




సుబ్బన్న అప్పారావు కథను ఆపి బుస్సురని నిట్టూర్చాడు.

చీమల సింహాద్రి కళ్లు పెద్దవిచేసి చూసి, ఏమయ్యా విచారిస్తున్నావు, చివరికి అప్పారావుకి ఒర్నాధం ఆ అప్పు కొన్నా ఇచ్చేస్తాడని బాధగా ఉందా అన్నాడు.

నాగలక్ష్మి విసుక్కుంది.

సుబ్బన్న మొగలి పొదల మీదనుంచి వచ్చిన గాలిమటుకు అల్పాహారం చేసి మిగతాది నాజూగ్గా వదిలేసి, స్థిమితపడి నవ్వాడు.

అబ్బె మీకేం. చల్లగా గుటు చప్పుడు కాకుండా మా పుటలో దూరి కూచుని, పుట్టని అప్పెడతావా అని చేరాలు పోతారు. అప్పెట్టడం ఎంత ముప్పో మీకేం తెలిసేను. చీవంతి చింత లేదు. తీసుకునేవాడికి ఇచ్చేవాడి బాధ బోధపడే దెలా? అన్నాడు సుబ్బన్న.

సింహాద్రి చిన్నబుచ్చుకున్నాడు. అబ్బె సుబ్బన్నా అదే పనిగా అప్పులు చెయ్యడం మాకేం సరదా కాదు. అసలు తీరికా లేదు. ఇవాళ మీరు ఇచ్చారుగదా అని మేము తీర్చకోపోము; తీర్చాంగదా అని అదేపనిగా అడగనూ అడగము. అడిగినకొద్దీ ఇస్తున్నారని రేటు నానాటికీ పెంచనూ పెంచము. అప్పుడు, అప్పడి కథలా అసలుకే మోసం వస్తుందని తెలుసు.

అప్పడి కథేమిటి? అసలుకే మోసం ఏమొచ్చె అంది నాగలక్ష్మి.

తా నెరిగిన తాళపత్ర గ్రంథాలలోని అప్పడి కథను అప్పుడు సింహాద్రి ఇలా చెప్పాడు:

పూర్వకాలము అప్పడని ఒకడుండెనూ. ఇద్దరు ఉండుటకు విలు లేకనే ఒక్కడు వుండెనూ. వానికి డబ్బుగల స్నేహితుడు గలడూ. అందువల్ల డబ్బు లేదూ. అందువలన స్నేహితుడు అప్పడికి మొహమాటలు చే ప్రతిదినమూ ఒక వరహా బగులు ఇచ్చుచుండెనూ. ఇట్లుండగా ఒక దినమున అప్పడు ఇట్లాలోచించెనూ. వీడు నాకు రోజూరోజూ వః వరహా యిస్తూ వుంటాడుగదా. ఒక్కసారే వంద ఎందుకు అడగరాదూ. వీడు ఇవ్వరాదూ. ఇట్లా యోచించి అట్లా అప్పడు, మిత్రుడిని ఒక రోజున ఒక్కసారిగా వంద వరహాలు అడిగెనూ. వాడు వెంటనే నావద్ద అంత డబ్బు లేదుగదా ఏమి చేయుదునూ అని యోచించి, ఓరీ అప్పడూ నావద్ద లేదు అని చెప్పివేసెను. మొహమాటమూ పోయింది గావున మనాడుకూడా ఒక వరహా యివ్వలేదూ...అని కథ ముగించాడు చీమల సింహాద్రి ఆయాసపడుతూ.

ఆ దారిన పోతున్న బాతు, సుబ్బన్నకి దూరంగా ఆగి పకపక నవ్వింది. సింహాద్రి గారు. మన కథలనే మనుష్యులమీద అల్లి తమాషాగా చెబుతున్నారు అని తమాషాగా నవ్వి, నాగలక్ష్మి బుస్సుమనేసరికి తుర్రుమని పారిపోయింది.

అవును దురాశ దుఃఖానికిచేటు అన్నాడు సుబ్బన్న. పూర్వమొక్క ఋణానందభట్టు ఇలాగే తిరిగి తిరిగి ఎక్కడో ఒకచోట ఒక మాడ అప్పు తెచ్చుకుని మూడు ఝాముల వేళ ఇంటికి పోతూ, రాజవీధి మొగలో దూరంగా ఋణాశనుడనేవాడినీ, వాడి మొహాన్నీ చూసి వాడికికూడా ఆనాడు ఓమాడ దొరికి ఉంటుందని, తను తన ఇంటి బాధను మరొక్కసారి ఏకరువు పెడితే ఋణాశనుడి రొండిలో ఉండగల మాడలో సగబాలు అప్పు సంపాదిస్తే, మర్నాడు తనకి వేతనం రాగానే తీర్చిపారెయ్యొచ్చునీ ఆశపడి పని మళ్లె ఋణాశనుడికి ఎదురేగి పలకరించి తన పాచిక వేయబోయాడు. అవతలకే, ఈవాయినం పసిగట్టిన ఋణాశనుడు ఇతనికన్న ధాటిగా దుఃఖించి, తాను ఇవ్వకపోవడమేకాక, ఋణానభట్టు రొండిన వున్న మాడా కూడా అప్పుగావచేసి పుచ్చుకు తన దారిన పోయాడు, అన్నాడు సుబ్బన్న.

ఈ కథ ఆలకించిన చెట్టుమీద కాకి మటుకు కావు కేక పెట్టి, అయితే ఓగాక, మహా చక్కటి నీతి కథలు గదా. సుబ్బన్న గారూ మీకేం అనుకోకండి గాని, నామాట విని మీ పుట్టని అప్పివ్వండి. మళ్లీ వాళ్లు కాళీ చేసిచ్చేస్తారు అని ఊరుకుంది.

చీమలూ పాములూ పైకి చూసి నవ్వుకున్నాయి. ఒకటి రెండు జాలిగాకూడా చూశాయి.

కాకరాజా! నీ మాటేకాక వూహాకూడా మంచిదికాదు. అలా పరాయి గొడవల్లో కలగచేసుకోరాదు. నువ్వే చిక్కుల్లో ఇరుక్కుంటావు ఋణకేతుడులా జాగర్త అంది నాగలక్ష్మి వెటకారంగా.

ఎవరా ఋణకేతుడు? అన్నాడు సుబ్బన్న భార్య వంక చూసి.

నాగలక్ష్మి ఆ కథ చెప్పింది. పూర్వము ఋణకేతుడు అనేవాడొకవాడు ధనస్వామి అనే శ్రేష్ఠిని అప్పడగబోయాడు: ధనస్వామి లేదంటున్నాడు. ఇతను ఇవ్వమంటున్నాడు. దారినిపోయే ఇంధనస్వామి వీరి తగాయిదా చూసి పలకరించి ఏమయ్యా మా ఋణస్వామి మహా యోగ్యుడు గదయ్యా బుద్ధిమంతుడు గదయ్యా. అతనికి అప్పివ్వడానికి సందేహమేల అన్నాడు నవ్వుతూ.

ధనస్వామి కోపగించుకుని నేనలా కళ్ళు మూసుకుని అప్పు లివ్వలేను అంత నమ్మకం ఉంటే నువ్వే ఇవ్వరాదా అన్నాడు. ఓ. ఎందుకివ్వనూ అనేశాడు ఇంధనస్వామి కళ్లు మూసుకునే అని తెరవగానే కటుక్కున నాలిక్కరుచుకుని, అదీ, అప్పుడే ఆదారిన అమ్మొచ్చిన గంపలో పచ్చి వెలక్కాయా కలిపి మింగేసి కళ్లు మిటకరించి, చేతైతే డబ్బు లేదుగానీ అని-సాగదీశాడు.

దానికేముంది. నీకావాలంటే నేను అప్పిస్తాను. నిన్ను నమ్మగలనుగా అంటూ ధనస్వామి ఇంధనస్వామికి అప్పిచ్చాడు. గత్యంతరంలేక ఇంధనస్వామి దానిని ఋణకేతుడి చేతుల్లో తగలేశాడు. అది ఇంకమళ్ళీ రాదని, సలహా యిచ్చేముందే తనకు తెలుసు కాబట్టి ఇంటికెళ్లూనేఅంగరఖావిప్పి భోగున ఓ యేడుపు ఏడిచి ఊరుకున్నాడు. కాబట్టి ఓ కాకరాజా ఖబర్దార్ చెట్టుమీది నీ గూటికే మోసం రాగలదు అంది నాగలక్ష్మి.

కాకరాజుభార్య కంగారుపడి కావుకావురని ఏడ్చి నాగలక్ష్మిని బతిమాలుకుంది. నా తల్లి తల్లి. పిల్లలవాళ్ళం. అలాటిపనులు చెయ్యకండి అంది. అని, మొగుడిడొక్క

# ★ ఋణానందలహరి ★

లో రెక్కలతో పొడిచింది. రెక్కొడితేగాని దొక్కాడని వాళ్ళం మనకీ రభసలేల ? నీవు పోయి పిల్లలకి మేత పట్టాకుండా కాకమ్మ కబుర్లూ నువ్వూను అని మందలించింది.

తరవాత నిశ్శబ్దం, ఓ రెండు నిముషాల సేపు గంభీరంగా ఉపన్యసించింది.

ఇంతకీ ఏమంటారు పుట్ట ఖాళీచేస్తారా లేదా అంది నాగలక్ష్మి కర్కశంగా.

చిత్తం తమరలా అంటే ఎలా. ఖాళీ చెయ్యాలన్నా, లక్షలకొద్దీ ఉన్నాంకాబట్టి వ్యవధి పడుతుంది. ఈలోగా మీరుతొందర పడితే కుట్టి చంపేస్తాం. గాన గ్రహించ గలరు అన్నాడు సింహాద్రి.

కాపోయినా, పదికాలాలు మనకిఅప్పిస్తే వీళ్ళపుట్ట మునుగుతుందా. నిజంగానే రేపు వరదలొచ్చి పుట్ట కొట్టుకుపోతే ఏంగాను ఋణ తిలకుడి డబ్బులా అదో కుర్రచీము.

ఏమా కథఅని ఎవరూ అడగలేదు. అందుకని తనే చెప్పేసింది. ఋణతిలకు డనువాడు తనదగ్గిర డబ్బుని అంతా అప్పు లడుగుతారని భయపడి పెరట్లో గోతిలో దాచుకోగా, దానిని దొంగలెత్తుకుపోగా మర్నాడు వాడేడుస్తుఉండగా, వాడిని క్రితంరోజునే అప్పడిగి లేదనిపించుకున్న అప్పన్నవచ్చి పకపకనవ్వి ఓరీ నువ్వు నాకు నిన్న అప్పు ఇచ్చిఉండినట్లయితే దొంగతనం జరిగినా నీ డబ్బంతా నేను అచ్చుకొనే వాడినిగదాఅని పకపక నవ్వి వెళ్ళిపోయాడు. అని ఒక్క గుక్కలో కథముగించి అమ్మయ్య అయి పోయింది అందా కుర్రచీము.

సింహాద్రి వాత్సల్యంతో, కొంచెం ఓరిమి నటించి, మరీ నవ్వి, పిల్లవాడు చెప్పింది నిజమే. నా పాత జన్మల్లో ఓసారి ఒక డిలాగే ఊరిమీద బందిపోట్లు రేపో మాపో పడుతున్నారని తెలిసి తక్షణం, తనడబ్బుని

### తృణానందలహరి

రామూ : "ఏరా గోపీ ఎప్పుడూ స్నానమైనా చేయవేరా."

గోపీ : "ఘోరం. ఘోరం. స్నాన మేమిట్రా."

రామూ : 'స్నానం ఘోర మేమిటి నీమొహం."

గోపీ : మొన్న ఒక హిందీ సినిమాలో హీరోయిన్ స్నాన ఘట్టంలో హాలు హాలూ 'ఘోరం ఘోరం' అంటూ ఒకటే గోల!"

అడిగినవాడికీ అడగనివాడికీ కూడా అప్పు లిచ్చేసి ఋణపత్రాలు రాయించుకుని అవి ఓ పెట్టెలో భద్రపరుచుకు కూర్చున్నాడు. మూడోనాడు దొంగలు రానేవచ్చారు. దోపిడీ చెయ్యనేచేశారు. నాలుగోనాడు నా మిత్రుడు ఉప్పొంగిపోతూ ఊరేగి, నా బాకీలు తీర్చండిఅని రభసచేశాడు. దొంగలు కొల్లగొట్టారు. ఎక్కడ తెమ్మన్నావు అని వాళ్ళంతా మొత్తుకున్నారు. ఆమాట న్యాయాధికారికి చెప్పుకోండి నేను అభియోగం తెస్తున్నా మీమీద అంటూ,అతడు ఉత్సాహంగాఇంటికెళ్ళిఋణపత్రాలు తీసుకోబోయాడు. అని సింహాద్రి ఆగాడు. కాబట్టి అప్పులు ముప్పులు నివారించే శ్రీరామరక్షలు గదా అన్నాడు.

అలాగేం ? ఆ తరవాతకథ నాకు తెలీదనుకున్నావా అంది నాగలక్ష్మి వెటకారంగా... సుబ్బన్న ఆమెవంక కుతూహలంతో చూశాడు.

గుర్తులేదూ. నువ్వే ఆ జన్మలో ఈ పని చేసినవాడివి. తీరా ఆరోజున నువ్వు ఋణ పత్రాలు చూడబోయేసరికి అవిలేవు బంది పోటు దొంగలు దోపిడీ హడావుడిలో నీ యిల్లూ కొల్లగొట్టి, ఋణపత్రాల పెట్టెనూ సి అందులో డబ్బుంటుందని పొరబడి అది పట్టుకుపోయారుగదా. అందుకే నువ్వు కోర్టు కెళ్ళలేకపోయావు. అప్పులివ్వకుండా ఉంటే, అయ్యో నాడబ్బు దోచుకుపోయారు అని అందరితో పాటు సమానంగా ఉత్సాహంగా ఏడ్చి, ఎవరిదగ్గరేనా సాయం సంపాయించేవాడివి. అప్పులివ్వడంవల ఆఖరికి ఆ యేడుపుకికూడా సదుపాయం లేకపోయింది. అంచేత ఇపుడు ఈ పుట్టా యివ్వద్దు. కాలి పోతే హాయిగా ఏడుద్దాం అంది నాగలక్ష్మి.

—(ఇంకావుంది)

# తెలుగు వెలుగులు—3



ఆంధ్ర సాహిత్యక్షేత్రంలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు చేయని వ్యవసాయం లేదు; పండించని పంట లేదు.

దానికి మించిన విశేషం ఆయన రచనా వ్యాసంగం అనర్గళంగా ఈ క్షణంవరకు సాగుతూనే ఉన్నది.

నూనూగు మీసాలనాడు వ్రాసిన నాలుగు పద్యాలచే షష్టిపూర్తినాడు, ఆ తర్వాత వినిపించి సన్మానాలు పొందటం లేదు.

వేషాలంకారాలనుబట్టి కవి అని గుర్తించాలంటే సత్యనారాయణగారిలో ఆలక్షణాలు వెదికినా కనిపించవు. అసలు ఆయనకు వేషమంటే గిట్టదు. ఆయన మాట అకురాయి; నవనీతం.

సర్వసాధారణంగా సత్యనారాయణ గారిపై (పరోక్షంగా) అందరూ విసిరే విమర్శలు: "ఎందుకండి, మళ్లా ఈ రామాయణం వ్రాయడం. వాల్మీకిదే ఇంతకంటే తేలికగా అర్థమవుతుంది." "పట్టి సనాతన సిద్ధాంతాలు, ఈయనవాను," అని.

"మరల నిదేల రామాయణం బన్నచో" ఈ ప్రపంచకము "తినుచున్న యన్నమే తినుచున్న దిన్నాళ్ళు" "చేసిన సంసారమే చేయుచున్నది." తనదైన యనుభూతి తనది గాన "నా భక్తి రచనలు నావి గాన" అనీ, "వ్రాసిన రామచంద్రుని కథ వ్రాసితి ననిపించుకో"అని తండ్రిచేసిన యాజ్ఞయు "జీవుని వేదన ఏకమై" అనీ ఆయన ఒక చెంపన చెబుతూ ఉన్నా వీరు వినిపించుకోరు.

వాల్మీకిది అర్థం కాకపోతే తప్పు తమదీ కాదు, వాల్మీకిదీ కాదు. కాని సత్యనారాయణగారిది అర్థం కాకపోతే తప్పు సత్యనారాయణగారిదేనని వీరి నమ్మకం.

సత్యనారాయణగారి సనాతన ఉపదేశాలకు మూలం ఒకటే: సాహిత్యం, సంస్కృతి అవిభాజ్యమనీ, వాటి ఉద్ధరణకూడా ఏకంగా జరగాలనీ ఆయన ఉద్దేశం. దేశోద్ధరణకు, జాతిఉద్ధరణకు వాటి ఉద్ధరణ అవసరమని ఆయన విశ్వాసం. రాజకీయ రంగంలో పండిత మదనమోహన మాలవ్యా గారలాంటి వారో సాహిత్యరంగంలో సత్యనారాయణ గారలాంటివారు.

వారి రచనల్లో తెలుగుదేశం సాక్షాత్కరించినట్లు మరెవరి రచనల్లోనూ సాక్షాత్కరించదు. తెలుగు పాఠకలోకాన్ని సత్యనారాయణగారి రచనలు ఆకర్షించినంతగా మరొకరి రచనలు ఆకర్షించవు. వారికున్న శిష్యవరం, అనుచరవర్గం మరొకరికి లేదు.

"అల నన్నయ్యకు లేదు తిక్కనకు లేదా భాగ్య మస్మాద్గురుండు" శిష్యుడై నట్లు, "చెళ్ళపిళ్ళ వంశస్వామి కున్నట్లుగన్". ఇది అహం అనండి, ఔద్ధత్యం అనండి. కాని నిజమని నమ్మేవారు లేకపోలేదు. అది అలా ఉండగా సత్యనారాయణగారు కనుక నన్నయ తిక్కనల కాలాల్లో ఉండిఉంటే కవిత్రయం కాక కవిచతుష్టయం అయేవారేమో అని నమ్మేవారుకూడా లేకపోలేదు. (ఆయన అభిప్రాయాలతో ఏకీభవించనివారు కూడా ఆయన రచనా వైదగ్ధ్యానికి మళ్ళీ మళ్ళీ మ్రొక్కులు కాకతప్పదు.) చెళ్లపిళ్ల వారి షష్టిపూర్తి సన్మానోత్సవంలో తమ గురువులనుగురించి "......వానలో దడియనివారు మద్గురువిధాన మృదూక్తి మరందధారలన్ గడుగనివారు మాకెచట గానగరారు తెలుంగు నాడునన్" అన్నారు. ఇది సత్యనారాయణ గారి పట్లకూడా అక్షరాలా వర్తిస్తుంది. ★



# కథ కాని కథ



## "కామెడీ ఆఫ్ ఎర్రర్స్"

(మొదటి బహుమతి, రూ. 10/-)

నేను మామూలుగా ప్రొద్దున్న తొమ్మిదిన్నరకి పదకొండో నెంబరు బస్సులో కాలేజీకి వెడుతున్నాను. ఈ బస్సు, సాధారణంగా మా కాలేజీ, మహారాణి (ఆడవాళ్ళ) కాలేజి స్టూడెంట్లతో, మొదటి రెండు మూడు స్టాపుల్లోనే నిండిపోతుంది. ఆ రోజున ఎందుచేతనో రద్దీ ఎక్కువగా ఉండడమువలన, నేను నిలబడే ప్రయాణము చేయవలసి వచ్చినది.

బస్సు మెజస్టిక్ సమీపిస్తుండగా, ఉన్నట్లుండి నా హిప్ పాకెట్టులో ఉన్న పెన్నుని ఎవరో నెమ్మదిగా పైకి తీస్తున్నట్లయింది. నాకు ఎప్పుడూ పెన్నుని హిప్ పాకెట్టులోనే పెట్టే అలవాటు. అదివరకే బస్సుల్లో రెండుసార్లు నా పెన్నులుపోయినా, ఈ అలవాటుమాత్రం పోలేదు. అయినా, ఈసారి దొంగని పట్టుకోబోతున్నానుగదా అని సంతోషపడ్డాను. వెనక్కు తిరగకుండానే, హాండ్ బార్ మీదనున్న నా కుడిచేయిని నెమ్మదిగా ఏమీ ఎరగనట్లు తీసి, సడెన్ గా వెనక్కు పోనిచ్చి గబుక్కున పట్టుకోబోయాను. చేతిలో రెండు మూడు గాజులు పటుక్కు మనడమేమిటి, నేను వెనక్కి తిరగడమేమిటి ఒక్కసారి జరిగాయి. కళ్ళలో నిప్పులు కురిపిస్తున్న మా ప్రక్కింటి అమ్మాయి ప్రత్యక్షం! అప్పుడు వెంటనే నా దవడ ఎందుకు ఫెళ్ళుమనలేదో ఇప్పటికీ నాకు ఆశ్చర్యమే! (కాని 'బూట్' అని అందేమోనని నా అనుమానం.) ఆవిడ నన్ను ప్రక్కింటి అబ్బాయిగా గుర్తుపట్టి ఉండడమే దానికి కారణం అయి ఉండవచ్చును.

ఇంతకీ బస్సులో కూర్చున్న వాళ్లెవరికీ ఈ సంఘటన అర్థం కాలేదు. అందరూ నా కేసి క్రూరంగా చూడడం మొదలెట్టారు. అప్పుడు వెంటనే ఆవిడకి రెండు మూడు క్షమాపణలు వాగేసి, నా హిప్ పాకెట్టులో చెయ్యిపెట్టి చూద్దునుగదా పెన్ను లేదు! చుట్టూ చూసేసరికి అందరూ పెద్దమనుష్యులలాగానే కన్పిస్తున్నారు. నాకు కళ్ళనీళ్ళ పర్యంతమయింది. అది మొన్ననే కొన్న ఖరీదయిన పెన్ను. పెన్నుపోయిందని గోల పెట్టినా ఎవరూ నన్ను నమ్మలేదు. ఎందుచేతనంటే అప్పుడు నేను ఆ ప్రయాణీకులందరి కళ్ళల్లోను ఒక రౌడీని. క్రిందపడిపోయిందేమోనని వెనక్కి తిరిగిచూసేసరికి, నా పెన్ను చక్కగా ఆ అమ్మాయిగారి చీరకొంగు చివరని వ్రేళ్లాడుతోంది. ఆవిడని మళ్ళీ పలకరించడానికి భయమేసి, నేనే నెమ్మదిగా వంగి ఆ పెన్నుని తప్పించబోయాను. చుట్టుపక్కల ఉన్నవాళ్ళందరూ ఫక్కున నవ్వడము, ఆ అమ్మాయి గిరుక్కున వెనక్కు తిరగడము ఒక్కసారి జరిగాయి.

క్షణంలో అందరికీ (ఆ అమ్మాయితోసహా) జరిగిన సంఘటన అర్థమయింది. ఆవిడ ముఖం కందగడ్డలా ఎర్రబారింది. "సారీ ప్లీజ్" అంది. నేనుకూడా "నో, మెన్షన్" అన్నానేమోనని జ్ఞాపకం.

ఇంక ఆ బస్సులో ప్రయాణం చెయ్య బుద్ధిపుట్టక, ప్రక్క స్టాపులోనే దిగి, ఆ రోజున మిగతా దూరమంతా నడిచే కాలేజీకి వెళ్లాను.

"రావు" బెంగుళూరు

* *

## మర్యాద

(రెండవ బహుమతి రూ. 5/-)

క్రిందటి సంవత్సరం శివరాత్రికి బెజవాడలో నేను, ఏడేళ్ళ మా బాబ్జీ బస్సులో దుర్గగుడికి వెడదామని రోడ్డుమీదకి వచ్చాం సిటీ బస్సుకోసం. రెండు బస్సులు ఖాళీలేక మమ్మల్ని దూసుకుని వెళ్ళిపోయాయి. మూడో బస్సు ఆగింది. మేమిద్దరం ఎక్కాం. బస్సు రొదచేసుకుంటూ సాగిపోతోంది. ఖాళీలేక పోవడం వల్ల మా బాబ్జీ నా ఒళ్లో కూర్చున్నాడు. నిజానికి మా యిద్దరికీ బాధగా నేవుంది ఆలా కూర్చోవడం. కాని ఏంచేస్తాం, తప్పనిసరి.

కొన్నేపటికి బస్సు యింకోచోట ఆగింది. ఇద్దరుదిగారు. ముగ్గురు ఆడవాళ్లు ఎక్కారు. ఇద్దరు కూర్చున్నారు. ఒకావిడ పైన వ్రేలాడుతున్న బెల్టుపట్టుకుని నిలబడింది. నా ఒడిలో కూర్చున్న మా బాబ్జీ చటుక్కున లేచి "ఇలా కూర్చోండి. నేను నిలబడతాను. పరవాలేదు" అన్నాడు. నేను వచ్చేనవ్వును ఆపుకున్నాను. ఆమె వాడి వంక చురచురా చూసింది.

ఇంటికివెళ్లాక నేను వాడిని నిలదీసి అడిగితే వాడు యిలా అన్నాడు, "మాటీచరు మర్యాదగురించి పాఠం చెపుతూ "ప్రయాణంలో ఎవరన్నా ఆడవాళ్లు జాగాలేక నిలబడితే మీరు నిలబడి మీ సీటు వాళ్లకు ఇవ్వాలి. అది మర్యాదఅంటే, అని బోధించారు" అన్నాడు.

కె. బి. మూర్తి కొత్తగూడెం.

* * *

## శోభనం గదిలో

(రెండవ బహుమతి రూ. 5/-)

పది సంవత్సరాల ముందు మాట. మా అక్కయ్య పెళ్ళయి మూడునెలలయింది. ఆ మర్నాడే మా అక్కయ్య బావతో ఢిల్లీ వెళ్ళిపోతుంది. ఆ రోజు రాత్రే శోభనము. మేడమీది అన్నయ్యగది ఖాళీ చేయించి చక్కగా అలంకరించారు. లోపల ఒక పెద్దమంచం దానిమీద కొత్త పరుపు వేసి దిండ్లు అమర్చారు. గదిమధ్యలో ఒక బల్ల వేసి, దానిమీద వెండిపళ్లాల్లో జిలేబీలు, మైసూరుపాకులు, ఇంకా యేవేవో తినే పదార్థాలు వాటిపక్కనే పాలు, పళ్ళూ అమర్చారు. నేను మా మామయ్య కూతుర్లు లలిత, పాప, కొడుకు శేఖరం ఆ బల్లచుట్టూ తిరుగుతున్నాము. మాకు ఆ గదిలో ఆబల్లతప్ప వేరేవీ కనిపించలేదు.

రాత్రి తొమ్మిదయింది. అందరూ భోజనాలు చేస్తున్నారు. మేము గబగబా భోజనాలు ముగించుకొని నలుగురూ కూడబలుక్కొని ఒక్కొక్కరు వాళ్లకిష్టమైనవి ఒకొక్కటి తీసుకొందామని చెయ్యి పెట్టాము. ఇంతలో ఎవరో గదిలోకివచ్చే అలికిడి అయింది. మేముగబుక్కున మంచం కింద దూరాము. మా బావ, బావవెనుక అక్కయ్య గదిలోకివచ్చారు. తలుపులు మూసేశారు. మాకు భయమేసింది. నేను, పాప ఏడుపు లంకించుకున్నాము. అక్కయ్య, బావ ఆశ్చర్యపడి ఏమిటని అడిగారు. మేం చెప్పాము. వాళ్లు నవ్వుకుని మాక్కావలసినవి యిచ్చి తలుపు తెరచి బయటికి పంపారు. మా అమ్మావాళ్ళూ కొడతారనుకొన్నాము కాని మా బిక్కమొహాలు చూసి కొట్టడానికి చేతులురాక చీవాట్ల వర్షం కురిపించారు.

టి. యస్. భార్గవి టాగెట్
మద్రాసు.

# శరత్ చెప్పిన కథలు

తెనిగింపు. సాంబశివరావ్ బాబ్జీ

## శ్మశాన కాళీ మహిమ

సాహిత్యవేత్త సౌరీంద్రమోహన్ ముఖోపాధ్యాయులవారు జరిపించిన ఆ సాహితీ సమావేశంలో చాలామంది పాత స్నేహితులంతా కలుసుకున్నారు. శరచ్చంద్రుడు కూడా వొచ్చాడు. సౌరీంద్ర మోహన్ శరత్ బాబు బాల్య స్నేహితుడు. అక్కడున్నవాళ్ళ వ్యవహారాలపైన తర్జన భర్జన జరుగుతోంది. ఓ అయి మూలని కూచున్న నలుగురైదుగురు పెద్ద మనుషులు, కలల్లో దేవత లవుపించి ప్రసాదించే వేళ్లూ, మూలికల తాలూకు మహాత్తుగురించి ఏవేవో వూసులాడుకుంటున్నారు. కొందరేమో అవిచాలా మంచి వంటున్నారు. "మరికొందరు అబ్బే, పొల్లసుఖా అవన్నీ చాదస్తం," అనేస్తున్నారు.

"అంహో. అలా కొట్టి పారేస్తే యిలా చెప్పండి! శ్మశానాలలో సాక్షాత్తు ఆ కాళికాదేవి ప్రత్యక్షమై ప్రసాదించిన మందుల సంగతులు జోలెడన్ని లోగడ ఆలకించాం. ఇప్పుడాలకిస్తున్నాం. అవన్నీ కట్టు కథలని కొట్టిపారెయ్యగలమా చెప్పండి. అమావాస్య నాడు, అర్థరాత్రిగట్ల భగభగ మండే కాష్టం వద్ద సాధకం చేస్తే యెంతో గొప్ప ఫలితం వుంది. లేకపోలేదు. అలాంటప్పుడు మంచి మంచి మందులు దొరుకుతాయన్న మాటే కాదు; ఒక్కొక్కప్పుడు అదృష్టం కలిసొస్తే ఆ కాళీ మాతను కళ్ళారా చూడవొచ్చు కూడాను," అంటూ ఓ చిన్న వుపన్యాసం దంచాడోపాయన.

అందరి మధ్యా కూచున్న శరత్ బాబు అంతవరకూ కిమ్మనకుండా, ఆయన గారి వుపన్యాసమంతా ఆలకిస్తున్నాడు. వల్లకాట్లో కాళికాదేవి ప్రస్తావన ఆలకించటంతోనే ఆయన కాస్త సద్దుకుని, "అయ్యా మీరంతా మాట్లాడుకోటం వింటూంటే, కాళీ సాధకుడు మా హారిపదుడి ముచ్చట జ్ఞాపకం కొస్తోంది." అన్నాడు.

'హారి పదుడెవరు చెప్మా' అని అందరూ ఆయన కేసి ఆతృతగా చూశారు.

అప్పుడు శరత్ ఆ ముచ్చటేదో యిలా చెప్పటం మొదలెట్టాడు :

"హారిపదుడు మా వూరివాడే. తల నిండా నిడుపాటి జటలు, శాక్తేయుల రక్తాంబరాలు, మెళ్ళో రుద్రాక్షమాల, నొసట అరరూపాయికాసంత కుంకుంబొట్టు అతగాడి మొహం చూసి చూడగానే అతనో కాళీ సాధకుడని యిట్టే పోలిక్కట్టెయ్యొచ్చు. అసలు మా వూళ్ళోనే గాకుండా, ఆ చుట్టుపట్ల వుండే పల్లెటి గ్రామాలన్నిట్లోనూ హారిపదుడంటే మాంచి పేరు! ఎవరికేనా జ్వరమో, అమ్మవారో పట్టుకుందంటే, భయపడి బెంగపెట్టుకోవాల్సిన పని వుండేది కాదు. ఎలాగో కొన్ని తంటాలుపడి, హారిపదుడింటి కెళ్ళి దేవివారి నైవేద్యానికి కేడో, పరకో యిచ్చుకుంటే ఆ రాత్రికి రాత్రే ఆ జబ్బు నయమైపోయేది. పట్టిన అమ్మవారు పది ఆమళ్ళ దూరం పారిపోయేది. ఇహ కాస్త కూస్త పెద్ద జబ్బే అయితే మళ్ళా అమావాస్య వొచ్చే దాకా అర్రులుచాస్తూ కూచోవాల్సొచ్చేది. అమావాస్య వెళ్ళిన మర్నాడు, రామబాణం లాంటి మందుల్ని పట్టుకుని, హారిపదుడు గుమ్మంముందు తయారయ్యేవాడు. ఆ మందు లున్నాయే, కాళమ్మగారు సాక్షాత్తూ శ్మశానంలోకి వేంచేసి, స్వహస్తాలతో అతగాడికిచ్చినవో, లేకపోతే 'ఇదుగో అబ్బీ' ఫలానా వేరూ, ఫలానా మూలికా కలిపి నూరితే ఫలానా మందవుతుందనీ, దాన్ని ఫలానా అనుపానాని కివ్వాలనీ, స్వయంగా చెబుతుందోగాని, ఆ మందుల్ని తయారు చేసి మరీ తయారయేవాడు హారిపదుడు.

ఇంతకూ హారిపదుడి మీద అంతగానలని చూపుచూసే తల్లెవరో మీరీపాటికి గ్రహించే వుంటారనుకుంటా. శ్మశానవాసిని, పుర్రెల మాలను ధరించే జగజ్జనని, సాక్షాత్తూ ఆ కాళికా అమ్మవారే, అతగాడి తల్లి. అర్థరాత్రిగట్లవల్లకాట్లో కళ్ళు యెదో కాష్టంపై కూచుని హారిపదుడు "అమ్మా, అమ్మా" అని అరుస్తూ పిలుస్తూంటే, ఆ ప్రళయ భయంకరజగన్మాతకు మనస్సంతో చివుక్కుమని గిజగిజ కొట్టుకొంటుంది. ఆ పళంగా 'ఇదుగో, ఇక్కడే వున్నా'నంటూ, వెంటనే హారిపదుడున్న చోటుకి పరుగెత్తుకు మరీ వొచ్చేస్తుంది. హారిపదుడికాతల్లి ఎంతసేపు ఎన్నెన్ని కబుర్లు చెప్పుందనుకున్నారు. అప్పుడు తను, "అమ్మా! వూళ్ళో ఫలానా వాడికి ఫలానా జబ్బుపట్టుకు పీడిస్తోంది. ఏం సెలవు?" అని అడిగితే, ఆ మహామాత అతను చెప్పిందంతా ఆలకించి అందుకు పనికొచ్చే మందులేవో ప్రసాదిస్తుంది. అలాంటి మహిమా, మహాత్తూ గలిగినటువంటి మహానుభావుడు హారిపదు[illegible] అతగాడు చెప్పిన మా[illegible]లదంతా నమ్మండి.

[illegible] కాళీమాతను దర్శనం చేసుకునే సంగతి అలావుంచండి. అమావాస్య నాడు అర్థరాత్రిగట్ల, కన్నుచించుకున్నా కనిపించని కారుచీకట్లో, వల్లకాటికెళ్ళి యే చితిపైనయినా ఒక్కగడిసేపు కూచోగలిగే పాటి గుండెలెవరికేనా వున్నాయా? ఈ చుట్టూతా వుండే వూళ్ళల్లో అంత దమ్ములున్న మొనగాడెవడేనా వుంటే రమ్మనండి బస్తీమే సవాల్" అంటూ రొమ్ము విరిచి జబ్బలు చరిచి, అరిచేత్తాడు హారిపదుడు.

నిజం చెప్పాలంటే ఈమాట అతగాడి నోటివెంట వినాల్సిన పనేలేదండి. ఎందుకంటే అతగాడి సవాలు నెదుర్కొనే మొనగాడింతవరకూ ఎక్కడా అవుపించలేదు. పైపెచ్చు హారిపదుడంత కరాఖండీగా సాధకం చెయ్యడం కళ్ళారా చూశామని వూళ్ళో ఎంతో మంది చెప్పారాయెను! వల్లకాట్లో వో చితిపైకూచుని అతను కలవరపడేగొంతుపెట్టి "అమ్మా—అమ్మా" అంటూ అరిచేదృశ్యం స్పష్టంగా కనిపించిందాయెను.

అవునా, ఇంతవరకూ క్షేమంగ్గా, సుఖంగా సజావుగా కూడావుంది. ఇంతవరకే మేం గూడా మాంచి నమ్మకంగా వుండేవాళ్ళం. కాని తర్వాత, తర్వాత హారిపదుడు చెప్పే ముక్కల్ని మాత్రం మేం వొప్పుకునేందుకు సుతరామూ యిష్టపళ్ళేదు సుమండీ! అప్పట్లో మేంకాగా చిన్నవాళ్ళం. కుర్ర నాగమ్మలం. తోట పెద్దుల్లా తిని బలాదూరు తిరగడమే మా పని. మాంచి పైలపచ్చీసుగా వుండేవాళ్ళమేమో ఎలాంటి తగూ, తవ్వాయిల, కయిగా యిట్టే తయ్యారైపోయేవాళ్ళం. అందుకని హారిపదుడన్న మాటలేవీ మాకంతగా రుచించలేదు. మా గ్యాంగ్‌లో 'కిన్నా' అనే వాడొకడున్నాడు. వలేకేటుగాడు. చిన్నప్పిడతల్లో ఒకటో రకం. వాడందుకని మాతో

# ★ శ్మశాన కాళీమందులు ★

అన్నాడుకదా, "ఒరేయ్ ఇదుగో. ఈ హారిపదు డేవో పెద్ద బిగుర్లు బిగుర్తున్నాడు. అతని కేవో శ్మశానంలో కాళిమాత సాక్షాత్తుగా ప్రత్యక్షమై, అతన్ని స్వయంగా పలకరించి మందు లిస్తుందట. అదేదో మనం కూడా కళ్లారా చూసి మన జన్మతరింపజేసుకోవాలి. అందుకని వొచ్చే అమావాస్యనాడు, మనంకూడా శ్మశానాని కెళ్దాం. అతను చెప్పినవన్నీ డప్పాలో, నిజమో కనిపెడదాం."

'చూసి రండ్రా' అంటే కాల్చి మరీ వొచ్చే బాపతు వాళ్ళం. అలాటి పని యేదో ఒకాటి మాకు పురమాయించటమే తరవాయి గాని, దాన్ని తుదీ మొదలూ చూసేయకుండా ఓ పట్టాన వొదిలిపెడ్తామా? - సరే నంటే సరే ననుకున్నాం.

అనుకున్నట్టే అమావాస్యనాడు అర్ధరాత్రప్పుడు మేమంతా కట్టగట్టుకున్నట్టు, నింపాదిగా వల్లకాటి దిబ్బలమీది కెళ్ళాం. అసలే వల్లకాడు. ఆ మీదుసు అమావాస్య. అప్పుడక్కడ చీకటెంత దట్టంగా వుందో చెప్పటం చాలా కష్టం. మేం పక్క పక్కంటే నడుస్తున్నాం గాని, అసలు దగ్గరుండే వాణ్ణి పోల్చుకోవటమే మహాయిబ్బందిగా వుంది. అంత కారు చీకటి.

ఆ వల్లకాటి మధ్యను ఓ పెద్ద రావిచెట్టుంది. మేమంతా ఆ చెట్టుపై కెక్కి టంచన్‌గా కూచుని, హారిపదుడెంత టెంతిట వొస్తాడా అని కళ్ళు గ్యాస్ లైట్లు చేసుకుని మరీ చూస్తున్నాం. అమావాస్యనాటి అర్ధరాత్రంటే, కాళీ సాధకుల కెంతో గొప్ప పండుగలాంటేది గదా! అందుకని హారిపదుడెలాగయినా వొచ్చేతీర్తాడనుకున్నాం. కాని ఏ వేళప్పుడొస్తాడో యెవరికి తెలుసు.

అందుకని గుటుచప్పుడు కాకుండా, వూపిరి బిగబట్టుకు కూచున్నాం. ఎంతయినా పిల్ల పజ్జ గదండీ! కొసకి కాళ్లూ చేతులూ కొరడు బారిపోతున్నాయిగాని, ఆ హారిపదుడసలు రావటం అవుపించదు. ఒకవేళ యీ గుటు కొస్తారట్టయి, మేం యిలా కాపలా కాస్తున్నట్టు అతడికిగాని తెలిసిందో యేమిటో. అందుకే వొళ్ళంతా కదుములు కట్టినా, అటూ యిటూ ఎటూ కదలకుండా దిష్టిపిడతల్లా వుండిపోయాం. చూసీ, చూసీ హైరానాపడి 'ఇక ఆయనగారీవేళ రారేమోన్రోయ్' అని తేల్చుకున్నాం.

అంతలో ఆ పాటుబాట వెంట ఎవళ్ళో పణుకుకుంటూ వొస్తున్న చప్పుడయింది. పరకాయించి చూద్దుంగదా, ఆ హారిపదుడే నిమ్మళంగా ఆ చెట్టుపైనించిదిగి ఆసణుగుడు వొస్తోన్న వేపుపిల్లుల్లాబయలేరాం. మమ్మల్ని నడిపిస్తున్నాడు కిట్టుగాడు కిన్నా.

కొసకి హారిపదుడోచోట తక్కున ఆగిపోయాడు. అదెవరితో చితేనేమో మరి. చీకట్లో ఏమీ కనిపించటంలేదు. ఆ తర్వాత అతను దానిపైని కూచుని, "అమ్మా-అమ్మా" అంటూ గావుకేకలు పెట్టడం మొదలెట్టాడు. ఆ కేకల్తో ఆ శ్మశానమంతా మారుమోగిపోయింది.

"అమ్మా-అమ్మా-అమ్మా" అనుకుంటూ యింకా అరుస్తూనే వున్నాడు హారిపదుడు.

అంతలో టపీమని కిన్నాగాడి బుర్రలో సీమిర్రపకాయలాంటి చిన్న వుపాయం ఒకటి తట్టింది. అడుగుదీసి అడుగేసుకుంటూ, నింపాదిగా అతడు హారిపదుడున్న వేపు వెళ్ళాడు. వెనక నుంచీని హారిపదుడి చెవిలో నోరు పెట్టి గమ్మత్తుగా ఆడగొంతుతో, "ఏం నాయనా, ఎందుకు పిలుస్తున్నావ్? ఏం కావాలి?" అంటూ పెద్ద కేక పెట్టాడు.

ఇలా అనే సరికో గమ్మత్తు జరిగింది. మేమేదో హారిపదుడు కాళికాదేవిని స్తోత్రం చేసి పూజిస్తాడేమో అనుకున్నాం. కాని అలా జరగలేదు. కిన్నా పెట్టిన గావుకేకతో హారిపదుడు నిజంగా తారెత్తి, ఉన్నపళంగా దభేల్న నేలకూలిపోయాడు. పాపం అతగాడు స్పృహతప్పి, పడిపోయాడని యిక వేరే చెప్పాలా?

కిన్నాగాడి దగ్గిర అగ్గిపెట్టె వుంది. గభీమని ఓ పుల్ల తీసి వెలిగించి చూసి. "ఓరి వీడి సాధకం చచ్చుబండలుగాను, ఇంతేనట్రా యీ కాళీసాధకుడి డప్పాలు! చూశారా, స్పృహతప్పి పడిపోయాడు," అంటూ మా అందరికీ చూపించాడు.

ఆ పళాన్న మేమంతా మొరాయించి, జిడ్డు జంతువులాటి ఆ హారిపద్దుణ్ని మోసుకెళ్ళి యెలాగో చెరువొడ్డున పడేశాం. అప్పటికీ హారిపదుడికి తెలివిలేదు. చాలా సేపటని మొహంపైని నీళ్ళు చిలకరించేక, కొసకెలాగయితేం, మళ్లా ప్రాణాలో బయటపడ్డాడు. ఈ భూమ్మీద అతగాడికి నూకలింకా మిగిలివున్నాయిగాబోసు! అతను కాస్త కళ్ళు తెరిచి చూచేసరికి మేం యిక అక్కడెలావుండగలం! అందుకని కాళ్ళకు బుద్ధి చెప్పి అక్కణ్ణుంచి ఆ మరుక్షణమే గైర్వియా అయిపోయాం.

మర్నాట్నుంచీ హారిపదుడిలో అనుకోనంతటి మార్పు వొచ్చి పడింది. ఇల్లు జేరుకున్న తర్వాత అతను గెడ్డాలు-మీసాలన్నీ నున్నగా గొరిగించేశాడు. శ్మశానకాళీ మందులు కూడా యివ్వడం మానుకున్నాడు. 'ఏమిటండీ యింత యిదిగా మారిపోయారని యెవరయినా అడిగినా, అందుకతను మారు పలకడు, ఉలకడు. ఎంతో సిగ్గుపడిపోతున్నట్టు మొహం చాటుచేసుకుని ఓ మూలను కూచుని వుండిపోయేవాడు పాపం." ★

# కలయిక

కె. కృష్ణమూర్తి

“నీకు ఇష్టమయింది. ఆయనకు ఇష్టమయింది. మధ్య నాకెందుకు? ఈ కాలంలో మరీ పెండ్లి అయినా కాకపోయినా ఒకటిగానే ఉన్నది,” అన్నది కమల, హేళనగా పద్మతో. లేడీస్ హాస్టలు డైనింగ్ హాలుదగ్గర చేరి, ఇదివింటున్న నలుగురూ పక్కున నవ్వారు. కమల అలా అనడం, మిగిలిన వాళ్ళు నవ్వడంతో పద్మకు ఒళ్ళు మండింది. “నోరు మూసుకో” అని కమలను విదిలిస్తూ చరచరా తన గదిలోకి వెళ్ళిపోయింది పద్మ.

కమలకు పద్మమీద స్నేహభావం లేదు. ఉన్నది అసూయ మాత్రమే. “తనకి లొంగని సుబ్బారావు పద్మ వెంట పోవడం ఎందుకు” అనేది అసలు సంగతి. అలా అనుకునేది, అసూయపడేది ఒక్క కమల మాత్రమే కాదు; బహుశః సుబ్బారావును తెలిసిన ప్రతి పెండ్లికాని యువతీని. మిగిలిన వాళ్ళు మనస్సులో అనుకొని వదిలేస్తే, కమల బయటకు అనేస్తున్నది.

సుబ్బారావు మెడికల్ కాలేజీలో ఫైనలియరు చదువుతున్నాడు. ఆజానుబాహువు. విగ్రహం కండ్లకింపుగా ఉంటుంది. తెలుగులోను, ఇంగ్లీషులోను కూడా బాగా మాట్లాడకలడు. చదువులో ఘట్టుగా కాకపోయినా, మొదటి తరగతిలో ఉత్తీర్ణుడౌతాడు. టెన్నిసు ఆటలో ఛాంపియను. ఈ సద్గుణాల మూలంగా అందరికీ, ముఖ్యంగా యువతులందరికీ 'ఆదర్శ పురుషుడు,' అభిమాన వ్యక్తి అయినాడు.



“ఈ కాలంలో పెండ్లిఅయినా కాకపోయినా ఒకటిగానే ఉంది...”

కమల పద్మకన్నా రెండేళ్ళు ముందుగా మెడికల్ కాలేజీలో చేరింది. అందగత్తెలలో జమే. ప్రతి సంవత్సరం పరీక్షలలో ఘట్టుగా నెగ్గుతుంది. ధనవంతుల పిల్ల. ఈ కారణాల మూలంగా, కమలలో దర్జా మాత్రమే కాకుండా, తనను అందరూ ఆరాధించాలనే ఉద్దేశ్యంతో మిళితమైన గర్వం కూడా ఉంది. కమలను ఆరాధించే యువకులూ లేకపోలేదు. కాని కమలకు సుబ్బారావుమీద మమకారం. దానికి తగిన సమాధానం లేనందున వ్యాకులపడింది.

పద్మ మధ్య తరగతి కుటుంబానికి చెందినది. క్లాసులో ఘనుగానూ లేదు. కాని డిబేట్ లలో తెలుగులోను, ఇంగ్లీషులోను కూడా ఎవరినయినా హడలగొట్టగలదు. నాజూకుగా, అందంగా ఉంటుంది. ఆమె ఇంటరు చదువుతున్నప్పటినుండి పెద్ద పెద్ద డిబేటింగ్ పోటీలలో సుబ్బారావుకు ఎదురవుతుండేది. ఈ విధంగా సుబ్బారావుకు, పద్మకు పరిచయమైంది. పరిచయం స్నేహంగాను, స్నేహం ప్రేమగాను మారింది. పద్మ మెడికల్ కాలేజీలో చేరినప్పటినుండి పద్మా సుబ్బారావుల ప్రణయం దినదినాభివృద్ధి అవుతున్నది. ఒకరినొకరు విడిచి కనిపించడం అరుదు. సుబ్బారావు ఉపన్యాసాలిస్తున్నా, టెన్నిస్ ఆడుతున్నా పద్మ హాజరవవలసిందే. యూనివర్సిటీ టెన్నిస్ ఛాంపియన్ షిప్ పోటీలలో, ఫైనల్సులో గెలిచి పెవిలియనులోకి అతడు రాగానే మొదట షేక్ హాండ్ ఇచ్చిన వ్యక్తి పద్మే.

సుబ్బారావు, పద్మలమీద కమలకున్న అసూయ క్రమంగా కోపంగా మారింది. పగకోసరమై ఎదురుచూస్తున్నది. పద్మ చరిత్ర తెలుసుకోవడానికి నాలుగు నెలలు అఖండంగా పరిశోధనలు కావించింది. అసలు పద్మకు చిన్నప్పుడే పెండ్లి అయిందని, భర్త వదిలేశాడని, తర్వాత చదువుల్లోకి దిగి, ఇప్పుడు సుబ్బారావుతో అసలు విషయం దాచి 'కులుకుతున్న' దని కనిపెట్టింది. ఈవిషయాన్ని మెల్లగా అందరికి ప్రసారం చేసింది. ఈవార్త గజ్జెకట్టి ఆడడం మొదలు పెట్టింది. కొందరు మనకెందుకు ఆ విషయం అనుకుంటే, మరికొందరు పద్మను హేళన చేయడం మొదలుపెట్టారు. ఇది కమలకు సంతోషం, కొంతవరకు మనశ్శాంతి కలిగించింది. తనే పద్మతో చెప్పేసి కసి

తీర్చుకోవాలని, సమయంకోసం ఎదురు చూస్తున్నది. అందుకనే హాస్టలు డైనింగ్ హాలు దగ్గర అనవసరంగా గిల్లి కయ్యం తెచ్చుకునే రీతిగా నలుగురిలో అలా మొహాన అనేసింది. అక్కడవున్న వారు కమలపక్షమే కావడంచేత, కమలకు సపోర్టుగా పక్కున నవ్వారు.

పద్మ డైనింగుహాలుదగ్గరనుండి వడిగా తనగదిలోకి వెళ్ళింది. ఇదివరకు అప్పుడప్పుడు ఈవిషయమే తన పరోక్షంలో కమల అన్నట్లు వినికిడి. ఇప్పుడు ఎదురుగుండానే అనింది. ఇక లాభంలేదు. తను నలుగురిలో తలెత్తుకొని తిరగడం కష్టం. ఈ సమస్యను సవ్యంగా పరిష్కరించాలి అనుకున్నది. ఇంతలో హాస్టలు గడియారం పదికొట్టింది. అప్పుడు ఆరాత్రి పద్మమనస్సులో ఒక్కసారి పది సంవత్సరాలనుండి జరిగిన వివిధ ఘట్టాలు కళ్ళముందు, సినిమాలో లాగా తిరిగినాయి.

ఒకరోజున పద్మతండ్రి సీతారామయ్యగారు 'ఏమే ఇవాళ పెళ్లివారువస్తున్నారు. మనపద్మను చూడడానికి జ్ఞాపకముందా?' అని హెచ్చరించాడు భార్యను. తల్లి పద్మను బొమ్మలాగా అలంకరించింది. పెళ్లివారు వచ్చి చూచారు. సరే నన్నారు. తర్వాత కొన్నిరోజులకు పెండ్లిఅయింది. తర్వాత ఒకనెలకు వాళ్ళకు కష్టాలు గోదావరి వరదల్లాగా వచ్చినాయి. పద్మ తండ్రికి పక్షవాతం వచ్చింది. దాంతో ఉద్యోగం మానేశాడు. సుమారు రెండేళ్లుదాంతో అవస్థపడి పరలోకానికి పోయాడు. వ్యాధిమూలంగా ఇల్లుగుల్ల అయింది. అప్పటికి పద్మకు పదమూడేళ్లు. పదకొండేళ్ళకే థర్డుఫారం ఫస్టుమార్కులతో పాసయినప్పటికి, ఇంట్లో, తల్లికి వేరేసహాయం లేక మానిపించారు. తండ్రి వ్యాధిమూలంగా అయ్యే విపరీతమైన ఖర్చుమూలంగా ఆరెండేళ్ళూ చదువుకు స్వస్తిచెప్పింది. ఇది తనభర్తకు గిట్టలేదు. అప్పటికిఅతడు ఇంటరు మాత్రమే చదువుతున్నా, తన భార్య చదువుకుని డిగ్రీలు సంపాదించాలని అతనికోరిక. అతని కుటుంబంలో అక్కలు, వదినెలు అందరూ డిగ్రీలు పుచ్చుకున్నవారే. అదీ కాకుండా పెండ్లిఅయిన కొత్తల్లో పద్మ తండ్రికి వ్యాధిమూలంగా, అతనికి అంతగా మర్యాదలు జరగలేదు. ఈ కారణాలు ఒకటిపైఒకటి దొంతర్లుగావచ్చి పద్మను భర్తనుండి వేరుచేశాయి. తర్వాత ఒకరోజు పిడుగులాగా ఒక ఉత్తరంవచ్చింది. 'మాఅబ్బాయికి మీపిల్ల అక్కర్లేదు. ఇంకో పెండ్లి చేసుకుంటాడు' అని. తర్వాత పద్మకుటుంబం, వాళ్ళకుటుంబం వేరైపోయినాయి. పద్మ తన కుటుంబాన్ని, తన జీవితాన్ని సవ్యంగా నడపడానికి పూనుకొంది. పట్టుదలతో, ధైర్యంగా చదువుమొదలెట్టింది. కొద్దిభూమి మీద వచ్చే ఆదాయానికి, తన ప్రైవేటుల మూలంగా లభించే పైఆదాయం జతపరచి,

# ★ కలయిక

మెల్లగా అప్పులన్నీ తీర్చేసింది. ప్రతితరగతిలోను ఫస్టుకొచ్చినందువల్ల స్కాలర్‌షిప్పులు దొరికేవి. స్కూలు ఫైనలులో స్కూలులో ఫస్టుగా నెగ్గింది. ఇంటరు పాసై మెడికలు కాలేజీలో చేరింది. స్కూలు ఫైనలులోను, ఇంటరులోను ఎన్నో డిబేట్లలో పాల్గొన్నది. తను ఇంటరు చదువుతున్నప్పుడు జరిగిన 'ఇంటర్ యూనివర్సిటి' పోటీలలో మెడికల్ కాలేజీనుండి వచ్చిన అభ్యర్థి సుబ్బారావు. అతనితో అప్పుడే పరిచయమయింది. అతని వాక్చాతుర్యం చూసి ముగ్ధురాలైంది. ఆనాడు డిబేట్‌లో తను గొప్పగా మాట్లాడింది. అందరూ ఏకగ్రీవముగా తనకు ఫస్టుప్రైజు ఇవ్వాలన్నారు. సుబ్బారావుకు సెకండు ప్రైజు వచ్చింది. అప్పుడు సుబ్బారావు తనదగ్గరికి వచ్చి షేక్‌హాండ్ ఇచ్చి, 'ఇంత చిన్న వయస్సులో ఇంగ్లీషులో అఖండంగా మాట్లాడారు. రేపు తెలుగు పోటీలలో కూడా ఉన్నారనుకుంటాను,' అన్నాడు

తనని, తను ఆకర్షించిన వ్యక్తి అలా పొగడడంతో ఆనందం కలిగింది. 'అలా పొగడేయకండి. రేపుకూడా ఏదో మాట్లాడుదామనుకుంటున్నాను,' అన్నది.

మరుసటిరోజున తెలుగులో కూడా అద్భుతంగామాట్లాడింది. కాని సుబ్బారావు అంతకన్నా బాగా మాట్లాడాడు. అతనికి ఫస్టు ప్రైజు, పద్మకు సెకండు ప్రైజు వచ్చినాయి.

ఆరోజుకూడా తనని అభినందించి 'మీరు ఇవాళ చాలా బాగా మాట్లాడారు. మీకే ఫస్టుప్రైజు అనుకున్నాను. బాగా అభివృద్ధిలోకి రాగలరు. కృషి మానకండి,' అంటూ కొంచెం ఉపదేశించాడు కూడా.

ఆ రెండు రోజుల్లోనే తను, సుబ్బారావును విడిచి ఉండలేనేమో అని అనుకోవడం కలిగింది. తర్వాత రెండుసార్లు డిబేట్‌లలో కలుసుకున్నారు. దాంతో ఇద్దరికీ ఒకరిమీద ఒకరికి స్నేహాభావమే కాకుండా, అనురాగం కూడా కలిగింది. తను ఇంటరు పాసవగానే, సుబ్బారావు తన పలుకుబడి ఉపయోగించి, తనకు మెడికల్ కాలేజీలో సీటు ఇప్పించాడు. అలా ఇద్దరూ ఒకే కాలేజీలో ఉండడం మూలంగా ఇద్దరు కలిసి తిరిగారు. స్నేహం ప్రణయంగా మారింది.

అలా పదేళ్ళలో జరిగిన చరిత్ర అంతా పద్మ కళ్ళముందు తిరిగింది. అప్పుడు ఆ రాత్రి వరండాలో గడియారం రెండు కొట్టింది. ఒక్కసారి ఉలిక్కిపడింది. పది గంటలు కొట్టంగా విన్నది. తర్వాత నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ వచ్చినది రెండు

"ఎలాగైనా రేపు సంగతి యావత్తూ సుబ్బారావుకు చెప్పితీరాలి," అని నిర్ధారణకు వచ్చి అలాగే నిద్రపోయింది.

మరునాడు యథాప్రకారంగా కాలేజి పోర్టికోలో సుబ్బారావుకోసం ఎదురు చూస్తున్నది. సుబ్బారావు వచ్చాడు. కాని తను ఇదివరకులాగా సూటిగా చూసి నవ్వలేకపోయింది. తెలియకుండానే మొహం దించుకున్నది. ఇది కనిపెట్టిన సుబ్బారావు "ఏం అలా ఉన్నారు? కళ్ళు ఎఱ్ఱగా ఉన్నాయికూడా. ఒంట్లో బాగా లేదా?" అని ప్రశ్నలవర్షం కురిపించాడు

లేదన్నట్లు తల ఊపుతూ "నిద్రపట్టలేదండి" అన్నది. మౌనంగా కొంతదూరం నడిచారు. తర్వాత బరువుగా.

"ఇవాళ బీచికి పోదామా?" అని అడిగింది.

"ఓ. యస్. ఆరింటికి వెళ్దాము," అన్నాడు సుబ్బారావు. తర్వాత ఎవరి క్లాసుకు వాళ్ళు వెళ్ళారు. పద్మ ఆరోజల్లా, సుబ్బారావు తనని ఎలా అర్థం చేసుకుంటాడు, ఇన్నాళ్ళు గౌరవంగా చూడబడి, చివరికి మొగుడు విడిచిన ఆడది అని ఏవగించుకుంటే! తన జీవితం ఎలా మారుతుందో?......అనే ప్రశ్నావళితో బాధపడసాగింది.

పద్మ సాయంత్రం అయిదుగంటలకల్లా బీచికి వెళ్ళింది. సరిగ్గా ఆరుగంటలకల్లా సుబ్బారావువచ్చి, అంతకుముందే వచ్చి తనకోసం ఎదురుచూస్తున్న పద్మతో "ఏమండీ, ఎంతసేపైంది మీరొచ్చి?" అన్నాడు.

"ఇప్పుడే వచ్చానండి. మీతో అతి ముఖ్యమైన విషయాలు మాట్లాడాలి" అన్నది రానినవ్వు తెప్పించుకుంటూ. కాని లోపల ఆందోళనపడుతూ, బయటికి సంతోషాన్ని



చిత్రం: క. సీతారామారావు, బందరు

ప్రకటిస్తున్నదని కనిపెట్టగలిగాడు, సూక్ష్మగ్రాహి అయిన సుబ్బారావు.

"అలా అయితే నేనడుగుతున్న ప్రశ్నకు ఇవాళ సమాధానం రావచ్చుఅనుకుంటా," అన్నాడు సుబ్బారావు తమ పెండ్లివిషయం మనస్సులో ఉంచుకొని.

పద్మ, "అవును. అన్ని విషయాలు మీకు ఇవాళ సమగ్రంగా చెప్తాను. మీరు పెండ్లి విషయం ప్రస్తావించారు. దానికి ఏ సమాధానం సరిగ్గా చెప్పకపోవడానికి కారణముంది," అన్నది.

"చెప్పండి. నేను సహాయం చేసేదున్నా ఉంటే చేస్తాను," అన్నాడు లోపల పద్మ ఏమి చెప్పుతుందో. అన్న ఆందోళనతో.

పద్మ, "నాకు చిన్నప్పుడే వివాహం అయింది," అన్నది. దాంతో ఉలిక్కిపడ్డాడు సుబ్బారావు. అయినా తమాయించుకొని "అలా నాకు చెప్పనేలేదేం? ఆ అదృష్టవంతుడు ఎవరండి?" అన్నాడు, లోపలి ఆందోళనను అణగద్రొక్కుకుంటూ.

"మీరు నన్ను ముందు చెప్పనివ్వండి. పెండ్లి అయింది. తర్వాత మా కష్టాలు గమనించక, నన్ను ఆయన ఏలుకోలేదు," అన్నది పద్మ ముక్తసరిగా.

తన మాటలను వింటుంటే సుబ్బారావు మొహంలో మార్పు రావడం గమనించింది పద్మ. వెంటనే "మీకు బహుశా ఆశాభంగం కలిగించానేమో, మీబోటి భాగ్యవంతులకు, చదువుకొన్నవారికి నాకన్నా మంచివాళ్ళు దొరుకుతారు. నా స్వవిషయం చెప్పి మీకు కష్టం కలిగిస్తున్నాను. క్షమించండి మరి ఏనాడైనా మీకు ఈ విషయాలు తెలియాలిగా" అన్నది.

"అలాకాదు. బహుశా, నాకు కనువిప్పు కలిగిస్తున్నారేమోఅనిపిస్తున్నది," అన్నాడు మాటలు తడబడుతుండగా.

పద్మ, "అలా అంటా రెందుకు?" అని అడిగింది.

"చెప్తాను, కొంచెం విపులంగా కొన్ని విషయాలు చెప్పండి. మీ ఊరు గుడివాడ అని తెలుసు. మీ తండ్రిగారి పేరు, భర్త, మామగారి పేర్లు చెప్పండి."

పద్మ, "ఎందుకలా అడుగుతున్నారో నా కర్థం కావడంలేదు. అది పదేళ్ళనాటి సంగతి. నా మీద మీకు అంత దయ ఉన్నందుకు చాలా థాంక్స్," అని ఊర్కున్నది.

"కాదండి; మీరు చెప్పండి" అని అతను బలవంతపెట్టాడు.

"సరె కానివ్వండి. ఆ రోజుల్లో మేము విడదవోలులో ఉండే వాళ్ళం. నాన్నగారి పేరు సీతారామయ్యగారు. నా పెండ్లినాటికి ఒ చిన్నస్కూల్లో హెడ్ మాస్ట

రుగా పని చేసేవారు. గౌరవంగా బ్రతికే వాళ్ళం. మామగారిపేరు శంకర్రావు. అప్పుడు శ్రీకాకుళంలో రిజిస్ట్రారుగా పని చేస్తున్నట్లు గుర్తు. సరి, భర్తగారి పేరు కూడా మీ పేరే,' అన్నదామె.

ఈ విధంగా పద్మ ఒకొక్క విషయం విపులంగా చెబుతుంటే సుబ్బారావు మిు హాంలో చలనం కలుగుతున్నది. ఏదో బాధ పడుతున్నట్లు పద్మ గ్రహించ కలిగింది. ఆ పంజ చీకట్లో రెండు నీటిచుక్కలు అతని కండ్లలో మెరిసినై. ఆ రెండూ టపటప రాలినై. పద్మ మౌనంగా ఇదిచూచి గాభరాపడింది. వెంటనే అతన్ని సమాధాన పర్చాలని "ఏమండీ: నా విషాధ గాథ మీకు చాలా కష్టం కలిగించి నట్లుంది. ఏదో, కొందరి జీవితాలు అలా గడవాలి లేండి. ఈ జన్మకు డాక్టరుగా ప్రజాసేవ చేస్తాను," అన్నది. తన కండ్లలోంచి పడ బోతున్న నీటిచుక్కలను తుడుచుకుంటూ.

సుబ్బారావు "అలా అవదేమోలెండి," అన్నాడు గంభీరంగా.

పద్మ "ఎందుకని?" అన్నది.

"మీరుచెప్పింది విన్నాను. ఇంకొక విషయం నాకు కావాలి. మీ భర్తఫోటో ఏదన్నా చూపిస్తారా?" అన్నాడతడు.

ఆమె "మీధోరణి నాకు అర్థంకావడం లేదు. అయినా మీకు చూపించాలనే తెచ్చాను, పెండ్లినాడు తీయించుకున్న గ్రూపుఫోటో. నాభర్తకు మీకు కొంచెం పోలికలున్నాయికూడా" అని ఒక పాత కాబినెట్ సైజ్ ఫోటో హాండ్ బేగ్ లోంచి తీసిచూపించింది.

ఆ సన్న నివెలుగులో ఆ ఫోటోనునిర్ఘాంత పోయి చూస్తున్నాడు సుబ్బారావు. నోటి నుండి మాటలురావడంలేదు. ఏదో చెప్ప బోయాడు. చివరికి ఆనందం, విషాదం కలిసిన గొంతుతో "క్షమించు పద్మా" అని అరిచాడు. అతని కండ్ల వెంబడి కన్నీరు వరద లాగా పొర్లి పొర్లి వస్తున్నది. పద్మకు ఏమీ బోధపడిందికాదు. ఏంచేయాలో తోచక,

"ఏమండీ; మీ ప్రవర్తన అర్థంకావడం లేదు. మెల్లిగా పోదాం రండి," అన్నది.

"నాలాంటి కిరాతకుడు ఈ ప్రపంచంలో మరొకవ్యక్తి ఉండడు. నేనే నీ భర్తను. నేనే ముందు నిన్ను కాదని తెగతెంపులు చేసుకుంది. నేనే ఈనాడు నిన్ను క్షమాపణ కోరుతున్నాను," అంటూ సుబ్బారావు పద్మని తనచేతుల్లోకి లాక్కున్నాడు.

పద్మ ఆనందంతో "నా జీవితంకూడా సుఖాంతం అయింది ఈనాటికి" అంటూ అతని ఒడిలోకి జరిగింది.







ఆదినుంచీ మానవ సంఘాలలో దండనీతి ఉండనే ఉంది. సంఘం ఏర్పరచిన చట్టాలకు లోబడి, ప్రతీ మనిషీ నడుచుకుంటేనే సంఘానికి శ్రేయస్కరంఅనీ, సంఘం సరిగా నడుస్తూ బలంగా ఉంటేనే గాని, వ్యక్తికి క్షేమం, సుఖం అనేవి ఉండవనీ, ఆదినుంచీ మానవుడి అభిప్రాయం, నమ్మకం కూడాను. ఈ వాదు నయితం, మానవుడి అనుభవంకూడా అంతేనని మనం ఒప్పుకోవాలి. అందుచేత అన్ని దేశాల్లోనూ, కాలాను గుణంగా సంఘనియమాలు, న్యాయాలు, వాటి ననుసరించి దండనీతులు, ఏర్పడ్డాయి. సంఘన్యాయాలు, దండనీతులు, దేశకాలపరిస్థితులనుబట్టి నేటివరకూ మారుతూనే వస్తున్నాయి.

దండనీతి అంతటిలో సర్వ దండనలనూమించి, అతితీవ్రమయినది మరణదండన. ఈ మరణదండన మించిన దండన మరొకటి లేదు. ఈ నాడుకూడా అనేక దేశాలలో మరణదండన, దండనీతిలో ఒక భాగంగానే ఉంది. నేటి నాగరిక ప్రపంచంలో మరణదండన అమలులో ఉండటం న్యాయంకాదుకదా, తప్పని వాదించే న్యాయవేత్తలు చాలమంది ఉన్నారు. ఈ సిద్ధాంతాన్ని అనుసరించి, నేడు చాలా దేశాలలో మరణదండన తీసివేయబడింది. అర్జంటైనా, కొలంబియా, డెన్మార్కు మొదలయిన కొన్ని దేశాలల్లో నేడు మరణ దండన లేదు. రష్యాలో సైతం, 1947 వ సంవత్సరంలో మరణదండన కూడదని, అందుకు బదులు ఇరువది అయిదు సంవత్సరాలు ఖైదు వేయవలెనని అన్నారు. బెల్జియం దండనీతిలో మరణదండన ఉన్నప్పటికీ, గడచిన 70 సంవత్సరాలనుంచీ. మరణదండన ఏ నేరస్థుడికి విధించలేదు. ఇటలీలో 1889 లో తీసివేసిన మరణదండన, మళ్ళీ ఫాసిస్టుల కాలంలో అమలులోకి వచ్చింది. కాని ఇప్పుడు తిరిగీ వారి దండనీతిలో మరణ దండన మాఫు చెయ్యబడిన మాట వాస్తవం.

కాని, మనదేశం, మన దేశంతోపాటు కొన్ని దేశాల్లో దండనీతిలో మరణదండన ఒక భాగంగానే ఉంది. ఈ దండన ననుసరించి, ప్రతీ సంవత్సరం కొన్ని వందలమంది న్యాయస్థానాలందు శిక్షింపబడి మరణం అనుభవిస్తున్నారు. దండనీతిలో మరణదండన విధివిధాయకంగా ఉండాలనే అభిప్రాయం పలువురు న్యాయవేత్తలకు ఉండటమే దీనికి కారణం. భయం అనేది మానవుడికి అసలు ఉండకపోతే, సంఘ నియమాలను పాటించడనీ, అందుచేత కొన్ని తీవ్ర నేరములకు మరణ దండనే లేకపోతే దుష్టులు విచ్చలవిడి అయి, సంఘాన్ని విచ్ఛిన్నంచేస్తారని వారి అభిప్రాయం. ఈ రెండు సిద్ధాంతాలను పరిశీలిస్తూ అన్ని దేశాలలోను ప్రబల చర్చలు జరిగాయి.

ఏమైనా మానవుడు నేడు కూడా మరణదండన విధించి అనేకమందిని శిక్షిస్తున్న మాట వాస్తవం. కాని దండన విధించబడిన



ఆమంచర్ల గోపాలరావు

# మరణ దండన

నేరస్థుడిని అన్ని దేశాలలో ఒకేమాదిరిగా శిక్షించడం లేదు. మనదేశంలో ఉరితీసి చంపుతారు. అమెరికాలో ఎలెక్ట్రిక్కు కుర్చీమీద బంధించి, కరెంటు పెట్టి చంపుతారు. మరికొన్ని దేశాలలో తల ఖండించి మరీ చంపుతారు. నేటిఅన్ని విధానాల మరణ శిక్షలలో భావం ఒకటే, న్యాయంగా శిక్ష అనుభవించేవాడి మీద కసి, కోపం మానవుడికి ఉండకూడదని, అందుచేత అతనిచావు వీలయినంత సులువుగా అయిపోవలెనని, నేటి న్యాయవేత్తల అభిప్రాయం. ఈ అభిప్రాయాన్ని అనుసరించే, అనేక దేశాలలో సుళువుగా, బాధ అనేది తెలియకుండా మనిషిని ఎలా చంపడం అనే విషయాన్ని గూర్చి చాల పరిశోధనలు కూడ జరిగాయి. బ్రిటీషువాళ్ళు కనిపెట్టినది ఉరి. అదే నేడు కూడా మన దేశంలో అమలులో ఉంది. అమెరికావాళ్ళు కనిపెట్టినది ఎలెక్ట్రిక్ కుర్చీ.

కాని పూర్వకాలం దండనీతి, దండనా విధానాల భావం వేరుగా కన్పడుతుంది. తప్పు చేసిన వాణ్ణి, ఆ తప్పుకు తగిన రీతినే చంపాలి. నిజంగా నాటి సంఘ రూపం నేటివలె గాక మరో రకంగా ఉండేది అని నాటి మరణదండనలను పరిశీలిస్తే తెలుస్తుంది. పూర్వం మరణ దండనకు గురి అయిన మనిషిని అనేక రకాలుగా చంపేవారు. నేడు సామాన్యంగా సమాలోచించి హత్య చేసినవాడికే మరణ శిక్ష. ఇంకా ఇంగ్లండులో అక్కడా, సముద్రాలమీద దోపిడి చేసేవాండ్లకు, రాజుగారి ఓడలను దొంగిలించే వాండ్లకు, ఇంకా కొన్ని రకాల ఉద్రిక్త నేరాలు చేసిన వాండ్లకు కూడా మరణ శిక్ష అంటూ ఉంది. కాని ఈ మధ్యన అటువంటి నేరాలు చేసినవాండ్లు లేక పోవడంచేత, ఆ నేరాలకు ఇంగ్లండులో మరణ శిక్షలు పొందినవాండ్లు లేరని చెప్పవచ్చు.

పూర్వం మానవసంఘం నేటివలె గాక మరోరకంగా ఉంటంచేత, అనేక నేరాలకు మరణశిక్ష—ఉండేది. ఆ శిక్ష సయితం తప్పును అనుసరించి అనేక రకాలుగా ఉండేది. మన దేశంలో చాల పురాతన గ్రంథమయిన కౌటిల్యార్థ శాస్త్రంలోని దండనీతి భాగంలోని మరణదండనలు నేడు విచిత్రంగానే తోస్తాయి. ఉదాహరణకు కొన్నింటిని గమనిస్తాం.

తగవులలో మనిషిని చంపినవాడికి మరణ శిక్ష, కాని దెబ్బ తిన్నవాడు పదిహేను రోజులు జీవించివుంటే, అయిదు వందల పణాలు జరిమానా. త్రాగి, కైపులో హత్య చేసిన వాడికి చెయ్యిమాత్రము నరికివేసేవారు.

అనవసరంగా అపవాదులు వేసి, వాటిని వ్యాపకంచేసే వాళ్ళకుకూడా మరణ దండనే. అతి జారత్వం గల్పినా మరణ దండనే. దారులు కొట్టేవాండ్లు, కన్నాలు వేసేవాండ్లు, రాజుగారి ఏనుగులను, గుర్రాలను దొంగిలించే వాండ్లందరకి మరణ శిక్షే. రాజద్రోహం చేసినా, దురుద్దేశంతో రాజాంతఃపురంలోకి ప్రవేశించినా, ఆపాద మస్తకం కాల్చి వేసి చంపేయడమే శిక్ష. బ్రాహ్మణుడు మాత్రం ఇలాంటి పనులుచేస్తే వాణ్ణి నిలువునీళ్ళలో ముంచి చంపేవారు. ఇవన్నీ ఇటా వున్నా న్యాయస్థానంలో వుండి, అన్యాయంగా శిక్షలు వేసేవాండ్లకు కూడా మరణ శిక్షే.

తల్లి తండ్రులను, గురువులను, సన్యాసిని చంపిన వాండ్లను తల, చర్మం మాత్రమే కాల్చి చంపేవారు. పాడిగొడ్లను దొంగిలించిన వాణ్ణి తలకోసి చంపేవారు. గట్లు కోసి చెరువులను ధ్వంసం చేసేవాండ్లను, ఆ చెరువులోనే ముంచి చంపేవారు. విషం పెట్టి హత్యచేసిన వాండ్లను నీళ్ళలో ముంచి చంపేవారు. పంటకొచ్చిన పొలాలను, పాములను తగులపెట్టే వాండ్లను, ఆ మంటలోనే వేసి చంపేవారు. సిఫాయి కాని వాడు ఆయుధాలను దొంగిలిస్తే, వాడికి కూడా మరణదండనే.

ఈ దండనాభాగాన్ని కౌటిల్యుడు క్లేశ దండమని చెబుతూ, క్రౌర్యం లేకుండా హత్యచేసినవాడిని, క్రౌర్యం లేకుండానే మెత్తగా చంపేయడమే మంచిది అన్నాడు.

అందుచేత ఆనాటి దండనీతిలో కొంత కసి, క్రౌర్యం కూడా ఉన్నట్లే తోస్తుంది. అందుచేతనే ఆనాడు మరణదండనకు గురిఅయిన వాణ్ని, అనేక రకాలుగా హింసించి కూడ, చంపేవారు. మనిషి బుర్రకు అంతు లేని కారణం చేత, దండనీతి శాస్త్రాల్లో అనేకరకాల మరణ ప్రయోగాలు చెప్పినప్పటికి, వాటన్నిటిని మించిన క్రౌర్యంతో కూడా పూర్వం మరణశిక్షలు విధించేవారని చెప్పవచ్చు.

పూర్వం మన దేశంలో మరణశిక్షకు గురి అయిన వాండ్లను కొరత వేయడం సామాన్యం. ఒక బల్లెమునో బరిసెనో నేలకు నిలువునా పాతి, నేరస్థుని అంగుదిగ వేయడమే, కొరత వేయడం. ఇలా శిక్షింపబడ్డవాడు ఒక్కొక్కప్పుడు రెండు మూడు రోజులు కూడా ప్రాణాలతోనే ఉండి బాధపడేవాడు. ఆరోజులలో అట్లు బాధపడుతున్న వాడికి, రాజభయంచేత, నీళ్ళయినా ప్రజలు అతనికి అందిచ్చేవారు కాదు, ఇట్టి ఘోర మరణావస్థను, నేడు మనం వినికూడా సహించలేము నేమాట సత్యం.

నాడు నేరస్థులను ఏనుగులచేత తొక్కించి చంపివేయడం కూడా కద్దు. కొంత మందిని నిలువునా చర్మం ఒలిపించి చంపేసేవారు. నేరస్థుడిని సున్నపురాళ్ళలో విరిచిపోసేవారు. బ్రతికి ఉన్నపుడే పాతర పెట్టి చంపడం నాడు ఒకరకం. ఒక్కొక్కప్పుడు, పెద్ద గానుగల క్రిందనో, లేక పెద్ద తిరగళ్ళ మధ్యనో నేరస్థుణ్ని పెట్టి, నలిపి చంపేవారు.

ఇటువంటి మరణ శిక్షలన్నీ, నాడు రాజుల న్యాయాధికారుల చిత్తాన్ని అను



# ★ మరణదండన ★

...షరించి జరుగుతుండేవని చెప్పవచ్చు. ఘోర అపచారం చేసిన నేరస్థుడిమీద వాడు న్యాయాధికారికి కలిగినకోపం, కసీ అన్నీ ఆ శిక్షలో తెలిసేవి.

మొగలాయి రాజుల కాలంలో, కొందరు నేరస్థులను చిత్రంగా చంపేవారు. ఒక ఎద్దునో, గేదనో చంపించి, దాని చర్మం ఒలిపించి, ఆ పచ్చి చర్మంలో నేరస్థుణ్ని నిలువునా కుట్టేసేవారు. అప్పుడు నేరస్థుడి చావు అతి ఘోరం. చర్మం ఎండినకొద్దీ అది బిగుసుకుపోయేది. అందులో కుట్టబడిన వాడి దేహం, ఎముకలు క్రమంగా నలిగి పిండయిపోయేవి. చివరికి కొన్ని రోజులకు అతడు భరింప శక్యంకాని బాధ ననుభవించి మరి చచ్చేవాడు. ఇల్లా క్రమంగా నలగడంవల్ల కలిగే బాధకు తోడుగా, రోజులు గడిచేకొద్దీ ఆ చర్మంలోని మాంసం కుళ్ళడం, దాని దుర్గంధం, దానితోపాటు ఆ చర్మం నిండా చేరే పురుగులవల్ల బాధకూడా సహింపరానిదే. ఇట్టి ఘోరమరణాన్ని మొగలాయి నవాబులు, రాజద్రోహం చేసినవాండ్లకు విధించేవారుట. నేరస్థుడిమీద వాళ్ళకు కొంత కనికరం కలిగితే, వాడిని గాడిద చర్మంలో కుట్టించి చంపించేవారుట. దీనికి కారణం, గాడిదచర్మం, ఎద్దు చర్మమంత వేగంగా బిగిసిపోదు. అందుచేత, అందులో కుట్టబడినవాడి అవస్థ మరి రెండు రోజులధికంగా ఉండేది. ఈ దండనలో, కాటిల్యుడన్న మెత్తదనం ఉందని మనం అనుకోవచ్చు.

దాదాపు మూడువందల సంవత్సరాల క్రితం, మలబారులో విదేశీయుడొకడు చూచిన మరణదండనా విధానం అతి చిత్రమయినది. నేరం చేసి మరణదండనకు గురి అయిన నేరస్థుడొకడు, తాను దేవికి బలి అవుతానని, అందుకు అనుజ్ఞ ఇవ్వవలసినదనీ, రాజుకు ఒక ఫర్మానా పంపుకున్నాడు. అది ఆనాడు న్యాయాచారములలో ఉన్నందుచేత రాజు దానికి ఒప్పుకొని వలసిన ఏర్పాట్లన్నిటికీ ఉత్తరువులనిచ్చాడు. వెంటనే ఆ నేరస్థుడిని ఒక పెద్ద బండిమీద నిలబెట్టారు. వాడికి ఎనిమిది వాడి బాకులను ఇచ్చారు. వేలకు వేలాది జనం, మేళతాళాలతో దేవి గుడివైపుకు, పెద్ద ఊరేగింపుతో ఆ బండిని నడిపించారు. వాడు వరుసగా ఆ ఎనిమిది బాకులను తన దేహంలోకి పొడుచుకొని, దోవలోనే దేవిని స్మరిస్తూ చచ్చాడు. అనేకమంది అతడు మోక్షానికి వెళ్ళాడని, తరించాడని కూడా అన్నారుట.

నిజంగా ప్రాచీనకాలంలోని దండనీతిని, నాటి దండనా విధానాలను గమనిస్తే నేటి దండనీతి చాలసరళమయినదిగా తోస్తుంది. అనేకమంది నేరస్థులు నేడుకూడా చిత్రహింసలకు, మరణదండనలకూ, ఇతర శిక్షలకూ పాల్పడుతున్నప్పటికీ అవన్నీ న్యాయం కాదనీ, వారందరూ మానసిక అనారోగ్యం చేతనే అట్టి నేరాలను చేయడం జరుగుతుందనీ, వాళ్ళను నిజంగా వైద్యశాలలో భద్రముగా పెట్టి చికిత్స చేయడమే మంచిదనీ అనే న్యాయవేత్తలు నేడు చాలమంది ఉన్నారు. ఈ భావాలన్నీ నాగరికతా పరిణామమునే చెప్పకతప్పదు. అందుచేతనే న్యాయస్థానంలో కూర్చున్న జడ్జీలకు కసీ, కోపం ఉండకూడదనే భావం, నేటి న్యాయచట్టాలలో స్పష్టంగానే గోచరిస్తుంది. ఈ కారణంగానే మరణదండనకు గురిఅయిన నేరసుడిని ఉరికంబంవద్దకు తీసుకొచ్చిన తర్వాత, అతని చేతులు వెనకాల కట్టివేసి, ముఖానికి ఒక తొడుగు తొడిగి, ఉరితాడు మెడకు తగిలించినమీదట ఉరితీయవలసిన అధికారి అతన్ని క్షమాపణ కోరుకొంటూ, ఈవిధంగా ముచ్చటిస్తాడు: "నీవు నేరం చేసినందుకుగాను న్యాయస్థానములో నీకీ శిక్ష విధించారు. నీమీద ఎవరికీ కోపంలేదు. నిన్ను ఉరితీయడం నావిధి కనుక నేనిప్పుడాపని చేస్తున్నాను. నీవు ఎవ్వరిమీదా కోపం ఉంచుకోకూడదు" ఇలా అంటూనే, లీవరులాగి ఒక్క క్షణంలో వాడి ప్రాణాలను ఆ అధికారి గాలిలో కలిపేస్తాడు.

శుక్రుడు తన నీతిసారంలో అన్నట్లు, కలికాలంలో దండనీతి క్రమంగా సరళమే అయింది. కాని ఇందుకు ఆయనగారు చెప్పిన కారణంమాత్రం చిత్రం. కలికాలములో పాలకులే పాపాలకు భైరవులడంచేత దండనీతికి ఈకాలంలో అంతగా అర్థం ఉండదని అతనిభావం. ★

# పాండ్స్

## డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ వాడి

ప్రొద్దున్న ఉండే తాజాదనమును

రోజంతా పొందండి




స్నానముచేసిన తరువాత పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం పౌడరును రాసుకొంటే రోజంతా తాజాగా మరియు హాయిగా ఉండగలరు!

తేలికైన సువాసనగల పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం పౌడరు ఎంతో మృదువుగా ఉంటుంది మరియు చెమటను పీలుస్తుంది. దీనిని రాసుకొని తాజాదనపు హాయిని రోజంతా అనుభవించండి!

చిస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడినది)

I.P. 7730

# అన్వేషణ

పోతుకూచి సాంబశివరావు

(గతవారం తరువాయి)

జీవితం కొంతవరకు మానవనిర్మితమనే సూక్తిలో సత్యమున్నట్లు స్ఫురించింది శివరాముకు. మనిషి ప్రణాళికలు వేసుకొని, ఒక నిర్ణీతపద్ధతిలో జీవితగమనాన్ని కళ్ళెం వేసి నడిపించినట్లయితే నిశ్చయించుకున్న లక్ష్యాన్ని కొంత ఆలస్యమయినా చేరగలుగుతాడు. లక్ష్యమే లేని జీవితాలు గాలిలో ఎగిరే తేలిక కాగితాల్లా ఎక్కడో పడి లేచి ఎగిరి మళ్ళీ పడుతుంటాయి. జీవితగమనానికి తన ఆలోచనలతో ఒకరూపు యివ్వాలనుకున్నాడు శివరాం.

స్నేహాలు పెంచుకోవడం కూడా ఒక కళ. తాత్కాలికంగా తమంతట తాము కలుసుకునే మనుష్యులు కాలక్రమంలో స్నేహితులైనా, ఆ స్నేహబంధంలో ప్రత్యేకత లేదు. ఏదైనా సాధించి సంపాదించుకున్న దానిలోని ఆనందం తాత్కాలికంగా లభించిన దానిలో కనిపించదు. దూరాన కొండలపైన ఎత్తైన భవనాలు, పెద్దపెద్ద కొంపల్లో హోదాతో బ్రతికే మనుష్యులు, విచిత్రమైన విభిన్నసంస్కృతులు, ఏకభాష ప్రాతిపదికపైనే వివిధమతాలతో కలసి, మెలసి బ్రతికే జాతులు,...ఆలోచించగా తమంత తామే సన్నిహితమయ్యేటట్లు కనిపించలేదు శివరాంకు. వాటి సన్నిధి చేరాలంటే తాను స్వప్రయత్నంతో సాధన చెయ్యాలని అనుకున్నాడు శివరాం.

ప్రజాస్వామ్యయుగంలో సంయుక్త బలాలకు కేంద్రాలైన సంఘాలు వివిధ తరగతులమనుష్యుల ఏకీకరణకు అవకాశమిస్తాయి. తను కనుభవమున్న రంగంలో అనుగుణ్యమైన మనుష్యులను చేరదీసి, ఒక సంఘం స్థాపించి, కార్యక్రమాలు నడిపిస్తే, తనుచూపు కందని ఉన్నత తరగతుల వ్యక్తుల దరిచేరడం సులువని నమ్మేడు శివరాం.

చిన్నప్పుడు, కాలేజీదినాల్లో నాటకాలు కొద్దిగా వేసేవాడు. సాహిత్యరచనల్లో చైతన్యవంతమైన అద్భుతప్రక్రియ 'నాటకం'. జీవితంలోకూడా నాటకం అనేది అందరూ చెయ్యలేని అద్భుతప్రక్రియే అనిపించింది శివరాంకు. నాటకరంగంలో ప్రవేశిస్తే అటు జీవితానుభవమూ, యిటు వివిధతరగతుల వ్యక్తుల పరిచయము లభిస్తుందని ఆశించాడు శివరాం.

ఆలోచనల్లా సరస్సులోని కెరటాలు గాలితోపుకు ఎగిరి గెంతుతున్నాయి. జీవితగమనంలా సరస్సులో దూరాన పడవ నడుస్తోంది. వాహ్యాళికి వచ్చి గుంపులుగా చెదిరి నడుస్తూ కర్రబెంచీలమీద కూర్చున్న జనం రంగురంగుల దుస్తులతో ఆ వంతెన శోభను తమవస్త్రాలకుంచెతో దిద్దుతున్నట్లు కనిపించారు. తన జీవితంలోకూడా క్రొత్త రంగులు తెచ్చుకోవాలనే ఆశతో శివరాం వంతెన విడిచి గృహోన్ముఖుడయాడు.

దారిలో గోడలమీద, పరుగెత్తే బస్సులమీద, బస్సుస్టాండు ఇనుపరేకులకు పెద్ద అక్షరాలతో కాగితాలు అంటించబడి ఉన్నాయి. "కురుక్షేత్రం నాటకం...ప్రసిద్ధ నటకులచే" 14 వ తేదీన నాటకానికి తప్పకుండా హాజరవ్వాలని తీర్మానించుకున్నాడు శివరాం.

సరోజినీదేవిరోడ్డులోని సినిమా థియేటరులో రాత్రి తొమ్మిదిగంటలకు జనం కిటకిటలాడుతున్నారు. కాంపౌండులో కిటికీల వద్ద టిక్కెట్లు దొరకని జనం 'క్యూ' లో నిలుచుని ఒకరినొకరు తోసుకుంటూ అరుస్తున్నారు. బలవంతుడైన ఆసామీ ఒకడు 'క్యూ' ని తప్పించుకుని కిటికీమీద పడి, పోలీసువానిచేత తోయబడి, చొక్కా చింపుకుని, చివరకు దొరికిన టిక్కెట్టు చేతబట్టి సంతోషిస్తూ విజయగర్వంతో నాటకం హాల్లోకి చేరాడు. భార్యతో వచ్చిన ధీరు తనవల్ల టిక్కెట్టు దొరకడం కష్టమని గ్రహించుకుని భార్యను క్యూమీదికి దాడి పంపగా, పోలీసువాడు అడ్డుకుని ఆమెకు టిక్కెట్టు ముందుగా యిప్పించేడు. నగరంలోని షోకేలా యువకులు–కోర్టు వ్యవహారాల మీద నగరానికి వచ్చిన వివిధ ఆంధ్రప్రాంత గ్రామీణులు, తలనెరిసిన వితంతువులు... ముడుతలుపడ్డ ముసలిమనుష్యులు–నాటకం హాలులో చేరిన గుంపుల్లో కనిపించేరు. ధనంతో నాటక విలాసాన్ని అనుభవిద్దామని వచ్చిన జమీందారు అలసిపోకుండా ముందు సోఫాల్లో కూర్చున్నారు. ప్రముఖ నగర రాజకీయవేత్త అధ్యక్షుడిగా ఆనాటి నాటకానికి ప్రత్యేక ఆహ్వానంమీద వచ్చేడు.

ఆనాటి నాటకంలో ధర్మరాజు, అర్జునుడు, కృష్ణుడు పాత్రలు ఒక్కొక్కటి ముగ్గురు మనుష్యులు చొప్పున ధరించారు. ఒకనిని మించిన రాగాలాపనలో మరొకడు పద్యాలు చదివి, మాటలు విరిచి, ముఖభంగిమలు తొణికించి శరీర సౌష్ఠవము ప్రదర్శించి, ఆపాత్ర ఆమోఘంగా చేసేసుకుంటూ తెరల్లోకి నిష్క్రమించేరు. ఒకపద్యంపాడి అలిసిపోయిన అర్జునుడు, దుర్యోధనుడు సమాధానంలో పద్యం చదివేలోపుగా తెరలోకి పోయి కాస్త కాఫీ సేవించి, పాత్ర తెరమీద ఉండవలసిన ఔచిత్యానికి భంగం కలగనట్లు, తిరిగి ప్రత్యక్షమయ్యేవారు. రాగాల పాతదనం, హార్మనీలమోతతో నాటకప్రదర్శనం నిండిపోయింది. ద్రౌపదిమానభంగం సమయాన ప్రేక్షకులు వేసిన అరుపులు, ఈలలు, వివిధ జంతుజాలం కూతలు, నాటకానికి కాకపోయినా నాటకంలోని ప్రేక్షకులకు కొంత విరామం కలిగించేయి. రంగంలోనికి ప్రవేశించిన దుశ్శాసనుడు ప్రజలకరంకాని పటిష్ఠ సమాసభూయిష్ఠ పదజాలంతో ప్రేక్షకులను అదరగొట్టేశాడు. పాతకథ, పాతబడిన నాటకరీతి, పాతపడి వయసుడిగిన నటకులే నాటకమంతా నిండినా, అంతమక్కువగా కటకటలాడే జనం రావడంతో పురాతనత్వంమీదఉండే సహజ అభిమానం ఆధునికులలో పోలేదనిపించింది.

సన్నగా, రివటలా నల్లగా చైనాబొమ్మలా శివరాం పక్కనేకూర్చున్న ఈశ్వరయ్య ఒక్కడూ నవ్వుకుంటున్నాడు నాటకరంగంలో రసోచితమైన హాస్యాన్ని చూచి. శివరాం సంభాషణగా కదిపాడు.

'అవునండీ! పూర్వతరంవారి నాటకాలు–ఆఖరిదినాలు!' నవ్వాడు ఈశ్వరయ్య ప్రస్తుత తరంలో తానొక గొప్పనటుడిలా.

'మీ రెప్పుడైనా నాటకాల్లో వేశారా?' శివరాం ప్రశ్నించాడు, అతని చరిత్రగురించి తెలుసుకుందామని.

'మీ రెప్పుడూ చూడలేదనుకుంటా... 'తుఫాను' నాటకంలో రైతుగా, 'ద్వేషం' లో కూలీగా, 'వరకట్నం'లో వరుడు యీ నగరంలోనటించి కప్పులు బహుమతులు పొందాను...మీ రెప్పుడైనా మా యింటికి రండి చూపిస్తాను...నన్నెరుగనివాళ్ళెవరూ యీ నగరంలో లేరు... నేను రేడియో నాటకాల్లోకూడా వేస్తాను! చొక్కాకాలరు

సద్దుకుని సోత్కర్షతో నవ్వులు చిలకరించాడు ఈశ్వరయ్య. మళ్లీ ఇలా అన్నాడు "ఆశపోయిన తీర్థం యెదురయిందిఅన్నట్లు... సరిగ్గా సమయానికి కనిపించారు... ప్రస్తుతం ఒక నాటకసంస్థలో ఉన్నాననుకోండి... కాని అక్కడ మనుష్యుల ప్రవర్తన చాలా విచిత్రం... బాగుపడే వాడంటే... ఏమిటో అసూయ... ఏ నాటకం ఏరుకున్నా, పెద్ద పాత్రలు స్వలాభపరంగా పంచుకుందాం అనే కోరిక తప్ప, ఎవరు ఆపాత్రకు ఆకారంలో, నటనాప్రతిభలో, ఔచిత్యం కలిగి ఉన్నాడనే విషయం ఆలోచించరు... అందుకే లెండి మన నాటకరంగం యింకా అధోగతిలో ఉంది... నేను ఒక నాటకసమాజం స్థాపించి యీ దురలవాట్లను రూపుమాపి ఉత్తేజకరంగా హృదయాహ్లాదకరంగా ఉన్నతస్థాయిలో నాటక ప్రదర్శనాలు చేయించాలని ప్రయత్నిస్తున్నాను ...దానికి మీ సహకారం ఎంతయినా కావాలి!" గుక్క తిప్పుకోకుండా చెప్పి వానఝంపరలా నవ్వాడు ఈశ్వరయ్య. తత్క్షణం శివరాం చిరునామా తెలుసుకున్నాడు. మర్నాడువచ్చి కలుసుకుని, ఒక వారం రోజుల్లో క్రొత్త నాటకసమితి స్థాపనకార్యక్రమం నడిపిస్తానన్నాడు ఈశ్వరయ్య.

కళ్లులేని ధృతరాష్ట్రుడు రంగస్థలంమీద ఉపన్యసిస్తున్నాడు. కృష్ణుడు సమాధానంగా రాయబారం జరుపుతూ పద్యాలు విసిరేస్తున్నాడు. అంగభంగిములు, స్వరకంపనలు, ఊగే, ఆశే, చేతులు ఈంకరటింకరలుగా త్రిప్పేస్తూ "ఈ నాటకం అయ్యేటప్పటికి తెల్లవారుతుంది. తిన్నగా హోటలుకు పోయి......కాఫీ సేవించి, కాలకృత్యాలు తీర్చుకుని ఆఫీసుకు పోవచ్చు!" తన చమత్కారానికి తనే ఫక్కున నవ్వుకున్నాడు ఈశ్వరయ్య.

ఈశ్వరయ్య అన్నట్లే నాటకాంతం అయ్యేటప్పటికి మసకవెలుగులు కనిపించాయి. నాటకం చూసిన జనమంతా నూనె కారుతూ పాలిపోయి, నిద్రలేక ఎర్రబడిన కళ్ళతో బయటికి వచ్చేరు. మునిసిపల్ పాకీవాళ్లు వల్ల సిమ్మెంటురోడ్లు ఊడుస్తున్నారు. ఎదురుగా ఉన్న జమీందారుగారి ఎత్తు గోడల కాంపౌండులోంచి కోళ్ళు కూస్తున్నాయి. రావిచెట్లు ఉదయవాయువుల్లో ఊగుతూ ఒళ్ళు విరుచుకుంటున్నాయి బద్ధకంగా.

ఒకరోజు సాయంత్రం అలసిపోయి ఆఫీసునుంచి యింటికివచ్చాడు శివరాం. తలుపు తీయగానే కార్డుఒకటి నేలమీద దొర్లుతూ ఎత్తుకోమని ఏడ్పించి చంటిపిల్లలా. [illegible]ఎత్తి చదివాడు శివరాం. ధర్మశాలలో పదవనెంబరు గదిలో ఆదివారం సమావేశానికి హాజరు కమ్మని ఈశ్వరయ్య వ్రాశాడు. బహుశా నాటకసమితి స్థాపనగురించి ప్రయత్నాలు తీవ్రంగా జరుగుతున్నాయనుకున్నాడు శివరాం.

కూరలబజారు ఎదురుగా ఉన్న ధర్మశాల గుమ్మందగ్గర నిలుచున్నాడు ఈశ్వరయ్య శివరాం వచ్చేటప్పటికి. "మీకోసమే చూస్తున్నా...అంతా వచ్చారు!" అంటూ శివరాంను లోపలికి తీసుకువెళ్లాడు ఈశ్వరయ్య.

గదిలో చాపమీద ముగ్గురు యువకులు కూర్చున్నారు. ఈశ్వరయ్య పరిచయం చేశాడు...వెంకట్రావు...మందుల కంపెనీలో ఏజెంటుగా పని చేస్తున్నాడు... నల్లగా, సముచితమైన శరీర సౌష్ఠవంతో, ఉబ్బెత్తు ఫాలంతో, పొట్టి ఆకారంలో. పటుత్వమైన వదనంతో, నిశితమైన కళ్లతో పరీక్షిస్తూ నవ్వాడు...నారయ్య లావుగా తెల్లగా, బలమైన శరీరంతో మిఠాయి వుండలా మిసమిసలాడుతూ అతి వినయంతో ఆహ్వానించాడు...సన్నగా బక్కగా ఎదురుకాపులో నిదానంగా చూస్తూ నమస్కరించేడు ప్రభాకరం.

పరస్పర పరిచయమైనాక నాటకసమితి స్థాపన ప్రసక్తి కదిలింది. ముఖ్యంగా నగరంలో ఆధునికరీతుల్లో ఐక్యతతో అద్భుత నటనాశక్తికలిగిన పాత్రధారులతో నాటకాలు ప్రదర్శించబడటంలేదని, ఏవైనా కొన్ని సంస్థలున్నా, అవి స్వలాభప్రేరితాలై కళకు ద్రోహంచేస్తున్నాయని, అంగుకల ఉత్సాహంగల యువకులు కొందరు చేరి ఉత్తమమైన నాటక...సంస్థ ఒకటి స్థాపించవలసిన అగత్యం ఎంతో ఉందని ఉద్ఘాటించాడు ఈశ్వరయ్య. ఆ అభిప్రాయాన్ని బలపరిచాడు ప్రభాకరం. క్రొత్తనాటకసంస్థ స్థాపిస్తే, పూర్వం ఇతర సంస్థలతో ఉన్న సంబంధబాంధవ్యాలను పూర్తిగా త్రెంచుకుని, సర్వశక్తి యీ క్రొత్తసంస్థకే ధారపోసి కంకణం కట్టుకోవాలని తన అభిప్రాయం ఈశ్వరయ్య గతచరిత్ర దృష్టిలో పెట్టుకుని లౌక్యంగా మాట్లాడాడు వెంకట్రావు. ఏది ఏమైనా సంస్థ అభివృద్ధికరంగా నాలుగు కాలాలు బ్రతికి బట్టకట్టే ఉన్నతస్థితికి రావాలంటే ధనం ముఖ్యం అనీ, దాని సంపాదనకి రాత్రింపగళ్లు పాటుపడాలని నారయ్య సూచించేడు వినమ్రతగా. క్రొత్తసంస్థలు స్థాపించడం సులభమేనని, స్థాపించినతర్వాత దానిని జీవంతో నిలబెట్టడానికి సర్వశక్తుల పాటు పడగలిగి, అవసరం అయితే జీవితాలను త్యాగం చెయ్యగలశక్తి ప్రదర్శించడం కష్టమనీ, ఆ రెండవ పద్ధతికి అందరూ ప్రతిజ్ఞ బూనినట్లైతే క్రొత్తసంస్థ స్థాపన ప్రకటించడం ఉత్తమమన్నాడు శివరాం. ధనసంపాదనతోపాటు, రసవత్తరమైన ప్రదర్శనల నిర్వహణం, ముఖ్యంగా కార్యకర్తలలో నిజాయితీ, నిష్పక్షపాతబుద్ధీ ఉండడం చాలాముఖ్యంఅని ఉద్రేకంగామాట్లాడాడు శివరాం. క్రిందటిదినం మందకొడిగా కనుపించిన శివరాం ఉద్రేకంగా మాట్లాడడం చూసి ఈశ్వరయ్య కొంచెం జంకాడు. సంస్థస్థాపిం

# ★ అన్వేషణ ★

చేక ఇతను తనకు మించినవాడు కాబోతాడనే భయంతో ప్రభాకరంవైపు ఏదో సమన్వయమైనభావంతో కన్నుగీటాడు. అపరిస్థితి నిశితంగా అర్థంచేసుకున్నాడు వెంకట్రావు. అసలు ధనప్రధానవిషయం ప్రసక్తి రాలేదని మౌనంగా నవ్వేడు నారయ్య.

సంస్థాపనపూర్వి అందరం ఏకగ్రీవంగా ఒప్పుకున్నాంకనుక ఒక పేరు పెట్టే సూచన గురించి తేల్చాలన్నాడు ప్రభాకరం. సమిష్టి చర్చ జరిగేక 'గంధర్వ నాటకసమితి' అని నామకరణం చేశారు తమ నాటక సంస్థకు. సూచనల తర్జనభర్జన జరిగేక ఒకరి మీద ఒకరు పూర్తినమ్మకం లేకుండానే, మొట్టమొదటగా ఒక ఉమ్మడి అంగీకారం వుండాలని, వెంకట్రావును కార్యదర్శిగాను, నారయ్యను కోశాధికారిగాను, ఈశ్వరయ్యను దర్శకుడుగాను ఎన్నుకున్నారు. అందరూ మునుపు ఎరుగున్న మనుష్యులు పదవులుపంచుకున్నారనే నెపం లేకుండా శివరాంను సహాయకార్యదర్శిగా చేశారు. ప్రభాకరం కావాలని తాదాత్మ్యం వహించి ఏ పదవి తీసుకోలేదు. ఈశ్వరయ్య ముఖంలో సంతృప్తి వెలసింది.

ఒక జమీందారుని తక్షణం సమితికి అధ్యక్షుణ్ణిచేసి, ఒక మంత్రిపుంగవుడిచే సమితికి ఎక్కువప్రచారం జరిగేలా ప్రారంభోత్సవం జరపాలని నిశ్చయించారు.

అనుకున్న ప్రణాళికలు అమలు జరుగుతూ కార్యక్రమాలు సక్రమంగా జరిగాయి. ప్రారంభోత్సవంనాడు సమితిలో చేరినఅయిదుగురు కలసి ఆడదిలేని నాటకం ఒకటి ఆడారు నిపుణతతో. సహజగాంభీర్యంలో మంత్రిపుంగవుడు సమితిని ప్రశంసించి ఉన్నతస్థితికి రావసిందని శుభాకాంక్షలు తెలిపాడు. ఈశ్వరయ్య విడిచిన నాటకసమాజంలోని నటకులు, తదితర నాటక సంస్థల ప్రతినిధులు, ప్రపలు ఉచితంగా యిచ్చే నాటకం చూసి, ఆనందిద్దామని తండోపతండాలుగా ప్రారంభోత్సవానికి వచ్చారు. నటకుల నటన బాగుందని పొగిడారు. ప్రారంభోత్సవం విజయవంతమైనదని వెంకట్రావు చేతులు ఆడిస్తూ ఉత్సాహంగా నవ్వేడు. ఈశ్వరయ్య గర్వం హెచ్చి నడివీధిలో ఒక నాయకుడి హోదాలో నిటారుగా, గర్వంగా నడవ మొదలెట్టాడు ప్రతికక్షి నటక బృందాన్ని చూసి.

కబుర్లు చెప్పే ఈశ్వరయ్య కానీ సంపాదించలేకపోయాడు సమితికోసం. జమీందార్ల స్నేహితుడై వర్తకసంఘాలమధ్య వ్యాపారుడిగా బ్రతుకుతున్న నారయ్య, మందుల కంపెనీ ఏజెంటుగా తియ్యని మాటలతో మసిబూసి మారేడుకాయ చెయ్యగలిగిన ప్రతిభగల వెంకట్రావు ఉద్రేకంతో ఉత్తమమైన నిజాయితీ కృషి జరపాలనుకునే .శివరాం, సమితి ధనాదాయవృద్ధికి కృషి సలిపారు. ప్రభాకరం ప్రక్కనుంచి ప్రోత్సాహకరంగా సలహాలిస్తూ వీలైనంత వరకు ఈశ్వరయ్య పద్ధతిలోనే నడవడం మొదలెట్టాడు.

కార్యదర్శి కోశాధికారులు ధన సంపాదన చేయగా సమితి ప్రాబల్యం వారికి చిక్కకూడదని ఈశ్వరయ్య సమితిలో క్రొత్తసభ్యులను చేర్చుకోవాలని ప్రతిపాదన పెట్టాడు. పదిమంది సభ్యులను చేర్చుకుని సమితిలో తన బలం వ్యక్తులద్వారా సంపాదించుకున్నాడు ఈశ్వరయ్య. అది ఒక ఘనకార్యం కాదని అవసరమైనప్పుడు, పదవులుపోయే ప్రమాదం సంభవించినప్పుడు, అంతకు రెట్టింపు సభ్యులను ఒక్కరోజులో చేర్పించగల శక్తి తమకుందని నిర్లక్ష్యంగా ఊరుకున్నారు వెంకట్రావు, నారయ్య. వీరి మనస్సుల్లో రగులుతున్న విభేదాలు కనిపెడుతున్నాడు శివరాం.

ధనాదాయం కొంత స్వయంకృషివల్ల పెంచిన శివరాం నిర్మాణాత్మక కార్యక్రమాలు జరిపించాలని, ఆ కార్యక్రమాలు ఒక నాటక కళకే సంబంధించి ఉండనక్కరలేదని సూచించేడు. తదితరులు ఈ విషయంపై ఏకగ్రీవఅంగీకారం తెలిపారు. వివిధ తరగతుల మనుష్యుల పరిచయం కావాలనుకున్న శివరాంకు యీ అంగీకారం ఆనందం కలిగించింది. ఒక కవి సమ్మేళనం ఏర్పాటుచెయ్యాలని తన నాంది కార్యక్రమం సమితి స్థాపకుల ముందు పెట్టాడు శివరాం. ఏ కవులను ఆహ్వానించాలనే విషయం ప్రస్తావించి ఉభయనగరాల్లోని కవుల జాబితా తయారుచేశారు. ఎవరు ఎరిగినవారిని వారు ఆహ్వానించి సభ ఒక ఆదివారం జరపాలని నిశ్చయించారు.

రాష్ట్రపతిరోడ్డు ప్రక్కనున్న ఒక దేవాలయంలో గంధర్వనాటక సమితి తరఫున కవిసమ్మేళనం ఏర్పాటైంది. సభకు కవితిలక, కవిశిరోమణి, కవికంఠీరవ బిరుదాంకితులైన శ్రీ గారు అధ్యక్షత వహించేరు. అధ్యక్షుని వేదికపైకి ఆహ్వానిస్తూ, గంధర్వ సమితి ఆశయాలు, జరుపబోయే కార్యక్రమాలు, నాటక సంస్థలలో నిప్రస్తుత... లోపాలు, అవి రూపుమాపడానికి విస్తృతమవుతున్న తమసంస్థ కృషి గురించి అనర్గళంగా ఉద్రేకంగా అయిదు నిమిషాలు ఉపన్యసించాడు శివరాం. ఉపన్యాసముతో సభాకంపన గల ఈశ్వరయ్య, వెంకట్రావు, నారయ్య, శివరాం వాగ్ధోరణిని అభినందించి సమితికి చక్కని ప్రచారకర్త కాగలడని అభిప్రాయపడ్డారు. కార్యదర్శిగా వెంకట్రావు వచ్చే అతిథులను ఆహ్వానించాడు. పంచెలు కట్టుకుని, లాల్చీలు వేలాడించుకుంటూ, కండువాలు వల్లెవాటుగా వేసుకుని, గిరజాలు, క్రాపులు, పిలకలు గల పెద్ద




చిత్రం: ఎస్. పోమ శేఖర శెట్టి, హైదరాబాదు.

లంతా విచ్చేశారు. మాసి చిరిగిన చొక్కాలతో, ఒత్తుజుట్టుతో, సిగరెట్టు కాల్పులతో నల్లబడిన పెదాలతో అభ్యుదయకవులుకూడ అతిథులలో కనిపించారు శివరాంకు. తెలియని వారిని ఈశ్వరయ్య శివరాంకు పరిచయం చేశాడు.

ఆధునిక నవనాగరిక పద్ధతిలో సభనడిపించాలని ప్రతీ కవికి ఫలం, పుష్పం, పత్రం అందజేయాలనే ప్రణాళిక అసలు జరిపాడు శివరాం. చేతులు నిండేలా బత్తాయిపండ్లు, ఊహాగానానికి వీలైన మత్తువాసనల గులాబి గుత్తులు, ఉద్రేక తీవ్రవచనల పఠనానికి అనువుగా వేడికాఫీ ఆహ్వానించబడిన ప్రతి కవికి అందజేయబడ్డాయి. ఆ ఫలపుష్ప పానీయ సందర్శనంతో కవుల ఊహాబలం విజృంభించింది. ఛందస్సు నడకలతో, పిలక ఊపులతో, ప్రబంధ రీతిలోని పంచరత్నాలు, తేలిక మాటలతో, తెల్లని నవ్వులతో తరగలుగా గంతే గేయాలు; గిరజాల ఒంపులలోంచి జారిన మధురమైన గొంతుతో జానపద గేయాలు, చింతనిప్పు కళ్ళతో నల్ల పెదవుల మధ్య నాట్యమాడిన భయంకర, యుద్ధ బీభత్స దృశ్యపూరిత రగడల పరుగిడులు, నూనెకారే దిగాలు మొఖంతో, ఒంగిపోయి కృంగిపోతున్న శరీరంలోంచి బీదరిక రోదనలు, రకరకాల తలపులు, కులుకులు, పలుకులు, నవ్వులు ఆ సభలో వెల్లివిరిశాయి.

పరమహంస చిన్ననాటి పద్యాలు సరదాకు వినిపించాడు. హుస్సేన్ అలీ ప్రేమగానం ఆలపించాడు కృష్ణమూర్తి నాటకాలకై మధ్య మధ్య వ్రాసిన తన గేయాలు వినిపించేడు. తమకు ప్రత్యేక అవకాశమిచ్చినందుకు శివరాంను అభినందించారుముగ్గురూ. వారి పరిచయమైనందుకు సంతోషం వ్యక్తపరిచాడు శివరాం.

సభ దిగ్విజయమన్నాడు ఈశ్వరయ్య.

మర్నాడు వారాపత్రికలో ఐదు పేరాలు అవిరళంగా వ్రాయబడింది—కవి సమ్మేళన సభనుగూర్చి, కార్యకర్తల కృషిని ప్రశంసిస్తూ.

వార్తాపత్రికలో ఉపన్యాస మిచ్చిన శివరాం పేరు పడినందుకు అసూయపడినా, చివరకుఘనకార్యమంతా తమ ఆధ్వర్యంలో జరిగినదేకదా అని సంతోషించారు సమితిలోని ఇతర కార్యకర్తలు.

నెలకొక కార్యక్రమమయినా జరిపించి, సమితిలో జీవకళ ఉట్టిపడేలా చెయ్యాలన్నారు వెంకట్రావు, నారయ్య, సమితిలో ప్రతీరోజు వీలైనంతవరకు నటకులంతా కలుసుకుంటూ నిర్మాణ కార్యక్రమాలు జరుపాలని లేనిచో నగరంలోని, నాటకరంగ వాతావరణం చర్చించుకుని 'నవసమితి' పురోగతికి మన ప్రయత్నాలు మనం చెయ్యడంలో నిమగ్నులం కావాలని, సమితి కార్యాలయానికి ప్రతిరోజు నటకులువచ్చి కాలంగడపడానికి చదరంగం, పేక, కేరమ్సు మొదలయిన చిన్న ఆటవస్తువులు ఏర్పరిస్తే ఆకర్షణగా ఉపకరిస్తుందని ఈశ్వరయ్య ప్రతిపాదించాడు. కార్యవర్గం ఈసూచనలు అంగీకరించింది.

'దోపిడీ'అనే నాటకం పెద్దఎత్తులో ప్రదర్శించాలని గంధర్వ నాటకసమితి తీర్మానించి పత్రికా ప్రకటన చేసింది. అయే ఖర్చు, సంపాదించవలసినసొమ్ము అంచనాలు వేశారు. నాటకంలోని పాత్రలు పంపకంలో కొత్త మొదటఘర్షణ జరిగినా చివరకు ఆమోదం కుదిరింది. నాటకాల రిహార్సల్సు నడిపించేబాధ్యత ఈశ్వరయ్య, ధనసంపాదన బాధ్యత నారయ్య, వెంకట్రావు, రంగస్థల నిర్మాణం, ప్రచారం మొదలైనబాధ్యతలు శివరాంకు అప్పగించబడ్డాయి. తీరిక సమయాలలో తమబాధ్యతలు పరస్పర సహాయంతో నడిపించుకుంటూ రిహార్సల్సు నడిపించసాగారు.

(ఇంకా వుంది)

ఎక్కడ, ఎప్పుడు, ఎలా అనే ప్రశ్నలు వేయకండి. మంచి కథ చెబుతా. కథ అంటే, కల్పనేగా! మరింకేం?

* * *

నిట్టమధ్యాహ్నం. తీవ్రమైన ఎండ. కండ్లు, ముఖం చిట్లించుకొని, చెట్ల ఆకుల సందుల్లోంచి, ఒకసారి ఆకాశంకేసి చూచాడు రావు. ఆ వటవృక్షంక్రింద చతికిలబడి, వాటరుబాటిలు తెరచి, ముఖం ముడుచుకుని, కండ్లు మూసుకొని, కటిక ఉప్పటినీళ్లు రెండుగుక్కలు త్రాగి, నోరు చప్పరిస్తూ, లొట్టలు వేశాడు. ఉప్పునీరు దాహమే గాక ఆకలి చంపుతుంది.

ఇంకా అతనిగుండె దడదడ కొట్టుకుంటోంది. కండ్లుమూస్తే ఆ భయంకర సంఘటన కండ్లముందు నాట్యంచేస్తోంది.

భారతీయసేన వైద్యదళంలో సిపాయి అతను. ఈ విదేశం వచ్చాడు. ఇవ్వాళే అతను పునర్జన్మించాడు. సూర్యోదయంతో పాటు, కిరణాలవాలులో కనిపించకుండా విమానాలు క్రమ్ముకున్నాయి, మేఘాల్లా. సెంట్రీ విజిలు విపరీతంగా వేశాడు. గబగబ పరుగుతున్నారు ట్రెంచెస్‌లో. చాలామంది రాలేకపోయారు. ధనధనమని బాంబులవర్షం. దుయ్యన విమానం నేలదాకా వచ్చి, ఫెడీల్లు మంటూ బాంబు విసరి, ఝుర్రున ఎగిరేది. అంతా అయిదునిముషాలు పట్టలేదు. అంతా సర్వనాశనం.

కొంతసేపైనతరువాత లేచి తడిమి చూచుకున్నాడు. ఎక్కడా దెబ్బతగులలేదు. తలెత్తాడు. ట్రెంచి మూడువంతులు నాశనమయింది. ప్రక్కగా చూచాడు. కమాండింగ్ ఆఫీసర్ కల్నర్ సింగ్ మట్టికరుచుకుని ఉన్నాడు. తట్టాడు. శవం కదులుతుందా? జేబులు వెదికాడు. ఇన్ని గుండ్లు, పిస్తల్, ఇంత డబ్బు దొరకాయి. జేబుల్లో త్రోసివేశాడు. ముందుకు చూచాడు. ఏడంతస్తుల భవనం నేలమట్టమయింది. భగ్గున మండిపోతోంది. చుట్టూ చూచాడు. ఎవరూ లేరు. వాటరుబాటిలు నింపుకున్నాడు పైపు వద్ద. ముఖం కడిగాడు. ముందుకుసాగాడు. కిచెన్ సమీపించాడు. నేలకొరిగింది. ఏమీ లేదక్కడ. ఇంత ఉప్పుదొరికింది, నీళ్ళల్లో కలిపాడు.

ఏమైన తింటే బాగు. ఏమీ లేదాయె. ఏంచేయటం? ఎటుపోవడం? అంతా శత్రు హస్తాల్లోకి పోయింది. ప్రాణాలు దక్కించుకోవాలనుకుంటే పారిపోవడమే.

ఇప్పటిదాకా నడచి యిప్పుడే యీ శిథిల తరుచ్ఛాయ చేరాడు. అలసట, ఆకలి. నిద్దుర పోకొట్టింది. బరువుగా కనురెప్పలు వాలిపోయాయి.

బాగా నిద్రపట్టిందతనికి. ఎవరో తట్టి, పిలిచి లేపారు. ఉలిక్కిపడి లేచాడు. కెప్టెన్ ముఖర్జీ కండ్లముందు కనుపించాడు. ఇంత కడుపుతో, గుండ్రని శరీరంతో, ముడుతలు పడిన ముఖంతో ముసలి ముఖర్జీ ముందు నిలుచుని ఉన్నాడు. ఇద్దరిలో ఏదో ఆనందం. ఈ దుర్గమారణ్యాల్లోంచి, యీ ప్రమాదం నుండి బ్రతికి బయటపడటానికి ఒకరికొకరు.

రావు లేచి శాల్యూట్ చేశాడు.

"ఇంకా శాల్యూటు లేమిటి? బయటపడే మార్గం చూడు మిస్టర్ రావ్..." అన్నాడు చేయిపట్టుకొని.

"ఇంకా ఎవరైనా బ్రతికిఉన్నారో, మనవాళ్ళు..." అన్నాడు రావు.

"ఏమో! భయంకరమైన ఆ బాంబింగ్ అయిన తరువాత ఎంతోసేపు ఆ పిట్ లో నే ఉండిపోయాను. ఆ మంటలు, ఆ బాంబులు— అబ్బ ఎంత భయంకరమైంది మన జీవితం. నేను బ్రతికి ఉన్నానో లేదో నాకే అనుమానమొచ్చింది. బాగా ఆకలవుతోంది. పొంచి ముఖం కడుగలేదు..."

"నేనుకూడా..."

"ఎలామరి?..."

"అదిగో! దాపునే ఓపల్లె కనుపిస్తోంది. ప్రయత్నిస్తాను..."

"ఇలా వెళ్ళకు..."

"ఏం కెప్టెన్?..."

"ఏమైనా జరిగితే? మారువేషం వెయ్యి. ఈ యూనిఫారం తీసివెయ్యి. పిస్టల్ ఉందా?..."

"నీదగ్గర?"

"నాదగ్గరుంది..."

"నాదగరకూడా ఉంది..."

"బొడ్లో పెట్టుకో. నే నెక్కడ ఉండేది?"

"ఆ చెట్టువద్ద కూర్చో..."

"ప్రొద్దు వాలిపోయింది. త్వరగా వచ్చెయ్యి. చీకటిపడితే దారిమరిచి పోవచ్చు..."

"సరే..."

వెళ్ళాడు రావు. అతనికి ఆశ్చర్యమేసింది. సహజగంభీరుడు. అతికఠినుడు అయిన యీ కెప్టెన్ ఎంత దిగజారిపోయాడు. ఎంత అప్యాయతతో మాట్లాడుతున్నాడు.

కెప్టెన్ కూలబడ్డాడు. చీకటికూడా

# విధి విధానం

1

యామునజాల శంకరం





పడింది. రావు రాలేదు. అనుమానం, భయం కలిగాయి.

"ఇంతసేపయిందేం?..."

"బ్రతికి వచ్చాను..."

"ఏం?..."

"ఇదంతా శత్రుహస్తాల్లోకి పోయింది. ఇదివరకే యిక్కడి పెద్దపెద్దల్ని కొనేశారుట వాళ్ళు. మనం అంటే చంపటానికి సిద్ధంగా ఉన్నారు. వాళ్ళు కాకపోయినా, మనవాళ్ళనుకున్నవాళ్ళే, మన్ని అంత మొందించి ఉండేవాళ్ళు."

"అబ్బ! వ్యతిరేకంగా అంత ప్రచారం సాగిందా?..."

"విపరీతంగా. నేను ఒక దుకాణంలో రొట్టెలడిగాను. వాడు పసిగట్టాడు. లోపలకు తీసుకొనిపోయాడు. నేనూ మొండి ధైర్యంతోనే ఉన్నాను. దమును పంటున్నట్లు, బొడ్డువద్ద చేయి ఉంచాను. అతడు ఇద్దర్ని చంపి చావాలనుకున్నాడు. 'మీది హిందూ దేశంకదూ?...' సూటిగా అడిగాడు. 'అవును' అన్నాను. అప్పుడు చెప్పాడిదంతాను.

"మీ కెందుకింత అభిమానం?" అన్నాను. "నిరపరాధుల్ని. నిస్సహాయుల్ని చంపటం ధర్మంకాదు,' అన్నాడు. ఈ దేశపు సరిహద్దులు దాటేంతవరకు జాగ్రత్త...' అన్నాడతను."

చెరో రెండురొట్టెలూ తిన్నారు. దగ్గరే ఉన్న చెరువులో యిన్ని నీళ్ళుతాగి, వాటరు బాటిళ్ళు నింపుకున్నారు. దారిపట్టారు.

అడవిలో దార్లు అల్లిబిల్లిగా ఉంటాయి. తెలిసిన అరణ్యాల్లో దారి పగలే మరచిపోతాం. పైగా రాత్రి. దుర్గమారణ్యం.

దూరంగా క్రీనీడల్లోంచి ఏదో తెల్లటి ఆకారం వస్తోంది. కెప్టెన్ ముఖర్జీ కంగారు పడ్డాడు.

"భయపడకు ముఖర్జీ! పిస్టల్ జాగ్రత్త.."

కాని వణుకుతున్నాడు ముఖర్జీ.

"నువ్వు మామీద హుకుం చెయ్యటానికి తప్ప, యింకెందుకూ పనికిరావు..." రావు చిరాకుపుటి మాట విసిరాడు.

"రావ్!..." అలవాటైన అధికార దర్పం తలెత్తింది.

'అరవకుండా ఆ చెట్టుచాటుకు పద..." చెయ్యిపట్టి లాక్కుపోయాడు. పూర్తిగా అతనిమీద ఆధారపడవలసివచ్చిన ముఖర్జీ వచ్చినట్లు ఊరుకున్నాడు. ఒక మ్రాను ప్రక్కన దాక్కుని చెరోప్రక్కనుండి చూస్తున్నారు. చేతుల్లో పిస్తోళ్ళు సిద్ధంగా ఉన్నాయి.

ఆ ఆకారం కొంతదూరం వచ్చి ఒక చెట్టుక్రింద కూలబడింది. చాలాసేపు గడచింది. ఆ ఆకారం లేవలేదు. నేల కొరిగింది.

ముఖర్జీ పారిపోదామన్నాడు. రావు అలా కాదంటూ చెట్లు చాటుచేసుకుంటూ ముందుకు నడిచాడు. వద్దంటూ రావు చెయ్యి బట్టి లాగాడు ముఖర్జీ... "వదిలేయ్ చెయ్యి...నువ్వు వెళ్ళు..." దూసుకుని పోయాడు. రావుని ప్రేల్చివేద్దామన్నంత కోపం వచ్చింది ముఖర్జీకి. తన అఫీసరు గిరీకి ఆమాత్రం మర్యాద లేకపోవటం చిన్నతనంగా తోచింది.

"హల్లో కెప్టెన్..." దూరంనుండి రావు కేక "రా. రా. ఎవరోకాదు. నర్స్... సుందరి!"

"ఆఁ..." అన్నాడొక్కసారి. తడబడుతూ చేరుకున్నాడు.

సుందరికి ఇరవై సంవత్సరాలుంటాయి. చక్కగా ఉంటుంది. నడక, నడత, ఆ అమ్మాయి అందానికి వన్నె తెచ్చాయి. హంసలాగా నడచిపోతూ ఉంటే, ఆ దొండపండు కేసి, కాకుల్లాంటి సిపాయిలు, నోళ్ళు తెరచుకుని చూస్తూ ఉండేవారు. కొమ్ములు తిరిగినవాళ్ళుకూడా, ఆ నిప్పును ముట్టుకోబోయి చేతులు కాల్చుకున్నారు. కుసుమ సదృశమైన ఆ కోమలహృదయాన్ని, విచ్చిన అరవిందంలాంటి ముఖమండలాన్ని. ఆ సోయగాన్ని,-ఇలా, యీ గుండ్లమాటున, యీ తుపాకులచాటున, పారేసి, పుండ్లు కడుగుతూ, రక్తాన్ని అద్దుతూ, ఎముకలు సరిచేస్తూ, కట్లుకట్టుతూ, - ఆ వెన్నెలలకు ఎందుకు చీకట్లు పులుముతోందో!

"దాహమవుతోంది..." స్వచ్ఛమైన తెలుగులో మాట్లాడింది. మరోదేశంలో మన వాళ్ళిద్దరూ కలుస్తారు.

రావు వాటరుబాటిల్ యిచ్చాడు. త్రాగింది. రెండు రొట్టెలు యిచ్చి "ఇది తిను..." అన్నాడు. సుందరి తింటోంది.

"చేతికేమయింది?..." అడిగాడు.

"దెబ్బ తగిలింది. నేను మట్టిలో కూరుకొనిపోయాను. బాంబుల భయానికి మతిపోయింది. చాలాసేపటికి తెలివివచ్చింది. మట్టిలోంచి బయటపడటానికి విశ్వప్రయత్నం చేశాను. ఈ చేయి నెత్తురు కారుతోంది. కట్టుగట్టాను."





# ★ విధి విధానం ★

"మొత్తానికి బయటపడ్డావు"...

"ఇంకా మీరిక్కడే ఉన్నారేం?"...

"ఏం?"...

"అదిగో బాంబింగ్ జరిగిపోయినచోటు"

"హల్లో ముఖర్జీ! భూమి గుండ్రంగా ఉంది"...అంటూ చెప్పాడు.

"తిరిగిరాబట్టే మనం కలుసుకున్నాం" అన్నాడు రావు.

"ముఖర్జీ...మీతో...ఎలా కలిశాడు?"

"ఏం? అలా అడుగుతున్నావ్?"

"ఏమీ లేదు."

"పదండి" అన్నాడు రావు. "ఇహ మనం రాత్రింబవళ్ళు ప్రయాణం చేయాలి."

"రావ్!"...పిలిచాడు ముఖర్జీ. "ఒక్క ఖబురు చెప్పేదా?"

"ఏమి టది?"...

"ముగ్గురూ ప్రయాణం చేయకూడదు. ఆడవాళ్ళతో అసలు చేయరాదు."

"అయితే"...

"తొందరపడకు. మనం ప్రమాదంలో వున్నాం. పైగా నడచిపోవాలి. ఈవిడను వెంటపెట్టుకోవటం మంచిది కాదు సుమా!"

"నావంట్లో శక్తివుంది" అందుకుంది సుందరి. "నా బరువు మీరేం మోయక్కర లేదు ముఖర్జీ! పరాయి దేశంలో, పరాయి దానిలా చావలేను. భగవంతుడు దార్లోనే" ఆగింది.

"భయపడకు."

"నీకు తెలియదు రావ్! ఇవ్వాళ అతని వెంట వస్తానని మధ్యాహ్నం అతని కాళ్ళు పట్టుకున్నాను...కాని...కాని"...

"ఈవిడను తప్పకుండా మనతో తీసుకు వెళ్ళాలి"...

"రావ్! చాలా బాధపడతాం. ఈవిడ వల్ల ప్రమాదం కోరి తెచ్చుకోలేం?"

"ఫరవా లేదు"...

"నేను వద్దని ఆజ్ఞాపిస్తున్నాను"...

"నీ హోదా ఏనాడో పోయింది. ఇష్టమయితే మాతో రా. సైనికుడు చావుకు భయపడడు. ఒక్క ఆడదాన్ని రక్షించలేని మనం, దేశాల్ని జయిస్తాం! ధిక్కరిస్తున్నాను నీ ఆజ్ఞను..."

"పేల్చిపారేస్తాను"... ఉగ్రుడయ్యాడు ముఖర్జీ.

"నువ్వు చీమను చంపలేవు. అవతల పారేయి. పిస్తోలుకి అవమానం. రా సుందరీ!" పోతూనే వున్నారు.

ఏం చేయటానికీ ముఖర్జీకి తోచలేదు. కోపాన్ని, తన అసమర్థత చాటున దాచుకున్నాడు. తప్పనిసరి. వెంబడించాడు.

దారి, డొంకాలేని ఆ అరణ్యంలో, నక్షత్రాల గుర్తులుపట్టుకుని దిక్కులు వెతుక్కుంటూ సాగారు.

ఎండకు చెట్టు చేరుకుని రొట్టెలుతిని, విశ్రమించారు.

"ఒక్క చుక్క వుంటే, ఎంత బాగుండేది" చప్పరించాడు రావు. నవ్వింది సుందరి... "వస్తే అలసటా, గిలసటా...ఏం లాభం."

"నీళ్లు కూడా అయిపోయాయి" అన్నాడు కెప్టెన్.

"దార్లో నింపుకుందాం" అని తెలుగులో సుందరితో అన్నాడు రావు. "వీడిబొంద. ప్రతిదానికి ఏడ్పిస్తాడు. మళ్ళీ ఆఫీసరు హోదా. ఈ అడవిలో అన్నీ జవానులలా సమకూర్చాలి వీడికి. చచ్చేట్టు ఏడిపిస్తా."

"ఏమిటి ఆఫీసర్ అంటున్నావ్..." ఆఫీసరు అన్న యింగ్లీషు పదం పట్టుకొని అడిగాడు ముఖర్జీ.

"ఏం లేదు. ఆఫీసరు గారికి ఎన్ని కష్టాలొచ్చాయో చూడు అంటున్నాను......" అన్నాడు.

"అనుమానపడకు..." అంది సుందరి.

"వాడేం కేం చేస్తాడు. ఆ బొజ్జ, ఆ శరీరం..."

సుందరి పకపక నవ్వింది...

"లెండి"—అన్నాడు ముఖర్జీ. లేచారు.

పదిమందితో చావు పెండ్లితో సమానం. విధి ప్రేరేపణవల్ల వాళ్ళిలా కలుసుకున్నారు. ముగ్గురూ మూడు కోణాలనుండి వచ్చారు. వారి జన్మస్థలాలు వేరు. వారు పని చేసే స్థలాలుకూడా వేరు. ఇక్కడికి వచ్చికూడా కొద్దికాలమే అయింది. ముభావమైన ముఖ పరిచయాలుమాత్రమే ఉన్నాయి. కాని యిప్పుడు ఇక్కడి కష్టసుఖాల్లో భాగస్వాములు.

ముగ్గురి మనస్తత్వాలు వేరు. ముఖర్జీ గర్వంతో, హోదాకోసం, గౌరవంకోసం ప్రాకులాడుతాడు, సంఘంనుంచి, సంస్కారంనుంచి విసిరి వేయబడ్డట్లు ఉంటాడు.

నిర్వికార నిరంజనుడిలా ఉంటాడు రావు. దేన్నీ అతడు యిదిగా తీసుకోడు. రాగద్వేషాలకు, మమకార వికారాలకు అతీతుడుగా కనుపిస్తాడు. నిర్లక్ష్యం, తెగింపు, సాహసం అతనిలో కనుపిస్తాయి. బుద్ధికి తోచింది చేస్తాడు. డ్యూటీలో కూడా అంతే. చేయమన్నారు కొబట్టి, చేయాలి కాబట్టి చేసేవాడు. మరతుపాకిలాంటి మనిషి. మీటనొక్కితే మారణహోమమే. లేదా మూలఉంటాడు — తుపాకి అంతేగదా! చమత్కారంగా మాట్లాడుతాడు. అందర్నీ నవ్వించి, అందరికీ కావలసినవాడులా ఉంటాడు. కాని అందరికీ దూరంగా ఉంటాడు.

పెడసరంగా గడసరిగా మాట్లాడుతుంది సుందరి. డ్యూటీలో ప్రవేశిస్తే మిగతా నర్సులు, సిస్టర్సు, డాక్టర్లు భయపడేవారు. కమాండింగ్ ఆఫీసరుకుకూడా అదురే. తన్ను విధి నిర్వహణలోని నిపుణత్వంతో, ఇతరుల ప్రమత్తతను కొరడాతో చురుక్కుమన్నట్లనిపించేది.

ముఖర్జీ మహాశయుని మెదడు అనుమానంతో నిండింది. తనకురాని భాషలో తనను వాళ్లు అపహాస్యం చేస్తున్నట్లు గ్రహించుకున్నాడు. ఇంతకూ కారణం సుందరి. ఆమెను మింగివేద్దామన్నంత కోపం ఉంది అతనిలో. అసలే ఆడవాళ్ళతో ప్రయాణం కూడదనుకుంటున్నాడు.

గమ్మత్తుగా మాట్లాడుతూ, నవ్వించుతూ నడుస్తున్న రావుకు, అతనితో భాగంపంచుకుంటున్న సుందరికి నడచిన బడలే లేదు. సన్నటి దారికుండా. కొంచెం వాలుకొని నడుస్తూంటే, రావు నవ్వించటంవల్ల, సుందరి నవ్వుతూ రాయిమీద కాలుమోపి పట్టుతప్పి వెనకున్న ముఖర్జీమీద పడ్డది

"ఊఁ..." కోపంతో ముందుకు నెట్టాడు ముఖర్జీ.

"డేంజర్ ...డేంజర్ ......" అన్నాడు రావు.

"ఎవరికి?..."

"నీక్కాదులే. నువు పడ్డా బంతిలా లేస్తావు...కాని" విరగబడి నవ్వింది సుందరి.

"నాకు ముందే తెలుసు—నువు నడవ లేవని..." అనుకున్నాడు ముఖర్జీ.

"ముసలితాతవు, నువ్వన్నావు—కాస్త ఎత్తుకుంటావని..."

"చాలే వేళాకోళం" ముఖర్జీని ముసలివాడంటే మహాకోపం. తన పడుచుతనం నిరూపించటానికి ఎన్నో నిదర్శనాలు చూపుతానంటాడు, ఆ యాభయ్యోపడిలో పడి చింత చచ్చినా పులుపుచావని యువకుడు.

"ఈ ముఖర్జీకి యింత ముసలితనంలో కూడా యీ ఉద్యోగం ఎందుకో!..." అన్నది సుందరి రావుతో.

"పెద్ద జీతమాయె."

"ఎందుకిదంతా?"

"అని అడక్కు."

"కానీ ఖర్చు పెట్టడు. పిసినారి..."

"మాట కట్టేవాళ్ళు ఖర్చు పెడతారా"

"గట్టి మనిషి..."

"కాకపోతే ఇంతమంది చచ్చారు. వీడు చచ్చాడా?"

"ఏమిటి మీరు మాట్లాడుకుంటున్నది?" ...అతి ఆప్యాయంగా అడిగాడు, అసలు విషయం తెలుసుకుందామని ముఖర్జీ.

"నీ గురించి కాదు..." ఒక్కమాటలో చెప్పాడు రావు. దానర్థం నీ గురించేనని తిప్పి చెప్పటం కదూ? తెలివున్నవాడు

యిటే గ్రహిస్తాడు.

నవ్వు ఆగి "అబ్బ!...అబ్బ" అంటూ పొట్ట చేత్తో పట్టుకుంది సుందరి.

"అసలు విషయం నేను చెబుతా. నన్ను పెంచుకోరాదు తాతా! ఈ డబ్బంతా ఏం చేస్తావు?..." అంది.

"[illegible]న్నా! ఛస్. ఆడదాన్ని పెంచుకోవటం!" అన్నాడతను.

ఇలా ఎంతదూరం నడవాలో, ఎక్కడికో, గమ్యస్థాన మెక్కడో ఏ ఒక్కరికీ తెలియదు. అడవులు పట్టుకుని, కొండల నెక్కిదిగుతూ సాగిపోతున్నారు. నిన్నల్లా అయింది. ఇవ్వాళ రెండోరోజు. ఆకలి కాల్చేస్తోంది. సాయంకాలం కావచ్చింది. నిన్న దాహమైతే యిన్ని నీళ్లయినా ఉన్నాయి. ఇవ్వాళ పచ్చి మంచినీళ్లయినా మింగలేదు. ఎక్కడా నీరు కనుపించదాయె. ఏదైనా పైట భాగోతపు వేషం వేసి తిండి సంపాదించుకుందామన్నా, చూపు మేరలో ఊరు కానరావటంలేదు.

"రావ్!..." అంది సుందరి.

దిగులుపడ్డాడు ఆ పిలుపుతో రావు. అంత నీరసంగా, క్షీణంగా, విపరీతధ్వని వెలువడింది సుందరిగొంతు నుంచి.

"దా...హం..." అంది. తప్పటడుగులతో నడుస్తూనే ఉంది. ముంగురులన్నీ చెల్లా చెదరుగా ముఖం నిండా పడుతున్నాయి. ముఖం నల్లబడింది. తోటకూర కాడలా వాడిపోయింది. బలవంతాన నాలుకతో పెదిమలు తడుపుతోంది. తూలుతోంది. ఆగాడు రావు. చూచాడు. కాని ఏం చేయటం? ఎలా ఆమెను రక్షించటం.? సుందరి కూలబడింది.

"ఆమె యిక నడవలేదు...'—అన్నాడు ముఖర్జీ.

"అవును...మీరు...వెళ్లండి... నేను... నేను..." మాట రావటంలేదు. గిర్రున నీళ్లు తిరిగాయి ఆమె కండ్లలో. అభిమానం దెబ్బ తినటంవల్ల, ప్రాణభయంవల్ల ఆఖరుదాకా నడువగలిగింది. ఇహ ఆమె ఒక్క అడుగు వేయలేదు. అరణ్యం, ఆ కొండలు, గుట్టలు, చెట్లు—రావు, ముఖర్జీ అంతా ఆమె కండ్ల ముందు గిర్రున తిరుగుతున్నాయి. ఏం జరిగింది? ఎందుకిలా తిరుగుతున్నారు? ఓహ్! గొంతు నెవరో పిసుకుతున్నారు. బలవంతంగా తన ప్రాణాలు గుంజుకుంటున్నారు? ముఖర్జీ...ముఖర్జీ...ఇదేంపని. ఎవరా వ్యక్తి రావుకదూ! సమయానికడ్డు పడ్డాడు. తన్ను పిలుస్తున్నాడా! తనంటే ఎంత ప్రేమ అతనికి. ఏమిటీ అంటున్నాడు? సుఖమయం చేసుకోవలసిన యీ మధుయామవజీవితాన్ని, ఎందుకిలా యీ కర్కశ, కఠోరనియమాల మధ్య బిగించి, బంధించి, దుఃఖభాజనం చేసుకుంటున్నదనా? పారిపోకండి. అయ్యో! వదిలేసిపోతారా! గొంతు గొంతు...దాహం....

"స్మృతితప్పింది. ఇప్పుడేం చేయటం?" అన్నాడు రావు.

"నేను మొదటే చెప్పాను ముగ్గురం ప్రయాణం చేయరాదని, అందులో ఆడవాళ్ళతో అసలు వద్దని.

తీవ్రంగా చూచాడు ముఖర్జీని. తలవంచి సుందరి ముఖంలోకి చూచాడు. మతి తప్పిన ఆమె ముఖం ఏమో చేయిబోతుంది. రావ్! నువుకూడా నన్ను వదిలి వెళ్ళతావా? ఇద్దరం తెలుగువాళ్ళంకదూ! ఇంతేనా! ఇక్కడే యీ అడవిలో కాకులు గ్రద్దలూ నన్ను పీక్కుతినవలసిందేనా?...'

"ఈవిడను రక్షించాలి." నిశ్చితార్థంతో అన్నాడు.

"ఎలా రక్షిద్దామని?"

"అందుకని."

"వెళ్ళిపోదాం. మన ప్రాణాలైనా—"

"ఎం పోతే..."

"రావ్!..."

"నమ్మకమేమిటి ముఖర్జీ మనంమాత్రం బ్రతికి బయట పడతామని?"

"ఆమె ఎలాగైనా చనిపోయేది!..."

"షటప్..." ఆమాట అతను వినలేదు.

"రావ్!..."

కొంతసేపు నిశ్శబ్దంగా గడచిపోయింది. ఆమె బాధ అతను చూడలేకుండా ఉన్నాడు. సాయంచేయలేకుండా ఉన్నాడు. ఏమిటీ చేయటం?

పక్షుల కలకలా రావం. ఆకాశం అరుణ రాగరంజితమయింది. సూర్యుడుతల్లి వడిలోకి చేరుకుంటున్నాడు. అతని కండ్లల్లో ఏదో ఆశారేఖ మెరిసింది:—" కెప్టెన్:..."లేచి నిలుచునిపిలచాడు." ఈ దగ్గర్లో ఎక్కడో ఒక పల్లె ఉండి ఉంటుందని మనస్సు చెబుతోంది. ఊరు లేనిచోట కాకులుండవు. దూరంనుండి లీలగా కాకుల కలకలారావం వినవస్తోంది. ఈమె అంతిమ ప్రయాణం ప్రశాంతంగా సాగాలి. నేను తిరిగి వచ్చే వరకు ఆవిడ జీవించి ఉంటే అదామె అదృష్టం. లేదా?...సరే. జాగ్రత్తగా ఉండండి. బహుశా త్వరలోనే తిరిగి వస్తాను. కనీసం నాకోసం అర్ధరాత్రివరకైనా చూడండి. అంతవరకు ఉండనసలు. రాకపోతినా—శత్రు హస్తాల్లో చిక్కాననో, ఏదో ప్రమాదానికి లోనైయుంటాననో గ్రహించి, మీరు వెళ్ళిపొండి." అంతే, చరచర వెళ్ళిపోయాడు.

చీకటి బాగా అలుముకుంది. రావు రాలేదు. సుందరి అతలాకుతలమవుతున్నది. బహుశా ఆమెకు మూర్ఛరోగము ఉండవచ్చునుకున్నాడు ముఖర్జీ. భయంకరనిశీధి. చుట్టూ కాటు చీకటి. క్షణం యుగంగా గడచిపోతోంది. విసుగెత్తిపోతున్నాడు ముఖర్జీ. అందులో ఆడపురుగుకు కాపలాకాయటం అతనిలాంటి వాడు చేయవలసింది కాదు.

రావు రాకడలేదు. ముఖర్జీ మహాశయుని మెదడు బహుముఖాలుగా నడిచింది. సుందరి బ్రతకటం కష్టం—స్పష్టం.

ఇంచుమించు రెండు రోజులనుండి ఆహారంలేదు. ఈ పరిస్థితులలో ఆవిడ ఒకవేళ లేచినా, నడవటం అసంభవం. ఇక్కడే మజిలీ వేసే ఎలాంటి ప్రమాదాలకు గురికావలసి వస్తుందో! పైగా రావు వచ్చాడా-ఆమెను వదలడు. పైగా మొండిపట్టు. అతనికి చెప్పి తప్పించటం అసంభవం. అతన్ని మధ్య పెట్టాలి. అంతే! అతని తేలిగా వెళ్లింది. ఇలాగే ఎగురువెళుదాం. దారిలో కలుస్తాడు. అడుగుతాడు, చెప్పివేద్దాం, సుందరి స్వర్గస్థురాలయిందని, ఆవిడను వెతికి లాభం లేదు,

# ★ విధి విధానం ★

వెళ్ళిపోవటం మంచిదని. కాసేపు ఏదయినా అంటాడు. రైటో! కదిలాడు.

ఈ భయంకర నిశ్శబ్దనిశీథిలో అనాథ, నిరాశ్రయ, స్మృతి విహీనను నక్కలకు కుక్కలకు ఎరచేసి, వీరాధివీరుడు నడక సాగించాడు.

గాఢాంధకారంలో దారి, డొంకా కనిపించటం లేదు. వెన్నెల వున్నట్లు చెట్ల ఆకుల సందుల్లోంచి సగంముఖం వెలుపు చేసుకున్న చంద్రుడు కనుపిస్తున్నాడు. ఎటు పోతునాడో, ఎటుపోవాలో అతని అర్థం కావటంలేదు.

ఎటూ పోలేకపోయాడతను. వెనకా ముందూ ఏ దారి తెలియటంలేదు. భయంతో వణికిపోయాడు. తనకు ప్రాయశ్చిత్తం యీ విధంగా జరుగుతున్నదా? కీడు చేయాలనుకున్నవారికి మేలెట్లు కలుగుతుంది? ఉన్న చోటనే తొంగుండ లేడు? ప్రాణంమీద అందరికీ యింత తీపి ఉండదా? అయ్యో! భగవంతుడా! తనేం చేయబోయి, యేం చేశాడు.

ఎక్కడినుంచో విజిల్ వినిపించింది. ఇదెక్కడిది? అదిగో మళ్ళీ. ఎవరైయుంటారు? రావువద్ద కూడా విజిలుంది కదూ! ఇహ ఏమైనా గాని, అతనెవరైనా గాని, తనూ విజిల్ వేశాడు...విజిలుమీద విజిలు. ఒకరికొకరు దగ్గరయ్యారు.

"హల్లో కెప్టెన్...!"

"హల్లో."

"సుందరెక్కడా?..."

"సారీ మిస్టర్ రావ్!"

"ఏమయింది?"

"నువ్వు వెళ్ళిపోయిన తరువాత ఓ అర గంట కామె—"

"ఏం జరిగింది?" ఆత్రుతతో అడిగాడు రావు.

"చనిపోయింది."

"ఆ..." కూలబడ్డాడు కటిక చీకట్లో.

"ఆమె వెళ్ళిపోయింది. నేనామెను రక్షించలేకపోయాను." డగ్గుత్తికతో అన్నాడు. క్షణమాగి "ఎక్కడా ఆమె?" అన్నాడు రావు.

"ఆమె ఎక్కడుంటే యిప్పుడేం ప్రయోజనం. ఆ మృతకళేబరాన్ని వదిలేసి, నిన్ను వెతుక్కుంటూ బయలుదేరాను."

క్షణం నిర్విణ్ణుడయ్యాడతను. "ఆమెను...ఆమెను...వదలి వచ్చావా? ఆవిడను ఎందుకు వదలి వచ్చావు కెప్టెన్! నువు తప్పు చేశావు......చాలా తప్పు చేశావు. ఇప్పుడెక్కడా—ఆమె?..."

"ఎక్కడని చెప్పను! దారీ తెన్నూ లేని యీ అడవిలో ఎక్కడని వెతికటం. మమతలకు, మమకారాలకు యిది సమయం కాదు రావ్!"

"మంచిది ముఖర్జీ! ఆవిడ నలా వదలి రాలేను. ఆవిడ శరీరం ఘాతుక మృగాలవల్ల కలుషితం కారాదు. ఆవిడను సమాధి చేయాలి."

"వద్దు రావ్! తొందరపడకు..."

"వదిలేయ్ చేతులు. నిన్నెందుకు చంపలేకపోతున్నానో తెలుసా?......" నడక సాగించాడు.

"రావ్!..." అదిరిపడ్డాడు.

రావు చరచరా నడుస్తున్నాడు. ముఖర్జీ అనుసరించాడు. చాలాసేపు వెతికాడు. ఎక్కడా కనుపించలేదు. ఆవిడను ఉంచిన చెట్టు కూడా కనిపించటంలేదు. నిరాశ, కోపం కలిగాయి. వెతగ్గా, వెతగ్గా కొంచెం దూరంగా ఓ తెల్లటి వస్తువు పడిఉండటం కనుపించింది. సమీపించారు. సుందరి.

దగ్గరగా కూలబడ్డాడు. "నువ్విట్లా మోసం చేస్తావనుకోలేదు సుందరీ! నిన్ను కాపాడలేకపోయాను. అసమర్థుణ్ణి నన్ను మన్నించవూ?..." ఏవో పలవరించాడు. అశ్రువులు రాని ఆమె చెక్కిళ్ళమీద పడ్డాయి. నుదుటిమీద చెయి వేశాడు. కొంచెం వెచ్చగా ఉంది. కడుపుమీద చెయివేశాడు. కొద్దిగా శ్వాస ఆడుతోంది. వాటరుబాటిలు తీశాడు. తన వేళ్ళతో నీళ్ళ చుక్కల్ని ఆమె గొంతు పెగిల్చి ఒకటొకటిగా వదిలాడు. చిన్న గుడ్డపేలిక తడిపి ముఖంమీద వేశాడు. ముఖంమీద బిందువులు నిలకరించాడు. మళ్ళీ ఇన్ని చుక్కలు ఆమె గొంతులో వదిలాడు. మెల్లగా గొంతు, ఛాతి నిమిరాడు. టేకుఆకు కోసి మెల్లగా విసిరాడు. మళ్ళీ కాసిని నీళ్ళు వదిలాడు. ఆవిడలో చలనం లేదు. శ్వాస కొంచెం అందుతుంది. రెండు గుటకలు పడ్డాయి. అతని ముఖం ఆనందంతో ఆడింది. అతని కష్టం ఫలించింది. అదే అతనికి కావాలి.

దూరంగా కూర్చునిఉన్నాడు ముఖర్జీ మహాశయుడు. తీవ్రంగా ఆ రాతివిగ్రహాన్ని ఒకసారి చూశాడు. ముఖర్జీ ముఖం ఆ చీకటిలో మలినమయిఉండటంవల్ల ఏమీ కనిపించటం లేదు.

శ్వాస కొంచెం బాగా ఉంది. ఒళ్ళు వెచ్చబడింది. కొద్ది చలనం ఉన్నట్టుంది. మళ్ళీ కొద్దిగా నీరు పోశాడు.

తెల్లవారబోతోంది. ఇంతవరకు ముఖర్జీ, రావులు ఒకరినొకరు పలుకరించుకోలేదు.

"ముఖర్జీ..." ఇంత మామూలుగా పిలవటం యిదే మొదటిసారి.

"ఆఁ..."

"నీకు యీవిడంటే యింత కోపం ఎందుకు?"...అతను మామూలుగా అడిగినా, అవి ములుకుల్లా నాటాయి ముఖర్జీకి.

"నాకేం కోపం?"...తత్తరపడ్డాడు.

క్షణమయిన తర్వాత రావన్నాడు: "ఒక్క దేశపు వారం. విదేశాల్లో ఉన్నాం. ఆపదల్లో పడ్డాం. ప్రాణాలరచేతిలో పెట్టుకొని తప్పించుకొని పారిపోతున్నాం. దారి తెన్నూ లేని యీ గమనం ఎంతవరకో మనకే తెలియదు. గమ్యం చేరుతామో, చేరమో కూడాను. ముందెవరో, వెనుకెవరో చెప్పలేం! ఇప్పుడు కూడా హోదాలు, ఈర్ష్యలు, అసూయలు, కోపాలు, తాపాలు..."

కొంతసేపు మౌనంగా గడచిపోయింది: "ముఖర్జీ! నేను నావారు అని చెప్పుకునేందుకు ఒక్క చెల్లెలుండేది. అయిదు సంవత్సరాలక్రితం ఒక నిశిరాత్రి, గుడ్డిదీపపు వెలుతురులో, నావడిలో పడుకుని, దీనంగా, బాధగా, దిగులుగా నన్ను చూస్తూ, మౌనంగా, నాకేదో చెబుతూ, నా చేతుల్లో... నా కండ్లల్లోకి చూస్తూ... నా చెల్లెలు చనిపోయింది." అతని గొంతు బిగుసుకుంది. క్షణం మాట పెగల్లేదు.

భుజంమీది సంచి తీశాడు రావు. "ముఖర్జీ! దగ్గరలోనే ఒక గ్రామముంది. వెళ్ళాను. వాడి కొట్టుమీద అయిదేరూపాయిల రొట్టెలున్నాయి. తెచ్చాను. రెండు రోజులు గడుపవచ్చు మనం. ఇదిగో! ఈ రెండు రొట్టెలూ తిను..."ఇచ్చాడు. తనూ ఒకటే రెండు తిన్నాడు. కాసిని, కాసిని నీళ్ళు త్రాగారు.

రావు లేచాడు. సుకుమార సుందరమైన ఆ శరీరం లతను తన భుజానికి పెనవేసుకొని నిలుచున్నాడు. "పదముఖర్జీ! ఈ ఎత్తైన విగ్రహం, యీ బలిసిన శరీరం, యీ విశాలమైన వక్షస్థలం, యిలా సద్వినియోగమవుతుందని ఏనాడూ అనుకోలేదు." – ఆమెను అదుముకున్నాడు కండ్లు మూసుకుంటూ. "ఈమెలో కదలిక ఏర్పడింది. పూర్తిగా స్పృహరాలేదు. అంతవరకు ఆగటంమంచిది కాదు. సరిహద్దు దగ్గరలో ఉందట. బహుశా రెండుమూడు రోజుల్లో చేరిపోతాం. ఆ తిరువాత ఆనందంలో మన కష్టాలన్నీ మరచిపోతాం..."

నడక సాగించారు. ముఖర్జీకి మతి నిజంగా పోయింది. నిన్నటనుంచి తిండి లేదు. ఇప్పుడు కదా రెండు రొట్టెలు తింది. నీరసం, నిస్సత్తువ క్రుంగదిస్తున్నాయి. కదుములు కట్టిన కాళ్ళు అడుగుకు ఎదురు తిరుగుతున్నాయి. అయినా అతను విధినిర్వహణను వెనుకంజ వేయటంలేదు. అనుకున్న పని, చేయాలనుకున్న పని, మనస్సుకువచ్చిన దాన్ని చేయటానికి ఎంత ధైర్యం, సాహసం కావాలి. అతనిలో ఏ భావనా లేదు. చెడు తలంపుగాని, మంచి తలంపుగాని, ఏదీ లేదతనిలో. (మిగతా వచ్చేవారం)



# నక్షత్ర ఫలితాలు

[ 23-9-59 మొదలు 29-9-59 వరకు ]

## గ్రహ స్థితి.

| | | | |
|---|---|---|---|
| శ | | | |
| | వృషభ, మిథున, కర్కాటక సింహ ములలో చంద్రుడు. | | |
| | | | కు |
| శ | గు | | రబు శుర |

### * [అశ్విని చూ, చే, చో, లా] *

ఈ వారము మీకు కార్య భారము ఎక్కువ. వింతమాటలు వినుట పరాక్రమము గల ఘనత, ప్రయాణము ధన లాభము వుండును. అకాలభోజనమువల్ల అనారోగ్యము కనబడెగాన జాగ్రత్తపడుట మంచిది. ఉద్యోగస్తులకు స్వల్పఅనుకూలత విద్యార్థులకు చదువు బాగాసాగదు. రాజకీయవాదులకు అలజడితోపాటు అనుకూలత. 26, 27 అనారోగ్యము.

### * భరణి [లీ, లూ, లే, లో] *

ఈ వారము మీకు యత్న కార్యములకు ఆలస్యము. వర్తకులకు లాభము తక్కువ. ఆత్మీయుల ఆరోగ్యము చెడుటచే చికాకు గలిగిస్తుంది. ఉద్యోగస్తులకు వనప్రాంతములకు బదిలీఅయే సూచనలున్నవి. రహస్యములను కనిపెట్టుటకు నియోగింపబడుతారు. వారమంతా చికాకుగావున్నా, వారాంతమందు అజ్ఞాతమిత్రుని సహాయమువల్ల కార్యసిద్ధి కలుగుతుంది.

### * కృత్తిక [అ, ఈ, ఊ, ఏ] *

ఈ వారము మీకు ధనాభావము ఎక్కువ ఎవరి సహాయమువల్ల కార్యలాభము పొందుదామనుకున్నారో వారివల్లనే ఆటంకములు కలుగుతాయి. అయినా ఈశ్వరానుగ్రహమువల్ల క్రమేణా కార్యానుకూలత అవుతుంది. ఇంట్లో వారి ఆరోగ్యము చెడుటచే ఆందోళన ఉద్యోగస్తులకు ఒత్తిడి. వర్తకులకు నిరాశ. విద్యార్థులకు మంచిరోజులు కావు.

వారమంతా చికాకుగావున్నా సజ్జన సాంగత్యము పుణ్యక్షేత్ర సంచారము దేవతా దర్శనము వింతలను చూచుట నష్టద్రవ్యలాభము కలుగును.

### * రోహిణి [ఓ, వా, వీ, వూ] *

ఈ వారము మీకు అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. యత్న కార్యములు శ్రమాధిక్యముతో ఫలిస్తాయి. కోర్టుదావాలు అనుకూలిస్తాయి. పరోపకారము చేయబోయి సాగక నిందలు పొందుతారు. భార్యకు అనారోగ్యము కలుగుతుంది. ఇచ్చిపుచ్చుకునే పట్ల వివాదములు. ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడివున్నా తోటివారి సహకారము వుంటుంది. వారమంతా వర్తకులకు నిరాశగా వున్నా వారాంతమందు స్వల్పముగా అనుకూలత కలుగుతుంది.

### * మృగశిర [వే, వో, కా, కీ] *

ఈ వారము మీకు ఎన్ని అవాంతరములు వచ్చినా పట్టుదలతో ప్రయత్నించి కార్య

## బి. నరసింగరావు

లాభము పొందుతారు. ఆశించిన డబ్బు సమయానికి అందక అప్పుచేస్తారు. సోదర సహాయము కలుగుతుంది. ఆత్మీయులవల్ల నిందలు. దెబ్బలుతగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు, భూస్వాములకు, ఇంజనీరింగుశాఖ ఉద్యోగులకు, లోహపుసామానుల వ్యాపారస్తులకు కష్టముతో కూడిన యోగము. 26, 27 ప్రమాద సూచన.

### * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఈ వారము మీకు యోగప్రదము. బంధువుల సహాయముతోనూ, అధికారుల ఆదరణతోనూ ఆటంకములను గడిచి ఫలం పొందుతారు. ఆదాయము అభివృద్ధి అవుతుంది. వైద్య జ్యోతిషశాస్త్ర ప్రసంగాలు చేస్తారు. ఈశాన్య దిక్కునుండి క్షేమవార్త తెలుస్తుంది. గణితశాస్త్రజ్ఞులకు, కవులకు, శిల్పులకు, నటీనటులకు యోగకాలము. 23, 24 తేదీలలో ధనలాభము, కార్యసిద్ధి.

### పునర్వసు [కే, కో, హా, హీ] *

ఈ వారము మీకు యోగదాయకముగా వుంటుంది ఆశించిన డబ్బు చేతికివస్తుంది. నూతన కార్యములు ప్రారంభిస్తారు. కోర్టు దావాలలో అనుకూలత వుంటుంది. పండిత గోష్ఠి జరిపి నూతన విషయాలు తెలుసుకుంటారు. వారమంతా శుభయోగముతో కూడి వుంటుంది. 23, 24, 25 తేదీలలో ధన లాభము కార్యసిద్ధి, పుత్రుల అభివృద్ధి, న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుగా వుంటుంది.

### * పుష్యమి [హూ, హే, హో, డా] *

ఈ వారము వినోదములలో పాల్గొనుట, దధిక్షీర మధుర పదార్థయుక్త సుభోజనము రజతపాత్రలలో భుజించుట, నీటిమీద ప్రయాణము చేయుట, తలచిన కార్యములలో జయము, తెల్లటి వస్తువులు కొనుట మొదలగు యోగములు కలుగును. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, బియ్యము, వెండి, ద్రవ పదార్థ జనితవస్తువులు క్రయవిక్రయములలో వర్తకులకు లాభము. కవులకు గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 26, 27 అధికఖర్చులు, ఆందోళన.

### ఆశ్లేష [డీ, డూ, డే, డో]

ఈ వారము ధనధాన్యవృద్ధి, యత్న కార్య లాభము, వివాహాది శుభకార్యములగురించి ఆలోచనలు, ఇష్టవస్తులాభము, పరోపకారం వల్ల కీర్తివంటి రాజయోగములు కలుగును. విలువగల వస్తువుల క్రయవిక్రయములలో

### ఈ వారము ధరలు:

నూలు, వస్త్రములు:- నిలకడగావుండును.
నూనెదినుసులు:- మందగా వుండును.
ఆహారధాన్యములు:- సమస్థాయినుండును.
బెల్లము, పంచదార, చింతపండు:- మార్పు లేదు.
పప్పుదినుసులు :- నిలకడగా వుండును.
వెండి, బంగారము:- స్వల్పముగా తగ్గును.
మత్స్యవృషిగా వుండును.

జన్మనక్షత్రమును బట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారివారి పేర్ల ననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకోనునది. కృష్ణ అను పేరునకు మృగశిరానక్షత్రమును, హృష్ణ అను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలుడను పేరునకు హస్తయును, భీముడు, భరతుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకోనునది.



# నక్షత్రఫలితాలు



వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు కళాకారులకు నటీనటులకు యోగకాలము. ఆప్తులతో విందు వినోదము, విద్యార్థులకు మేలుకాలము.

### * మఖ [మా, మీ, మూ, మే.]

ఈవారము మీకు కార్యభారముఎక్కువ. రాబడి తక్కువ. గృహావసరములు తీరనందున కలతలు. ఆరోగ్యము చెడుచున్నట్లు సూచనలు కనబడగానే ఔషధచికిత్స పొందడమే కాకుండా గ్రహరాజయిన రవికి శాంతిచేయించుట మేలు. ఉద్యోగస్తులకు కొత్తసమస్యలు, వర్తకులకు ఆందోళన. రాజకీయవాదులకు స్వల్ప అనుకూలత. 24, 25 పిత్రువర్గ సహాయము, ధనలాభము. 27 అనారోగ్యము.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### మో, టా, టీ, టూ

ఈవారము మీకు మొదట్లో నిరాశగా వున్నా అజ్ఞాతమిత్రసహాయమువల్ల కార్యలాభము పొందుతారు ధనలోపమువల్ల ఆందోళన. ఉద్యోగస్తులకు ఏమంతబాగుండదు. విద్యార్థులకు నిద్రకమువల్ల చదువు సాగదు. వారములో అవయోగములున్నా మిత్రసహాయము, కార్యలాభము, విదేశీయుల పరిచయము, విచిత్రవస్తు సంపాదన వంటి శుభయోగములుకూడా వుంటవి.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### (టే, టో, పా, పీ)

ఈ వారము మీరు సహాయము పొందవలచుకున్న వ్యక్తిమూలముగా కార్యహాని అవుతుంది. ధనాభావము ఎక్కువగా వుంటుంది. ఇంట్లోవారి ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. ఆధ్యాత్మిక చింత దైవముపై భారము వేసి కార్యలాభము పొందుతారు. ఉద్యోగస్తులకు ఒత్తిడి. వ్యాపారస్తులకు నిరాశ. విద్యార్థులకు మంచికాలముకాదు. పుణ్యక్షేత్ర సంచారము, దేవతాదర్శనము, విచిత్రములను చూచుట, నష్టద్రవ్యలాభము కలుగును. వారమంతా అవయోగ శుభయోగ మిశ్రమముగా వుంటుంది.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము మీకు అనుకూలతకన్న ప్రతికూలత యెక్కువ. యత్న కార్యములు ఎక్కువశ్రమతో ఫలిస్తాయి. ఇతరులకు సహాయము చేయుటకు పూనుకొని సాగక నిందలు పొందుతారు. ఇచ్చిపుచ్చుకో వడములో వివాదములు వస్తవి. కోర్టువ్యవహారాలు అనుకూలిస్తవి. ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణ, తోటివారి సహకారము వర్తకులకు వారమంతా నిరాశ, వారాంతమున మేలు. విద్యార్థులకు చదువు బాగా సాగదు. భార్యకు అనారోగ్యము కలుగుటచే ఆందోళన.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈవారము ఎన్ని ఆటంకములు వచ్చినా పట్టుదలతో ప్రయత్నించి కార్యసాధన పొందుతారు. ఆశించిన డబ్బు సమయానికి అందక అప్పుచేస్తారు. దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. రసాయనిక శాస్త్రజ్ఞులకు, లోహ ఖనిజ వ్యాపారస్తులకు కష్టముతో కూడిన యోగము గనుల యజమానులకు, యంత్రములు నడుపు నిపుణులకు, ఇంజనీరింగు శాఖ ఉద్యోగులకు మేలుకాలం.

### * స్వాతి [రూ, రే, రో, తా]*

ఈవారము మీకు యోగకాలము. అధికారుల సహాయముతోనూ, బంధు సహాయముతోనూ వచ్చిన ఆటంకములను గడిచి కార్యలాభము పొందుతారు. ఆదాయము వృద్ధి అవుతుంది. శాస్త్రప్రసంగాలలో పాల్గొంటారు. బంధువుల క్షేమవార్త తెలిసి సంతోషము పొందుతారు. విద్యార్థులకు ఉత్సాహముగా చదువు సాగుతుంది. గణితశాస్త్రజ్ఞులకు, కవులకు, శిల్పులకు, నటీనటులకు మేలుకాలము.

### * విశాఖ [తీ, తూ, తే, తో] *

ఈ వారము మీకుమంచి యోగము. అనుకున్న డబ్బు చేతికి వస్తుంది. ఇబ్బందులు తీరుతాయి. దావాలలో గెలుపు పొందుతారు. పిల్లల అభివృద్ధికి చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. గ్రంథపఠనవల్ల విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుకాలము. ఉద్యోగస్తుల హోదా పెరుగుతుంది. విద్యార్థులు శ్రద్ధగా చదువుకుంటారు.

### * అనూరాధ [నా, నీ, నూ, నే] *

ఈ వారము మీకు యోగదాయకము. ధనయోగము కలుగుతుంది. సంగీత సభలు కవితాగోష్ఠివంటి వినోదములలో బంధువులతో కలిసి పాల్గొని మృష్టాన్నభోజనము వెండి పాత్రలలో చేస్తారు. శుభకార్యముల గురించి ఆలోచనలు చేస్తారు. నీటిమీద ప్రయాణము చేయవలసి వస్తుంది. నూలు, బట్టలు,

బియ్యము, వెండి వర్తకులకు లాభము. విద్యార్థులకు ఉత్సాహముగా చదువు సాగుతుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము.

*** జ్యేష్ఠ [నో, యా, యీ, యూ.] ***

ఈ వారముకూడా గతవారమువలెనే యోగదాయకముగా వుంటుంది. అసంపూర్తిగా వుండిపోయిన పనులు లాభదాయకముగా ముగుస్తాయి. శుభపుణ్యకార్యాలలో పాల్గొంటారు. పరోపకారము చేసి కీర్తి పొందుతారు. వాహనయోగము కలుగుతుంది. ఉద్యోగస్థులకు హోదా పెరుగుతుంది. వర్తకులకు విలువగల వస్తువుల క్రయవిక్రయములలో ఎక్కువ లాభము. వారమంతా శుభయోగములతో కూడివున్నా కుటుంబ కలహముచే ఆందోళన కలుగుతుంది. కవులకు గాయకులకు కళాకారులకు నటీనటులకు యోగకాలము.

*** మూల [యే, యో, బా, బీ] ***

ఈ వారము మీకు రాబడి తక్కువ, ఖర్చులు ఎక్కువ. కార్యభారముచే తీరుబడి వుండదు. గృహావసరములు తీరక కష్టాలు వస్తాయి. ఆరోగ్యము చెడుచున్న చిహ్నాలు కనబడగానే ఔషధచికిత్స పొందడము రవికి శాంతి చేయించడము మంచిది. ఉద్యోగస్థులకు కొత్త సమస్యలు. వర్తకులకు ఆందోళన, విద్యార్థులకు చదువు సరిగా సాగదు. వారమంతా భయాందోళనలతో కూడివున్నా పితృవర్గ సహాయము, కార్యలాభము, ప్రయాణము కలుగును.

***పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢా]***

ఈవారము మీకు నిరాశగావున్నా అజ్ఞాతమిత్ర సహాయమువల్ల కార్యలాభము కలుగుతుంది. ఇంటిలో వున్నవారి ఆరోగ్యము చెడుటచే ఆందోళనగా వుంటుంది. ఉద్యోగస్థులకు స్వల్ప అనుకూలత. వర్తకులకు వారాంతమందు లాభము. వారమంతా ఉద్రేకముగా వుంటుంది. విదేశీయుల పరిచయము, అపురూప వస్తు సంపాదన కలుగుతవి. విద్యార్థులకు చదువు బాగా సాగదు.

***ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]***

ఈ వారము మీకు మిశ్రమయోగము. ఆశించిన సహాయము లభించక, అవసరములు తీరక అశాంతి కలుగుతుంది. అయిననూ ఈశ్వరానుగ్రహమువల్ల కష్టాలను గడిచి కార్యలాభమును పొందుతారు. వర్తకులకు చాలా కాలమునుండి నిలిచిపోయిన బాకీలు వసూలవుతవి. ఉద్యోగస్థులకు అధికారుల కోపముచే బదిలీ అయ్యే సూచనలున్నవి. పుణ్యపురుషుల సాంగత్యమువల్ల మనోవికాసము కలుగుతుంది. వారమంతా అశాంతిగావున్నా వారాంతమున నష్టద్రవ్యలాభము కలుగుతుంది.



చిత్రకారుడు :—బి. ఆర్. మూర్తి, (హైదరాబాద్)

*** శ్రవణము [జూ, జే, జో, ఖా] ***

ఈవారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. ఇచ్చి పుచ్చుకునేపట్ల వివాదాలు వచ్చి మనోవ్యథ కలుగుతుంది. కోర్టు వ్యవహారములు అనుకూలించినా ఆ సంతోషము అమిత ఖర్చులవల్ల వుండకుండా పోతుంది. భార్యకు అనారోగ్యము కలిగే సూచనలున్నవి. మినుములు, కొర్రలు, రాగులు, ఉప్పు, నువ్వులు, నూనె వ్యాపారస్థులకులాభయోగము. ఇతర జాతులవల్ల గౌరవము కలుగుతుంది.

*** ధనిష్ఠ [గా, గీ, గూ, గే] ***

ఈవారము ఎంత ప్రయత్నించినా యత్నకార్యములకు ఆటంకములు కలుగుతునే వుంటవి. అయినా పట్టుదలతో ప్రయత్నించి కార్యలాభమును పొందుతారు. సోదరసహాయమువల్ల ఒడిదుడుకులు సర్దుకుంటాయి. దెబ్బలుతగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు, లోహ, ఖనిజ వ్యాపారస్థులకు, పోలీసుశాఖఉద్యోగులకు మేలుకాలము. 26, 27 ప్రమాదభయము అధిక ఖర్చులు.

***శతభిషం [గో, సా, సీ, సూ]***

ఈ వారము మీకు యోగదాయకము. ప్రయత్నించిన పనులు నెరవేరుతవి. ధనలాభము కలుగుతుంది. ఈశాన్యదిక్కునుండి క్షేమవార్త తెలుస్తుంది. బంధుదర్శనము, శుభకార్యలోచనలు కలుగుతాయి. గణిత జ్యోతిషశాస్త్ర చర్చలు జరుపుతారు. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, ఇత్తడి, కంచువర్తకులకు లాభదాయకము. కవులకు, శిల్పులకు, చిత్రకారులకు మేలుకాలము. 27 అధిక ఖర్చులు.

*** పూర్వాభాద్ర [సే, సో, దా, దీ] ***

ఈ వారము మీకు శుభయోగము. ఆశించిన డబ్బు చేతికి వస్తుంది. ఇంట్లో శుభకార్యాలకు ప్రయత్నములు చేస్తారు. పుణ్యకార్యాచరణ, శాస్త్ర చర్చలు, ప్రభుత్వ సన్మానము వంటి యోగములు కలుగుతవి. ఇంట్లో వున్నవారి ఆరోగ్యం బాగుపడుటచే ఆందోళన తీరుతుంది. పిల్లల క్షేమలాభముల కొరకు కొన్ని యేర్పాట్లు చేస్తారు. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుగా వుంటుంది.

***ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా]***

ఈవారము మీరు తలపెట్టిన పనులలో జయముపొందుతారు. బంధుమిత్రులతో వినోదములలో పాల్గొని మృష్టాన్నభోజనము చేస్తారు. నీటిమీద ప్రయాణము చేయవలసివస్తుంది. విద్యార్థులకు చదువు ఉత్సాహముగా సాగుతుంది. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి, బియ్యము, ద్రవపదార్థ జనిత వస్తువుల వర్తకులకు లాభదాయకము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుకాలము.

*** రేవతి [దే, దో, చా, చీ] ***

ఈవారము మీకు యోగప్రదము. ధనధాన్యవృద్ధి వుంటుంది. ఇష్టవస్తులాభము కలుగుతుంది. భార్యకు అలంకారప్రాప్తి వుంటుంది. వివాహాది శుభకార్యాలోచనలు ఫలప్రాప్తిపొందుతాయి. పరోపకారమువల్ల కీర్తి. విద్యార్థులకు చదువు చురుకుగా సాగుతుంది. ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు ఎక్కువ లాభము కలుగుతుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటనటులకు యోగదాయకముగా వుంటుంది.





బాల సాహితి

# జన్మ సంస్కారం

కృష్ణాతీరంలో వెలనాటి ప్రాంతంలో ఒకానొక చిట్టడవి. ఆ అడవిలో ఒక పెద్ద మద్దిచెట్టు. చిరకాలంగా ఆ చెట్టు అక్కడ వుంది. శాఖోపశాఖలతో విశాలంగా ఉన్న ఆ చెట్టు నీడను బాటసారులనేకులు ఎప్పుడూ విశ్రాంతి తీసుకునేవారు.

ఆ చెట్టు కొమ్మలనాశ్రయించుకుని ఎన్నోరకాల పక్షులు కాపురముండేవి. అవి తెలతెలవారుతుండగా కిలకిలలాడుతూ గూళ్లు వదలి ఆహార సంపాదనకోసం పోయి సాయంకాలానికి తిరిగివచ్చేవి. పిల్లల తల్లులు అట్టేదూరం పోకుండా గింజలు ఏరుకువచ్చి పిల్లలకు తినిపిస్తూ ఉండేవి.

వ్యాపారం మీద కాలినడకను దివిసీమ ప్రాంతాలనుంచి గుంటూరు సీమకు వస్తూ పోతూ ఉండే బాటసారులు సామాన్యంగా ఆ చెట్టు క్రిందనే మిట్టమధ్యాహ్నపు ఎండలో విశ్రమించి కట్టుకుతెచ్చుకున్న అన్నాలు తినిపోతూ ఉండేవాళ్లు.

అయితే ఆ చెట్టు క్రింద పడుకున్న బాటసారులకు ఎవరికో ఒకరికి ఎప్పుడూ ఒక శాస్తి జరుగుతూ ఉండేది. ఒకరోజా రెండురోజులూ కాదు.

ఏ. సదానందం

తప్పనిసరిగా విశ్రమించి వెళ్లేలోగా బాటసారుల్లో మంచి దుస్తులు వేసుకున్నవారిపై ఒక కాకి రెట్ట వేస్తూ ఉండేది. మనస్సు చివుక్కుమన్న బాటసారులు 'ఛీ! శత్రువు పోగయింది ఎన్నడు చస్తుందో పాడు కాకి' అని శపిస్తూ ఉండేవాళ్లు.

ఇలా కాలం జరిగిపోతూ ఉండగా ఆ కాకి పెద్దదై పోయింది. కాలం తీరే సమయం వచ్చింది. పాపం కాకి మనస్సులో ఒక్కసారి ఆలోచన కలిగింది - 'నేనిన్నాళ్లు బ్రతికాను, ఎన్నడూ ఒక్క మంచిపని అయినా చేయలేదు కదా. ఇక నాకు స్వర్గప్రాప్తి లేదు కాబోలు' అని. ఆ ఆలోచనతో అది మంచం పట్టింది.

ఒకనాడు ఆ కాకి ఒక్కగానొక్కడైన తన కొడుకును పిలిచి "నాయనా - నారోజులు అయిపోయినాయి. నేను వెళ్లిపోతున్నాను. జీవితమంతా నలుగురూ రోసిపోయేలాగ దుష్కార్యాలు చేశాను. ఎండకు తాళలేక విశ్రమించిన బాటసారులపై కొంటెతనంగా రెట్టలు వేస్తూ నిద్రాభంగం కలిగించాను. మదంతో కావాలని చేసిన పాపాలకు పరిహారం లేదు. ఇక నాకు స్వర్గప్రాప్తి లేదు" అని కంట నీరు పెట్టుకుంది.

తండ్రి మాటలకు చలించిపోయింది చిన్నకాకి. "నాన్నా పశ్చాత్తాపం కలిగింది కదా, అదే పదివేలు - దుఃఖించకు. స్వర్గం తప్పక లభ్యమౌతుంది. ఈ చివరి క్షణాల్లో దేవుణ్ణే తలచుకో" మంటూ

ఓదార్చింది.

కాని ఆ మాటలకు తండ్రికాకికి ఊరట కలుగలేదు. చివరకు బాధతో కొడుకుతో "అబ్బాయీ - నాకు నువ్వు ఒక్కగా నొక్కడివి. నాకు పేరుతీసుకువచ్చే బాధ్యత నీది. నాకు స్వర్గం ఎలాగూ లేదు. కాని ఒక్కవని కొడుకు వైనందుకు నువ్వు చేయాలి." అని కోరింది. ఏమిటో చెప్పమని చెయ్యగలనని ప్రమాణం చేసింది చిన్న కాకి.

అంతట కొడుకుభుజంపై తట్టి పెద్ద కాకి యిలా అన్నది. 'కుమారా! నేను బ్రతికిననాళ్లూ నన్ను అంతా తిట్టి పోసినవాళ్లే - కనీసం నేను చచ్చిపోయిన తరువాతనైనా నలుగురూ నన్ను కీర్తించేటట్లు నువ్వు చెయ్యాలి. స్వర్గానికి పోకపోయినా భూలోకంలో నైనా నా అనంతరం నన్నుగురించి నలుగురూ మెచ్చుకొనేటట్లుచేసి నా ఆత్మకు శాంతి కలిగించు... ప్రమాణం చెయ్యి' అని.

చిన్న కాకి ప్రమాణం చేసింది - పెద్ద కాకి ప్రాణం వదిలింది.

తరువాత కొన్నాళ్ళు చిన్న కాకి తీవ్రంగా ఆలోచించ సాగింది. 'తన ప్రమాణం నిలబెట్టుకోవడం ఎట్లా?' అని పరిపరి విధాల మార్గం వెతక సాగింది.

చివరకు ఒకరోజున ఉపాయం తట్టింది. ఉపాయం కూడా తన సంస్కారానికి అనుగుణంగానే తోచింది కాకిపిల్లకు.

రోజూ మామూలుగా వచ్చి విశ్రాంతి తీసుకుంటూ 'కాకిచచ్చింది పీడవదిలింది' అనుకుని హాయిగా పడుకుంటున్నారు బాటసారులు. ఆరోజు ఆమాటలు విన్న చిన్నకాకి గబగబా కొన్ని గులకరాళ్లు తన గూట్లో నిలవచేసుకుని మరునాటి నించీ - ప్రతి బాటసారి పైన రాయి వేయడం, టపీమని రాయి తగలగానే ఏమిటా అని తలయెత్తి పైకి చూస్తుండగా బాటసారి మొహాన రెట్టవేయడం మొదలుపెట్టింది. ఇలా నిర్విరామంగా కాకిపిల్ల చేస్తున్న ఈ ఘోరానికి విసిగిపోయి బాటసారులు 'ఛీ దీని మొహం మండ ఇదెక్కడినించి దాపురించింది? పాడుబుద్ధి ఇదీని, దీనితండ్రే నయం. పాపం బట్టలమీద రెట్టవేసేది. దీనికిదేం పోయేకాలం. ఎక్కడికి పోతుంది జన్మసంస్కారం" అని తిడుతూ ఉండేవాళ్లు. కొందరు 'ఆహా రెట్టవేసినా మర్యాదగా వేసేదండీ దీనితండ్రి' అని కొందరు పెద్దకాకిని కీర్తించేవాళ్లు.'

తనను తిట్టినా తన తండ్రిని మెచ్చుకునేటట్లు చేయగలిగాను కదా అని పాపం అమాయకపు కాకిపిల్ల సంతోషిస్తూ అలాగే కాలం గడిపింది.




చిత్రకారుడు: ఎం. వి. అప్పారావు-బాపట్ల.

## చప్పున చెప్పుకోండి!

(ఎ) ఈ క్రింద అర్థం పర్థం లేనిమాట ఒకటివుంది. అందులో ఒక మహానాయకుడి పేరు, ఒక నది జాగ్రత్తగా చూస్తే కనిపిస్తాయి.

1. గోలలేఖ కృష్ణగో.

(బి) క్రింద కొన్ని ప్రసిద్ధుల పేర్లు ఉన్నాయి. ఆ పేర్లకు ముందు ఉండవలసిన బిరుదులు గాని ఇంటిపేర్లు గాని మీరు తేలిగ్గా పూరిస్తారు.

(1) ......చిత్తరంజన్ దాస్ (2) ......రాధాకృష్ణన్ (3) ......అల్లసాని పెద్దన (4)... బాలగంగాధరతిలక్.

(బి) క్రింద కొన్ని పూర్తి గాని మాటలున్నాయి. మాటకు ఏదో ఒక చివర ఒక అక్షరం కలుపుతే అర్థం వస్తుంది.

(1) భవన (2) గవంతుడు (3) త్రిక (4) దావరి.

# శిక్ష తెచ్చిన అదృష్టం

దారపు వెంకటసుబ్బారావు

పూర్వం ఫ్రెడరిక్ రాజు సైన్యంలో, ఉపసేనాని హోదాలో ఒకడు ఉండేవాడు. ఒకపుడు యుద్ధాలు లేక పోవడంచేత, సైనికులు చేయవలసింది ఏమీ లేకుండ పోయింది. ఇంతమందిని వట్టికే కూర్చోబెట్టి మేపడం ఎందుకని ఫ్రెడరిక్ రాజు కొంత సైన్యాన్ని, సైనికాధికారుల్ని పనులనుండి తొలగించివేశాడు. అట్లా తొలగింపబడినవాళ్లలో ఉపసేనానికూడా ఉన్నాడు. ఉద్యోగం ఊడిపోయినతరువాత అతడు మాటిమాటికి ఫ్రెడరిక్ దగ్గరకు వెళ్లి తిరిగి ఉద్యోగం యిమ్మని, సైన్యంలో చేర్చుకోమని వేధించుకు తినేవాడు. అతని బాధ పడలేక ఏదో ఒక సామాన్యమైన ఉద్యోగం యిస్తానన్నాడు ఫ్రెడరిక్. అయితే అతను మట్టుకు వప్పుకునేవాడు కాదు. నాకు మరల నాపనే ఉపసేనానాయకత్వ పదవే కావాలని మంకుపట్టుపట్టి కూర్చునేవాడు. ఫ్రెడరిక్ ఎన్నోసార్లు నెమ్మదిగా "మిత్రమా, ప్రస్తుతం, ఖాళీలులేవు, వచ్చినప్పుడు తప్పక యిస్తాను" అని నచ్చచెప్ప చూచాడు. కాని అతను ససేమిరా వప్పుకొనేవాడు కాదు. మాటిమాటికి వచ్చి అట్లాఅడుగుతుండేవాడు ఫ్రెడరిక్ సహజంగా శాంతస్వభావుడు. ఇతరుల మనస్సు కష్టపెట్టేవాడుకాదు. అయినా, ప్రతిదానికి ఒకహద్దు అంటూ ఉంటుంది గదా! చివరికి విసుగొచ్చి "ఇక యిక్కడకు ఎన్నడూరాకు, వచ్చావంటే కఠినశిక్ష పొందుతావు" అని హెచ్చరించాడు కూడా.

ఇది జరిగిన కొంత కాలానికి ఎవరో, ఫ్రెడరిక్ రాజును దూషిస్తూ ఒక పెద్ద కవితను అల్లి ప్రకటించాడు. దాన్ని రాజు కూడా చూచాడు. సహజంగా శాంతస్వభావంగలవాడైనా, తన అవమానాన్ని భరించలేక పోయాడు, చాల కోపంవచ్చింది. వెంటనే "ఈ కవిత్వం వ్రాసిన కవిని పట్టుకొని నాకు వప్పగించిన వానికి ఏభై బంగారు మొహర్లు బహుమానం యిస్తా"నని. చాటింపు వేయించాడు. చాటింపు వేయించిన మర్నాడే ఉపసేనాని ఫ్రెడరిక్ ముందుకొచ్చి నిలబడ్డాడు. అతడ్ని చూచేటప్పటికి రాజుకు కోపం, ఆశ్చర్యంకూడా కలిగాయి.

'మళ్లా యిక్కడకు ఎందుకు వచ్చావు?' అని గద్దించాడు ఫ్రెడరిక్.

అతడు సవినయంగా నమస్కరించి, విన్నవించడం మొదలు పెట్టాడు.

"ప్రభూ, మిమ్ములను దూషిస్తూ పద్యాలు వ్రాసిన కవిని పట్టిస్తే ఏభైబంగారునాణాలు బహుమానం యిస్తానని, మీరు ప్రకటించారు గదా?"

"అవును ప్రకటించాము, అయితే దానికి నీవు యిక్కడకు రావడమెందుకు?"

"ప్రభూ, ఆ బహుమానాన్ని మీరు నాకు యివ్వకుండా తప్పించుకోలేరు."

"ఎందుకని?"

"ఎందుకంటే, ఆ పద్యాలు వ్రాసింది, ఏలినవారి దాసుణ్ణయిన నేనే. మీరు ప్రభువులు, మీరు కావాలనుకొంటే మీ చిత్తమొచ్చిన కఠినశిక్షను నాకు విధించండి. కాని, ఆకలితో అలమటిస్తున్న నా భార్యాపిల్లలకు మీరు యిస్తామన్న బహుమానం మాత్రం దయచెయ్యండి. ఇంతకంటే తమర్ని ఎక్కువ ఏమీ ప్రార్థించడం లేదు." ఉపసేనాని వ్యవహారమంతా చూచి, ఫ్రెడరిక్‌కు చాలా కోపం వచ్చింది. వెంటనే ఒక కాగితం మీద ఏదో వ్రాసి అతనిచేతికిస్తూ "యిదుగో, ఈ రాజాజ్ఞను తీసుకొని స్పాండో కోట అధిపతి దగ్గరకు వెళ్లు. అక్కడ యితర ఖైదీలతోపాటు నీవూ ఉండేటట్లు శిక్ష విధించాను.

అతడు, రాజాజ్ఞను తీసుకొంటూ, "ప్రభువుల చిత్తం, దయచేసి మీరు యిస్తామన్న బహుమానం మాత్రం, యింటికి పంపడం మరచిపోకండి." అని బయటకు పోబోయాడు.

పోతున్న ఉపసేనానిని పిలిచి ఫ్రెడరిక్ రాజు యిలా అన్నాడు: "ఇదుగో జాగ్రత్తగా విను, స్పాండో కోట అధిపతికి ఈ రాజాజ్ఞ యిచ్చి, భోజనం చేయకముందు మాత్రం దీనిని చదువ వద్దని నా ఆజ్ఞగా చెప్పు."

పాపం, ఉపసేనాని చేసేది లేక దిగులుతో, ఉత్తరం తీసుకుని తిన్న


"GOKUL"
SANTOL
TOILET POWDER
T.S.R'S
GOKUL
SANDAL
WOOD
TOILET POWDER
ముస్తాబు ద్రవ్యముల చరిత్రలో ఇంతవరకు తయారుకాని క్రొంగ్రొత్త ఫేస్ పౌడర్లు!
గోకుల్ శాంటోల్ టాయిలెట్ పౌడరు :
శుద్ధమైన చందనపు చెక్కల పొడుతో (మైక్రోసైజు) చాల ఇంపైన టాల్కం చేర్చబడి, తయారుకాబడిన పౌడరు. మీ ముఖ కాంతిలో మెరుగు చూపుట, చెమటను అపుట, చాలకాలము వాసన యుండుట దీని ముఖ్య విశేషములు. చెమట పొక్కులను అపుచేయును.
గోకుల్ శాండల్‌వుడ్ టాయిలెట్ పౌడరు :
శుద్ధమైన చందనపు చెక్కలనుండి తయారుకాబడిన పౌడరు. ఫేస్ పౌడరులకు వలయునంత సున్నితము చేయబడినది.
గోకుల్ బ్యూటి పౌడరు :
పరిశుద్ధమైన వనమూలికల నుండి తయారుకాబడిన పౌడరు. వివిధ రాయలలో గలవు. మీ ముఖవర్చస్సును పెంపొందించునట్టియు, క్రిమి సంహారక సంబంధమగు నట్టియు గుణములు గలది దీని సువాసన గంటలతరబడి నిలచియుండును.
టి.యస్.ఆర్ & కో, కుంబకోణమ్
C.L. Mani



# శిక్ష తెచ్చిన అదృష్టం

గా స్పాండో కోటకు దారితీశాడు. అధిపతిని కలిసి రాజాజ్ఞ అందచేశాడు. భోజనం చేసిన తరువాత విప్పి చదవమన్న రాజాజ్ఞ కూడా విన్నవించాడు.

ఇద్దరూ భోజనానికి కూర్చొన్నారు. అధిపతికి భోజనం ఏమాత్రం సహించడం లేదు. ఆపత్రంలో తన కొంప తీసే ఏ ఆజ్ఞ వుందో అని అతనికి తగని భయం వేసింది. ఎలాగో భోజనం ముగిసింది. వెంటనే రాజాజ్ఞాపత్రం విప్పి చదివాడు. సంతోషం పట్టలేక సేనానిని గట్టిగా కావలించుకున్నాడు. రకరకాలుగా అతనికి అభినందనలు తెలుపసాగాడు. ఇదంతా అయోమయంగా వుంది, ఉపసేనానికి. అసలు సంగతేమిటని అధిపతిని ప్రశ్నించాడు. అధిపతి రాజాజ్ఞను చదివి వినిపించాడు:

"ఈ పత్రవాహకుని నేటినుండి స్పాండో కోటకు అధిపతిగా నియమిస్తున్నాం. అన్ని వ్యవహారాలు చక్కబరచి యితనికి కోట అధికారాలు వప్పగించాలి. నిన్ను 'పోటర్స్ హన్ కోట'కు అధిపతిగా బదిలీ చేస్తున్నాం. యిది నీకు ఎక్కువ సంతోషాన్ని కలిగిస్తుందని తలుస్తాం. త్వరలోనే ఈ పత్రవాహకుని భార్యాపిల్లలను, ఏభై బంగారు మొహర్లు యిచ్చి స్పాండో కోటకు పంపే ఏర్పాట్లు చేయిస్తాం."

ఇది వినేసరికి ఉపసేనాని ఆనందంతో ఎగిరి గంతేశాడు. స్వస్థలానికి బదిలీ చేసినందుకు అధిపతి ముఖం వికసించింది. ★

## బాలల సంఘం

# కొందరు సభ్యుల పేర్లు

దంతు కృష్ణకుమారి (పూనా), శిష్ట్లా ఆదిలక్ష్మీ కామేశ్వరి (తెనాలి, గుంటూరుజిల్లా) ఎ. వాంపెయ్య (సంగారెడ్డి, మెదక్ జిల్లా) డి. సత్యప్రసాదుశర్మ (గిప్పలమడక, ఖమ్మం జిల్లా), పోరుల అనంతలక్ష్మీకేశమ్మ (అయిజ మహబూబ్‌నగర్ జిల్లా), తూములూరి మురళీధర శర్మ (గుంటూరు), మజుందార్ పార్థసారథి (మచిలీపట్నం, కృష్ణాజిల్లా), బి. వి. లక్ష్మీనరసింహ సత్యప్రసాద్ (కాకినాడ, తూ॥ గో॥ జిల్లా).

దుర్గవాటి వెంకటగోపాల సూర్యవర ప్రసాద శర్మ (పామర్రు, కృష్ణాజిల్లా) చిప్పాడ ఉమ (కొత్తఢిల్లీ) తెన్నేటి కామేశ్వరి (పిఠాపురం, తూ॥ గో॥ జిల్లా) చివుకుల పద్మజాదేవి (ఒంగోలు, గుంటూరు జిల్లా), అక్కినేని అజయకుమారి (ఏలూరు ప॥ గో॥ జిల్లా), కొగుకొండ రత్నమణి (అనకాపల్లి, విశాఖజిల్లా), లక్కంశెట్టి వీర వెంకటసుభద్ర (తాటిపాక, తూ॥ గో॥ జిల్లా), కొత్తమాసు వెంకట సత్యనారాయణ గుప్త (చేబ్రోలు, గుంటూరుజిల్లా), పావులూరి రామమోహనరావు (గోవాడ, గుంటూరు జిల్లా) తిపవర్తి శ్రీదేవి (రేపల్లె, గుంటూరుజిల్లా), కొల్లిపల్లి అహల్య (సింహపురం, శ్రీకాకుళంజిల్లా), నూకవల్లి సుధాకర ప్రసాద్ (విజయవాడ), ఎల్. రంగనాయకీరాణి (శేకూరు, గుంటూరుజిల్లా), యడవల్లి శోభారాణి (గుంటూరు), మిద్దెల వేణు (పరకాల, వరంగల్ జిల్లా), ఎస్. బి. ప్రసాదరావు (బింకనపాలెం నెల్లూరుజిల్లా) దాసు హరిప్రసాదు (మచిలీపట్నం, కృష్ణా జిల్లా.)

బందా రాధాకృష్ణమూర్తి (మద్రాసు) మల్లిపూడి వెంకటరుక్మిణీకుమారి (కోసగోలు, కర్నూలుజిల్లా) కొవ్వలి సత్యనారాయణ (అమలాపురం, తూ. గో. జిల్లా).

మతుకుమల్లి సావిత్రీదేవి (గుంటూరు) వఝుల రంగనాథ్ (నెల్లూరు) మంకు వెంకట కృష్ణయ్య (నెల్లూరు) కొత్తపల్లి శ్రీనివాసరావు (తాడేపల్లిగూడెం, ప. గో. జిల్లా) గానుమర సాయిరాణి (మచిలీపట్నం, కృష్ణా జిల్లా) వంగర ఓంకారేశ్వర వరప్రసాదు (తాడికొండ, గుంటూరుజిల్లా) రావినూతల సుబ్బారావు (తాడికొండ, గుంటూరుజిల్లా) పెమ్మరాజు రామకృష్ణ (జగన్నాథపురం, ప. గో. జిల్లా) వల్లమాని సత్యనారాయణ మూర్తి (హైదరాబాదు) జి. సింహాచలం (కలకత్తా) అయితాబత్తుల జోగేశ్వర వెంకట బుచ్చి మహేశ్వరరావు (గోపవరం, తూ. గో. జిల్లా) వంక సరస్వతీకుమారి (పార్వతీపురం, శ్రీకాకుళంజిల్లా) జి. సమ్మయ్య (హనుమకొండ, వరంగల్ జిల్లా) ఇరుకుల రాజేందర్ (వరంగల్) తంగిరాల శ్రీరామచంద్రమూర్తి (మచిలీపట్నం, కృష్ణాజిల్లా) అన్నావఝుల శేషయ్య (తాడిపత్రి, అనంతపురంజిల్లా) దయ్యాల రమాసుందరి (గుంటూరు) యల్లంరాజు శకుంతలాదేవి (విజయవాడ) ప్రేరేపు సీతారామరత్నం (తిరుపతి, చిత్తూరుజిల్లా) వల్లపోలు రాధా విజయలక్ష్మి (నందిగామ, కృష్ణాజిల్లా).

కొంగర వెంకటేశ్వరరావు (కాకినాడ, తూ. గో. జిల్లా) కనుమతగడి శోభారాణి (ఏలూరు, ప. గో. జిల్లా) యస్. కామేశ్వరరావు (విజయవాడ) చాగంటి అయ్యపరాజు (మార్కండేయపురం, తూ. గో. జిల్లా) వంగిపురం జగన్నాథస్వామి (ఏలూరు, ప. గో. జిల్లా) అక్కరాజు సుధాకర రావు (నెల్లూరు) గబ్బిట రాఘవలక్ష్మి (ఏలూరు, ప. గో. జిల్లా) లాలా జయకుమారి (విజయవాడ) శనివారపు మోహనలక్ష్మి (కొవ్వూరు, ప. గో. జిల్లా) మంచవిల్లి హరిగోపాలరావు (గుంటూరు) దివవహి వెంకటసుబ్బారావు (విజయవాడ) చిక్కరాజు వరలక్ష్మి (హైదరాబాదు) కోనరాజు బుజ్జి (పెదముత్తేవి, కృష్ణాజిల్లా) యం. సుగుణవల్లి (గుంటూరు) చాగర్లమూడి పకీరయ్య (పటమటలంక, కృష్ణాజిల్లా) ఇవటూరి వీరవెంకటసత్య సుబ్బరాయప్రసాదు (వెలగలేరు, ప. గో. జిల్లా) దేచిరాజు శశివర లలితా వరప్రసాదు (కొలకలూరు, గుంటూరు జిల్లా) గిన్నెల సూర్యకుసుమకుమారి (గుయ్యూరు, కృష్ణాజిల్లా) పైడిమర్రి లక్ష్మి (రాజమండ్రి, తూ. గో. జిల్లా) బుద్ధిరాజు రామకృష్ణ శేషతల్పశాయి (బాపట్ల, గుంటూరుజిల్లా).

'ఓడప్రయాణంలో మొదటి రోజు నాకు వికారపెట్టి వాంతులౌతాయి.'

'ఓహో! అయితే ఓపని చెయ్యండి' ప్రయాణం రెండో రోజునే మొదలెడితే సరి.'



సాటిలేని శ్రేష్ఠతకు, అద్భుతమైన
పనితనమునకు, రెండు దివ్యమైన

## నేషనల్ ఎక్కో

# బ్యాటరీ మోడలులు!



ఇదిగో, మీరు రేడియో ప్రసారములను దివ్యముగా విని ఆనందించుటకు చక్కగా పనిచేసే అత్యంత శ్రేష్ఠమైన రెండు నేషనల్-ఎక్కో మోడలులు! అవి 'మాన్‌సూనైజ్' చేయబడినవి మరియు వాటితో ఒక సంవత్సరము గ్యారంటీ యివ్వబడుతుంది. మీ దగ్గరలోనున్న నేషనల్-ఎక్కో వ్యాపారిని వాటిని పెట్టమని నేడే వినండి!



మోడలు బి-717: 4 వాల్వుల. 3 బ్యాండుల డ్రై బ్యాటరీ సెట్. బంగారు రంగు కావరములతో. గోధుమ రంగు బేక్‌లైట్ క్యాబినెట్.
రు. 250/-

అన్ని ధరలూ నెట్,
స్థానిక పన్నులు అదనము



మోడలు బి-722: 5 వాల్వుల. 3 బ్యాండుల డ్రై బ్యాటరీ సెట్. గోధుమ రంగులో చక్కని మహాగని క్యాబినెట్.
రు. 335/-

నేషనల్-ఎక్కో రేడియోలు
శ్రేష్ఠమైనవి - అవి




చేయబడినవి




**జెనరల్ రేడియో & అప్లయన్సెస్ ప్రైవేట్ లిమిటెడ్**
ఒపేరా హౌస్, బొంబాయి 4 • 3 మదన్ స్ట్రీట్, కలకత్తా 13 • 1/18 మౌంట్ రోడ్, మద్రాసు
36/79 సిల్వర్ జూబ్లీ పార్కు రోడ్, బెంగుళూరు • లోథియాన్ కాంపి, చాందిని చౌక్, ఢిల్లీ

# విద్యాప్రమాణం తగ్గటానికి కారణాల తోరణాలు

## విద్యార్థులు - అల్లర్లు

ఒక క్లాసులో పదిమంది విద్యార్థులుంటే అల్లరి ఎవ్వరూ చెయ్యరు. అదే వందమందుంటే గొడవ. అల్లరి పాలసముద్రంనుండి హాలాహలం పుట్టినట్లు పుడతాయి. కారణం మనకి తెలుసు, అన్నవాణ్ణి పట్టుకోడం కష్టం, ఇక విద్యాలయాల్లో పబ్లిక్ మీటింగుల్లా క్లాసులుంటే చదువుకున్న.

—రాయసం వెంకటరామయ్య, (భీమవరం)

## సూత్రత్రయం

ఇక కాలేజీ విద్యార్థులను, పెద్దవారుగాన ఎవ్వరూ ఏమీ అనరు. వీళ్ళబాధ్యతలు వీళ్ళకి తెలియవు. ఏదైనా తప్పుచేస్తే మందలిద్దామన్న ఉద్దేశ్యంలో లెక్చరరు ఏమైనా అంటే ఆ నాటినుంచి ఆయన క్లాసుకు ఎవరూ వెళ్ళరు. ఆయన చేసిన తప్పుపనికి, లెక్చరరు ఏదో అన్నాడని, అభిమానంతో పెద్ద స్ట్రయికు చేసి గొడవ చేసే విద్యార్థులకు, క్రమశిక్షణ అనే పదానికి నిర్వచనం తెలుసా?

ఇంతకీ చెప్పవచ్చే దేమిటంటే విద్యార్థులు రాజకీయంలో కావలసిన దానికంటే అధిక పాత్ర వహించరాదు. తమ నందరూ గౌరవించాలని, తమదే ఎల్లప్పుడూ పైచేయిగా ఉండాలనే భావన విద్యార్థులు కొంచెము తగ్గించుకోవాలి. విద్యవస్తే గౌరవముకూడ దానంతటే వస్తుంది. విద్యార్థి, విద్యార్థినులకు వేరు వేరు కాలేజీలుంటే పరిస్థితులు కొంతవరకూ బాగుపడుతవి.

—ఎ. వి. ఆర్. కృష్ణారావు, (వాల్తేరు.)

## విద్యార్థిసంఘాలు

విద్యార్థులవల్ల అల్లరి జరగకుండా వుండాలంటే, వారికి సరియైన క్రమశిక్షణ అలవడాలంటే ప్రస్తుతము హైస్కూళ్లు, కళాశాలల్లో నున్నటువంటి విద్యార్థిసంఘాలు, ముఖ్యంగా వాటి ఎన్నికల విధానము పూర్తిగా రద్దుచేయాలి. వాటి ఉద్దేశ్యం మంచిదైనా మన రాజకీయ నాయకులు వారి కలహాలు, గ్రూపు తత్వాలు, కుట్రలు విద్యార్థి సంఘాల్లో ప్రవేశింపచేసి వాటిని కలుషితం చేశారు. ఆంధ్రదేశంలో నున్న ఒకముఖ్య పట్టణములోని ఒక కళాశాల విద్యార్థి సంఘపు యెన్నికలలో ఒక సంవత్సరము దాదాపు 4 రాజకీయ పార్టీలకు సంబంధించిన విద్యార్థి పార్టీలు ఎన్నికలలో పాల్గొన్నవి. వీటికి నగరంలో నున్నటువంటి పార్టీల పెద్ద మనుష్యులు తమ శక్తివంచన లేకుండా సహాయం చేసి అండదండగా నిలబడ్డారు. దాదాపు యిటువంటి పరిస్థితులే ప్రతి కళాశాల, హైస్కూలు విద్యార్థి సంఘాల్లో నున్నవి. దీనినిబట్టి విద్యార్థి సంఘాలెంత రాజకీయ కలుషితమైనవో వాటివల్ల విద్యార్థుల కేవిధమైన విద్యావిషయిక జ్ఞానాభివృద్ధి చెందుతుందో తెలుసుకోవచ్చును.

చొడవరపు. రంగారావు (సికిందరాబాద్)

## కారకు లెవరు?

విద్యా ప్రమాణం తగ్గటానికి విద్యార్థులే కారణమనటం ఎంత మాత్రమూ సబబు కాదు. అధ్యాపకుల బాధ్యత ఎంతో ఉంది. ఎంత విసుగెత్తించే విషయమైనాసరే, దానిని సరియైన పద్ధతిలో విద్యార్థులకు ఆసక్తి కలిగేలా చేయటం వారి బాధ్యత. దీనిలో ఎంత మాత్రం లోపం కనిపించినా, "ఆయన తన గొడవేదో తను మాసు కొంటున్నాడు. మనకు కావలసింది అటెండెన్సు" అనుకునే స్థితికి వచ్చేస్తారు విద్యార్థులు. ఎటెండెన్సు కోసమే తప్పనిసరిగా కాలేజీకి వచ్చి, క్లాసులో వెనక బెంచీలో నిద్రపోయే మహానుభావులు ఎంతోమంది.

మరో గమ్మత్తయిన విషయం టెక్నికల్ కాలేజీల్లో సెషనల్ వర్కు అంటూ ఒకటుంటుంది. అందులో డ్రాయింగుషీట్లూ, రిపోర్టులూ, ట్యుటోరియల్సు, మొదలయినవి. ఎప్పటికప్పుడు తయారుచేసి, లెక్చరరకు చూపాలి. కనీసం ఆ వర్కయినా, రెగ్యులరుగా చేసేవాళ్ళను మనం వేళ్ళమీద లెక్కింపవచ్చు. ఒక్కడు స్వంతంగా వ్రాస్తే, వాడికి కాపీ, ఆ కాపీకికాపీ, మళ్ళీ దానికి కాపీ, ఇలా ఎన్నో డూప్లికేట్లు, ట్రిప్లికేట్లు తయారవుతూంటాయి. పోనీ కనీసం మార్కుల విషయంలో నయినా న్యాయం లభిస్తుంటుందా అంటే అదీలేదు. ఒరిజినల్ వేసినవాడికి పదికి ఆరువస్తే, కాపీ చేసినవాడికి ఎనిమిది పడతాయి.

ప్రతి నెలకు పరీక్షలుపెట్టి, వాటిలో గడించుకొన్న మార్కులనుకూడ వార్షిక పరీక్షలో కలిపేట్టుగా, ఒక స్కీము ఉంటే, కనీసం పాసు మార్కులకోసంకూడ ప్రతీ పరీక్షకు హాజరయి, కాస్తో, కూస్తో చదివి వ్రాయాల్సొస్తుంది - అదే విధంగా సెషను వర్కులోకూడ ఎప్పటికప్పుడూ, అక్కడ, వాళ్ళనుండే తాము వేసిన ప్రశ్నలకు జవాబు లిప్పించుకొని, వాటికి తగిన మార్కులు వేసేటట్లు, నిర్బంధమైన ఇట్టి విద్యావిధానముండి, అటెండెన్సు విషయంలోకూడ ఖచ్చితమైన రూల్సు ఉంటే తప్ప, విద్యాప్రమాణం పెరిగేందుకు అవకాశముండదు.

ఇక మిగిలిన విషయాలేలాగు ఉంటాయనుకోండి - రాజకీయాలు, సినిమాలు, విద్యార్థులకు ఎంతో నష్టం కలిగిస్తాయను కోటంకంటే ప్రస్తుతం మన మవలంబిస్తున్న విద్యావిధానాన్ని పరీక్షా విధానాన్ని మారిస్తే, తప్పకుండా మన ఆశయం సిద్ధింపవచ్చు అని ఆశిస్తున్నాను.

ఆర్. విద్యాసాగర్ రావు (హైదరాబాద్)

* * *

## పైసకు కొరగాని ఫస్టుక్లాసు

తమ న్యాయమైన హక్కులకొరకు, కోర్కెలకొరకు శాంతియుతమైన సమ్మెలు చేసి క్లాసులకు వెళ్ళకపోవడంలో తప్పు ఏమాత్రం లేదు—కాని అక్కడక్కడ విద్యార్థులు తమపై చేసిన దుష్కార్యాలకు ఉద్రిక్తులై దుండగాలు చేశారు. అది తప్పు ఎవరూ కాదనరు. కాని ఆ క్రమశిక్షణా రహిత చర్యలకు విద్యార్థులొక్కరే బాధ్యత వహించరు. ఆరేడు నెలలక్రితం జరిగిన ఉస్మానియా విశ్వవిద్యాలయ విద్యార్థుల ఉద్యమం అందరికి తెలిసిందే. వైస్ ఛాన్సలర్ నియామకానికి వ్యతిరేకంగా తమకు ఇవ్వబడిన రక్షణల అమలుకై విద్యార్థులు క్లాసులు మానివేయడం లేనిసబబా?

విద్యాప్రమాణాలు తగ్గిపోవడానికి గల ముఖ్యకారణాలలో మరొకటి ప్రవేశాలలో జాప్యం. సాధారణంగా అడ్మిషన్స్ పూర్తి అయ్యేవరకే ఆగస్టు ఆఖరవుతుంటుంది, సెప్టెంబర్ లో సెలవులు—తరువాతఅక్టోబర్ నుండి ఫిబ్రవరివరకు మాత్రమే చదువు! ప్రొఫెషనల్ కాలేజీల్లోని సీట్లు అమ్ముతున్నారు. పైసలకుగల విలువ ఫస్టుక్లాసులకు లేకుండాపోతుంది. ఇట్లు తయారయిన విద్యార్థులు భావిభారతనిర్మాణానికి ఎట్లు తోడ్పడగలుగుతారు?

—సెల్లూట్ల జగన్మోహన్, (హైదరాబాదు.)

(62-వ పేజీ చూడండి)

## ఎందరో మహానుభావులు

...మంలో కొన్ని విశేషాలు సేకరించి కూడి చేయించినవారిని పట్టుకున్నారని కొన్ని సంగతులు వింటాం—అందుకే ఆడవాళ్ళ నోటిలో నువ్వు గింజకూడా నానదంటారు.

వీళ్ళలో కొంతమంది మహాతల్లులున్నారు. వాళ్ళకు చేతులెత్తి నమస్కారం చేయవచ్చు.

"మాశావా పేరమ్మ! అన్యాయంగా పాపం నీవు మోసపోతున్నావు" అంటూ అమ్మాయిగన్న తల్లి ఐతే అబ్బాయిమీద కొన్ని చాడీలనో, అబ్బాయినిగన్న తల్లి అయితే, అమ్మాయిదగ్గర చెడ్డబుద్ధులూ, చెడ్డ సహవాసాలున్నాయనో చెప్పి, మనసు విరగగొట్టి పీటలమీద పెళ్ళిళ్లు చెడగొట్టే మహాతల్లులున్నారు.

"అయినా ఆయనకేం దరిద్రం! అంత అల్పంగా కట్నాలిస్తాడా! ఎంత మీరు మంచివారైతే మాత్రం అంటూ జాసిగా కట్నం అడగమని చెప్పి తమకు ఒకవేళ పెళ్ళివాళ్లు విరోధులైతే పీటలమీద పెళ్ళి చెడగొట్టే మహానుభావులున్నారు.

ఇక ఇంక కొంతమంది కనిపిస్తారు. అప్పుడెప్పుడూ మనం అడగకుండానే వాళ్ళంతట వాళ్లు సహాయపడతారు. అవసరంగా మన వలన వాళ్ళు లాభపడకుంటే వెనక మనలను ముఖంమీద అడగటమే కాకుండా ఉన్న పరపతిగూడా పోగొట్టే మహానుభావులున్నారు.

ఏది ఎలా ఉన్నా ఇలా మహానుభావులను మొదటనే పసిగట్టి.

ఏమి ముదిరిందిరా? అని చనువుగానో.

"ఏమమ్మోయ్! మరీ అంత బెట్టయితే మేమెలా చేస్తాం!" అనో మొదలుపెట్టడం వాళ్ళకు అలవాటు. పోతూపోతూ ఏపనైనా చేయించుకోవడమో, లేక ఏవాటిలో పరకో అప్పుగానో, యాచనగానో పట్టుకపోయే మగమహానుభావులకూ—

"అమ్మాయ్! ఎక్కడే అంటూ ఆప్యాయత ఒలకపోస్తూనో"—

"ఏమి పనే ఎప్పుడూ ఏదో చేస్తూనే ఉంటావ్. అంత మరీ కష్టపడకు!" అంటూ పరాచికాలాడుతూనో—

"విన్నావా! ఎంత ఆస్తి ఉంటేమాత్రం ఆవిడగారికి అంత అహమా!" అంటూ ఇతరుల ఊసెత్తుతూనో...

మొదలుపెట్టూ, అరకొరమో, అవాలో. కాఫీ పొడో, చక్కరో, లేక బేడ, పావలా, చేబదులో తీసుకొని ఎగవేసే మహాతల్లులకు,

వందనాలు, ఎందరో మహానుభావులూ, మహాతల్లులూ, అందరికీ వందవందనమస్కారాలు. మా జోలికి రాకండి. మా బ్రతుకు మమ్మల్ని బ్రతకనివ్వండి- మీరు కొంపలకు నిప్పు అంటించకుంటే ఉపకారం చేసినంత పుణ్యం, నన్ను మాత్రం తిట్టకండి. మళ్ళీ నమస్కారం పెడ్తాను. క్షమించండి!



# మగువలు-ముస్తాబులు

రామచంద్రుని సుందరిదేవి

ప్రతి స్త్రీ తనకున్న దాంట్లో అందముగా ముస్తాబు అవుటకు కోరుతుంది. స్త్రీలు అలంకారం చేసుకోవడం తప్పనలేను గాని అది వెర్రితలలు వేసినప్పుడే వస్తుంది చిక్కు. మన అలంకరణ మన సంస్కృతికి పతన చిహ్నంగా ఉండకూడదు. మన నాగరికతను ప్రతిబింబించేట్టు వుండాలి.

మరీ చిన్న పల్లెటూళ్ళలో లేదుగాని, ఒక మాదిరి బస్తీల్లోను, పెద్ద పట్టణాల్లోనూ కొందరు స్త్రీల ముస్తాబు చాలా ఎబ్బెట్టుగా ఉంటోంది. ముఖ్యంగా కాలేజి విద్యార్థినుల డ్రెస్ చూస్తే వాళ్ళేదో బ్యూటీ పారేడ్‌కి వెళ్తున్నట్టుంటుంది గాని విద్యార్జనకు కళాశాలకు వెళుతున్నట్టుండదు. అసలు వీధిలో కనబడితేనే ఏదో వింత మృగాన్ని చూచినట్లు చూసే పురుషులకు వీళ్ళను ఏదో మాట అనాలనిపిస్తుంది. అయితే అందరు కాలేజీ విద్యార్థినులు అలాగే ఉంటారని గాదు నా ఉద్దేశం. అలా ముస్తాబయి కాలేజీకివెళ్ళి విద్యార్థులచేత నానా మాటలుపడి సిగ్గుపడ్డవాళ్ళని నా కళ్ళతో నేను చూశాను. అలాగని చాలా మర్యాదగా, అతి సామాన్యంగా పోయే విద్యార్థినిని ఏమీ అనరని గాదు. తోటి విద్యార్థులు తోటి విద్యార్థినులను గౌరవంగా చూడలేరంటే అది మన దురదృష్టం. పాశ్చాత్య దేశాలవలె పురుషుడు స్త్రీని సమానంగా గౌరవించిన నాడు ఏ చిక్కులూ ఉండవు. ఆ మార్పు రావడానికి ఇంకా రెండుతరాలు పోవాలి. ఇది చదివి కాలేజీ విద్యార్థినులు నామీద దండెత్తకుందురు గాక! అందరినీ గాదు నేను వ్రాసింది. కొందరినే.

ఇప్పుడు వచ్చే 'ట్రాన్స్‌పరెంటు' గుడ్డలు నిజంగా స్త్రీలపరువే పోగొడుతున్నాయి. నైలాన్ గుడ్డలు చూస్తే, కథల్లో చదివిన దేవతావస్త్రాలు జ్ఞాపకం వస్తాయి. ఇలాంటి డ్రెస్‌లు చేసుకొని, పురుషులను నిందిస్తే ఏం ప్రయోజనం? అలాగని వారిని వెనకేసుకొస్తున్నాననుకోగూడదు. ముందు స్త్రీలలో ఉండే లోపాలు దిద్దుకోవాలి. ఈ విపరీతమైన ముస్తాబు సినిమాలనుంచి కొంచెం సంక్రమిస్తోంది. సినిమా తారలయినా తెరమీద ఆడేటప్పుడు మాత్రమే ఇలాంటి జుగుప్సాకరమైన డ్రెస్సులు వేస్తారు గాని, వారినే పబ్లిక్ ఫంక్షన్సులో చూడండి కంచీవరం పట్టుచీర కట్టుకొని నిండాకప్పుకొని చాలా మర్యాదగా కనిపిస్తారు.

ప్రతి స్త్రీ గూడా ఉన్న వయసుకంటే చాలా చిన్నదిగా కనపడాలని తాపత్రయపడుతుంది. గాని ఏ వయసుకు తగ్గ ముస్తాబు ఆ వయసుకు ఉంటేనే అందం. మాకు తెలిసినావిడ అంది దాదాపు ముప్ఫైఆరు ఏళ్ళుంటాయి. ఇంక ఆవిడ అలంకరణ చూడాలి! రెండుజడలు జడకుచ్చులు పెట్టు (సవరంజడే లెండి) ఒకడబ్బా పౌడర్ ముఖానికి చాలా అసహ్యంగా ఉంటుంది.

అదే ఏ బిహోడానో చుట్టుకుంటే చాలా బాగుణ్ణు. అనూటంటే మీదబడి కరిచేయదూ!

40,45 ఏళ్ళ స్త్రీలు లిప్‌స్టిక్, హేండ్ బాగ్, హైహీల్సు వేసుకొని విపరీతమైన ముస్తాబయితే, వాళ్లు పదహారేళ్ళ కన్యల్లాగా ఉండరు సరిగదా, చాలా జుగుప్సాకరంగా ఉంటుంది. వాళ్ళంటే పూజ్యభావం పోయి ఏహ్యభావం కలుగుతుంది. మనిషి ప్రవర్తన, శీలం ఎంత మంచిదైనా డ్రెస్, ముస్తాబు విపరీతంగా వుంటే, ఆ మనిషిమీద గౌరవభావం ఉదయించదు సరిగదా అశ్లీలమైన మాటలు కూడా పడాల్సివస్తుంది, సోదరీమణులంతా కూడా ఇలాగే ఉన్నారని గాదు నా తాత్పర్యం. కొందరిగురించే రాసింది. ఇందులో అతిశయోక్తి ఏమీ లేదు. అందరికీ తెలిసిన నగ్న సత్యం. 






# ★ ఉత్తరాలు ★

(2-వ పేజీ తరువాయి)

"జలజ" గారు, "భారతి - బొంగడ పూలు" (9-9-59) లో "పందిట్లో పెండ్లవుతున్నాదీ... అనే లీల పాట శ్రావ్యంగా వినిపిస్తోంది" అని వ్రాసినారు. అది సినిమా లోదే అని వారి భావమైతే ఆ పాట పాడిన వారు లీల కాదు, జిక్కి అని గ్రహించాలి. ఎవరు పాడేరో సరిగా తెలియకపోతే "అనే పాట శ్రావ్యంగా వినిపిస్తోంది" అని వ్రాస్తే సరిపోతుందికదా!

అంగర శ్రీనివాసరావు, ఆలూరు.

మేనరికాల్లోని అవకతవకలను బాగుగా విమర్శించి పత్రిక ద్వారా వనితాలోకానికి అందజేసిన రచయిత్రికి నాగరత్నమ్మగారికి నా అభినందనములు.

కొల్లే. లక్ష్మీపతి, తిరుపతి.

ఇంకా ఏం మేనరికాలు ఏమంత బాగుగా లేదు. మేనరికాలు మంచివి కావని దృష్టిలో పెట్టుకొని వ్యాసము వ్రాసినటులున్నాది. ఏదో ఒకటి, రెండు సంఘటనలు జరిగాయి అంటే జరక్కపోతాయా. యిది లోకంకదూ.

ఎం. రాం, నెల్లూరు.

మేనరికం అనే మిషతో పెండ్లిండ్లకు తల్లిదండ్రులు జరిపే ఉపద్రవాలనే చక్కగా వర్ణించారు. మేనరికం చేయుటమనేది ఒక విధిగా కాక బాధ్యతగా గుర్తించాలని వ్రాసి, పెండ్లికూతురు తల్లిదండ్రులనే వెనుక వేసికొని రావటము శోచనీయము.

ఎస్. అబ్దుల్ జలీల్, తిరుపతి.

వెనుక ముందు చూడకుండా యిటువంటి సంకుచితమైన అభిప్రాయాలు వెలిబుచ్చినందుకు చాలా నిరుత్సాహంగా వుంది. 'మేనరికం' అనేది మన సంస్కృతిలో చిరకాలం నుంచి వస్తున్న సాంప్రదాయం. రామాయణ, భారతాలు యెంత పురాతనమైనవో అంతకంటే పురాతనమైనది యీ సంప్రదాయం.

'మేనరికం' లో కల పవిత్రత నాడు, నేడు, యేనాడూ ఉంటుంది. ఎటొచ్చీ అతి నాగరికత వల్ల మనం మూలాలు పట్టి దాన్ని గుర్తించలేకపోతే అది మనయొక్క అపరాధమే.

'విశాఖ' ఏలూరు.

రచయిత్రి స్త్రీజాతి సహజ పక్షపాతబుద్ధి ప్రదర్శించారు. గుణవంతుడు విద్యావంతుడు ఐన మేనల్లుడికి స్థితి తక్కువనే నెపంతో పిల్లను ఇవ్వని ఘటనలు, లేక పిల్లనిచ్చి గయ్యాళి భార్య, అత్త (ఎక్కువగా మేనమామ భార్య అయిఉంటుంది) అల్లుడిని హీనంగా చూసే సంఘటనలు కూడా సగానికి సగము ఉంటాయని రచయిత్రి గమనిస్తే సంతోషము.

ఇ భాస్కరరావు, తెనాలి.

"ఇంకా ఏం మేనరికాలు!" వ్యాసం ఏమీ బాగులేదు. వారు వ్యక్తం చేసిన భావాలతో నేను ఏకీభవించలేకపోతున్నాను. వారు వ్రాసిన అనర్థాలన్నీ ప్రత్యేకం మేనరికాలలోనే కాక, బాగా ఆలోచించకుండా చేసిన అన్ని పెండ్లిండ్లలోనూవున్నాయి. వారి పెద్దతండ్రి కొడుకు విషయంలో అలా జరిగిందని అన్ని మేనరికాలలోనూ అలా జరుగుతుందని అనుకోవడం చాలా పొరపాటే అవుతుంది.

అయ్యగారి సరళాచల్లిక (కాకినాడ)

"ఇంకా ఏం మేనరికాలు!" అనే వ్యాసం వ్రాసిన వారిపై చాల జాలి కలిగినది. వారి పెద్దతండ్రి కొడుకు మేనరికం చేసుకొని సుఖపడలేదనే విచారముతో ఏదో వ్రాసినట్టున్నారు. మేనరికం కాదు గదా ఇంకే 'రికం' యైనా వధూవరుల ఇష్టానిష్టాలు గుర్తించకుండా, వివాహం చేస్తే అనర్థాలు తప్పవు. మనఃస్పర్థలు ఏర్పడుటకు మేనరికమే అవసరము లేదు...

బసవరాజు, హైదరాబాదు.

మేనరికాలు గూర్చి చక్కగా విశదీకరించినారు. సాధారణముగా చాలమంది (నాకు పరిచయమైన వాళ్ళలో) మేనరికాలను యిష్టపడరు. తల్లిదండ్రుల పోరు పడలేక, వారిని ఎదిరించు సామర్థ్యము లేకను స్త్రీలు తలవంచెదరే కాని మనస్ఫూర్తిగా కాదు. ఇంక పురుషులంటారా అమ్మాయి నచ్చితే సరిసరి. లేకపోతే ఆ స్తోమతైతే ఆ సంబంధమునకు యిష్టపడరు. లేకపోతే దగ్గరి దాక్షిణ్యము లేక నిర్మొహమాటంగా అక్కరలేదని చెప్పివేస్తారు.

సరోజ, రేణిగుంట.

వ్యాసము చివర, నేను స్త్రీకూడ పురుషునితో బాటు సమాన విద్యావంతురాలను మున్నది కాబట్టి ఇలాంటి ఉపద్రవములు రాకుండ సోదరీమణులు ముందుగ నే జాగ్రత్త పడుట మంచిదని వ్రాశారు. ఈ ఒక్క వాక్యమువలన వారి వ్యాసము యొక్క అందమే పోయినదని నా అభిప్రాయము. ఈ వాక్యమునుబట్టి మేనరికంలో ఒకవేళ పిల్ల విద్యావంతురాలై వరుడు విద్యావిహీనుడయిన ఆ సంబంధమును నిష్కరించవచ్చున్న మాట! ఇదే నాకు చాలా బాధకలిగించినది.

కె. గిరిజ, (బళ్ళారి.)

* * *

సరళగారు ఇచ్చిన సలహాలలో కొన్నిటితో నేను పూర్తిగా ఏకీభవించలేను. హైలాను, క్రేప్ చీరలు కట్టినంతమాత్రాన వారివద్ద పద్ధతి, నమ్రతలు లేవని అనలేము. చిన్నతనములో (అనగా కాలేజిలో చదివే రోజులలో) అలంకరణమీద, ఫాషనుమీద మోజు ఉండటము సహజమే. అంతమాత్రాన వారంతా పద్ధతి లేనివారని అనగలమా!

కె. ఇందిర (హైద్రాబాద్.)

**జవాబు**

గోవు సాధువు. పొట్లఆవు గోవే. కాని పొట్లఆవు సాధువు అనలేము.

ఒక స్త్రీజాతికి చెందిన కి యోపాత్రానూ ఫ్లారెన్స్ నైటింగేల్ను, లేదా మేడమ్ డిఫార్జినీ, జోన్ ఆఫ్ ఆర్కని నేను ఒకటిగా చూడలేను.

శ్రీమతి తాతినేని హేమాదేవిగారు గతవారం అడిగిన ప్రశ్నకు ఇదే నాసమాధానం. నాతల్లినిగాని మరిచల్లని తల్లినిగాని దృష్టిలో పెట్టుకొని చూస్తే 'ప్రళయాంతకః' అనే పదానికి 'ప్రళయాన్ని అంతం చేసేది శాంతిప్రదాత' అని నేను అర్థం చెప్పుకుంటాను. అప్పుడు ప్రళయబుద్ధుల కర్తృత్వం మరింతవర్ణంగా కన్పిస్తుంది నాకు బాబ.

ఇక్ష్వాకులనాటి ప్రవచనం 'స్త్రీబుద్ధిః ప్రళయాంతకః' ఈ విమర్శలకు సమాధానముగా ఆ ఇక్ష్వాకులనాడే 'ప్రత్యాన ముపమాం కృత్వా' అన్న వాల్మీకిని ఒక్కమారు స్మరిస్తాను.

రామరాజామాత్య.

క్రీడారంగం:

# డేవిస్ కప్

డేవిస్ కప్పు పోటీలను 1955 నుంచి 1957 దాకా ఆస్ట్రేలియా దేశమే గెలుస్తూంది. ఐతే 1958వ సంవత్సరములో మాత్రం అమెరికా దేశం గెలిచింది. ప్రస్తుతం వింబుల్డన్ ఛాంపియన్ అయిన అలెక్స్ ఆల్మెడో మూలంగానే అమెరికా దేశం డేవిస్ కప్పు పోటీలను గెలిచింది. ఆల్మెడో 1958లో ఆస్ట్రేలియా ప్రతినిధులైన కూపర్ ఆండర్సన్‌ను ఓడించారు. అయితే ఈ ఏడాది జరిగిన డేవిస్‌కప్పు పోటీలలో ఆస్ట్రేలియా తిరిగి తమ ఆధిక్యతను నిరూపించుకొంది. ఆస్ట్రేలియా ప్రతినిధియైన ఫ్రేజర్ తన రెండు సింగిల్స్‌ను గెలిచారు. ఆస్ట్రేలియా జట్టువారు డబుల్స్ నెగ్గి ఒక మాచ్ తేడాతో (3-2 స్కోరుతో) అమెరికా దేశాన్ని ఓడించారు.

మొదటి మాచ్‌లో ఫ్రేజర్ ఆల్మెడోను 8-6, 6-8, 6-4, 8-6 స్కోరుతో ఓడించారు. ఫ్రేజర్ సర్వీసులో ఇతోధికమైన నైపుణ్యమును ప్రదర్శించారు. రెండవ మాచ్‌లో భారీమెక్కారాడ్ లేవర్‌ను 7-5, 6-4, 6-1, స్కోరుతో ఓడించారు. డబుల్స్‌లో ఆస్ట్రేలియా ప్రతినిధులైన ఫ్రేజర్, ఎమర్సన్‌లు అమెరికా జట్టు ఆటగాళ్ళైన ఆల్మెడో, ఎర్ల్‌బ్యుఖాల్జ్‌లను 7-5, 7-5, 6-4 స్కోరుతో ఓడించారు. ఎర్ల్ బ్యుఖాల్జ్ వయస్సు 18 సంవత్సరములు. ఇంతవరకు ఇంత చిన్న వయస్సులో దేశపు ప్రతినిధిగా డేవిస్ కప్పుపోటీలలో ఎవరు పాల్గొనలేదు.

నాల్గవ మాచ్‌లో ఆల్మెడో, లేవర్‌ను 9-7, 4-6, 12-10, స్కోరుతో ఓడించారు. వీరిద్దరు చాల పట్టుదలతో ఆడేరు. వీరిమాచ్ 3 గంటల 20 నిమిషాలు పట్టింది. డేవిస్ కప్పు పోటీలలో ఇంతవరకు ఎవరి మాచ్ ఇంతసేపు పటలేదు.

అయిదవ మాచ్‌లో ఫ్రేజర్, మెక్కాని, 8-6, 3-6, 6-2, 6-4, స్కోరుతో ఓడించారు. వీరిద్దరి ఆట ఉన్నతిమైన స్థాయిలో వేగంగా సాగింది. ఈ డేవిస్‌కప్పు పోటీలలో ఫ్రేజర్ ఒకమాచ్ కూడా ఓడిపోకుండా ఆడిన వన్ని గెలిచారు.

## ఫుట్ బాల్

కాబూలులో జరిగిన ఫుట్‌బాల్ టోర్నమెంటులో భారతజట్టు 3 గోల్స్ తేడాతో స్కోరు (5-2) ఆఫ్ఘనిస్థాన్ జట్టును ఓడించారు. భారతదేశజట్టు ఆటగాళ్ళ కోచ్ అయిన రహీము మనవారు బాగానే ఆడారు, అన్నారు. ఆఫ్ఘనిస్థాను ఆటగాళ్ళను ఏడాదినుంచి ఒక జర్మన్ దేశస్థుడు, ఒక టర్కీ దేశస్థుడు తర్ఫీదు చేస్తున్నారు. అయినప్పటికి వీరు భారతదేశ జట్టువారి ధాటికి ఆగలేక పోయారు. ఆట మొదలుపెట్టినప్పటి నుంచి మనవారికే పైచేయి. గోలులోకి బంతిని తన్నడంలో కొంచెము ప్రజ్ఞను కనబరచివుంటే భారతదేశ జట్టు ఇంకా చాలా తేడాతో నెగ్గి వుండవచ్చు.

## టేబుల్ టెన్నిసు

ఇటీవల హైదరాబాద్ వై. ఎమ్. సి. ఎ. వారి ఆధ్వర్యాన టేబుల్ టెన్నిసు పోటీలు జరిగాయి. సీనియర్ సింగిల్సు పోటీలలో కె. రామకృష్ణ, అజమ్‌ను 15-21, 21-13, 21-14, 22-20 స్కోరుతో సునాయాసంగా ఓడించారు. రామకృష్ణ టేబుల్ టెన్నిసులో ఇండియాలో 6వ ఆటగాడుగా పరిగణింపబడ్డారు.

—రావు



# చదరంగం

## సమస్య 7

**రచన: జె. ఇ. డ్రైవర్**

**తెలుపు 10**



**నలుపు 11**

**తెలుపు ఆడి మూడెత్తులలో ఆటకట్టాలి.**





# న్యూఢిల్లీ లేఖ



(7వ పేజీ తరువాయి)

కోరారు! దానితో జాతీయాభివృద్ధి కార్పొరేషన్ అత్యవసరసమావేశం ఏర్పాటు అయిందికూడా. ఈ సమావేశం ప్రారంభిస్తూ ప్రధానమంత్రి ఆహార సమస్యపట్ల దేశపరంగా దృష్టి కేంద్రీకరించాలని—ఇది దేశంమొత్తం ఎదుర్కొంటున్న పెద్ద సమస్య అనీ వచించారు. 'భర్తీ', 'లోటు' రాష్ట్రాలక్రింద రాష్ట్రాలన్నీ విడిపోయి ప్రభుత్వ పరంగా ఆహారధాన్యాల విక్రయం కావాలని కొన్ని వద్దని, కొన్ని ఆందోళన చేస్తున్నాయి.

దేశభద్రత దృష్ట్యా భర్తీ రాష్ట్రాలు లోటు రాష్ట్రాలతో అదనపు గింజలు పంచుకోలేమంటూ కూడా చెబుతున్నాయి. దేశం మొత్తంమీద ఒకే ధరకు ఈ రాష్ట్రాలు వైముఖ్యం ప్రకటిస్తున్నాయి కూడా.

నాగపూర్ 'త్రిపిటకాలు' ప్రభుత్వ ధాన్య విక్రయం, భూవసతి గరిష్ఠ పరిమితి, సహకారసంస్థలు వీటిపట్ల ఈ భర్తీ రాష్ట్రాలు చాలా శ్రద్ధలు చూపిస్తూవుండటం ఒక విశేషం! అస్సాంలో కొన్ని సహకారవ్యవసాయ సంస్థలు జయప్రదంగా నడుస్తున్నాయని ప్రణాళికా సంఘసభ్యులు ఆనందిస్తున్నారు.

శ్రీ జైన్ రాజీనామా యిచ్చినా విఫలమైన ప్రభుత్వ ఆహారవిధానం అలాగే కొనసాగుతుందన్నమాట!

ఒకవైపు పంజాబు గవర్నర్ శ్రీ ఎన్. వి. గాడ్గిల్ ఉన్నట్టుండి ప్రభుత్వ ధాన్య విక్రయం సరికాదంటూ ఒక ప్రకటన చేశారు. పార్లమెంటరీ అధికారంక్రింద గల కమిటీలలో సభ్యత్వం వహిస్తూ ప్రకటనలు చేసి విమర్శనుంచి రక్షణ కోరటం గవర్నర్లకు తగదని లోకసభ స్పీకర్ గట్టిగా హెచ్చరించారు కూడా.

సామాజికాభివృద్ధి మంత్రిత్వశాఖ చాలా సమర్థంగా పనిచేస్తున్నదని ప్రధానమంత్రి ఉదారంగా ఒక యోగ్యతాపత్రం ఇచ్చారు. అయితే వినవస్తున్న విమర్శలను ఆయన గుర్తించలేదని అనగలమా? ప్లానింగు ఉపమంత్రి ఇతరుల సాయ్యం అవసరంగా వ్యయం చేయగలరు. ఆయన ఆధిపత్యంలో సామాజికాభివృద్ధిని మనం పరిశీలిద్దాం!★

# తెలుగు సినిమా

సినిమా పరిశ్రమ నిత్యకల్యాణం పచ్చతోరణంగా కళకళలాడుతూ కనిపిస్తున్నది. తారలకు అభినందనలు పరంపరగా వస్తున్నాయి. క్రొత్త కంపెనీలు తామరతంపరగా పెరుగుతున్నాయి. క్రొత్త చిత్రాలు ఎన్నో దేశం మీదకు వస్తున్నాయి. ఎన్నిటినో ఓహో అంటున్నారు. ఇంకా ఎన్నిటినో ఓహో అనటంలేదు. కొన్నిటికి ఎంతగా లాభాలు వస్తున్నాయో మరికొన్నిటికి అంతగా నష్టాలు వస్తూవున్నాయి. సినిమా పరిశ్రమ సుడిగుండంలో ఉంది అని అటువంటి సమయంలో కొందరు అంటున్నారు.

ఇలా ఎందరెందరో నష్టపడుతున్నా పరిశ్రమ అంతా సందడిగానే ఉంటోంది. క్రొత్తవాళ్లు ఎందరో ఉత్సాహంగా వస్తున్నారు. కోడంబాకం రోడ్ల మీద ప్రొడక్షన్ కార్లధూళి పొగమంచులా సినిమా వాతావరణాన్ని నింపివేసింది. అందువల్ల ఏది ఉత్సాహమో ఏది నిరుత్సాహమో స్పష్టంగా చెప్పలేకపోతున్నారు. ఏది మంచిదో ఏది చెడ్డదో తెల్పలేకపోతున్నారు.

ఈ స్థితిలో—

ఒక రోజున

వాహినీ స్టుడియోలో ఒక పిక్చరు షూటింగుకి వెళ్లాను. రావలసిన ముఖ్యులలో ఒకరిద్దరు రానందువలన ఆరుబయట కుర్చీలు వేసుకుని కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నాము, నేనూ, ప్రొడ్యూసరుగారూ, డైరెక్టరుగారూను.

అంతలో ఒక యువకుడు చాలా ఉత్సాహంగా వచ్చాడు. కూర్చోమని కుర్చీ చూపించారు ప్రొడ్యూసరుగారు. ఆయన కూర్చుని కూట్లాటేలా కనిపించలేదు. ఆయనలో పట్టరాని ఉల్లాసం, చైతన్యం ఉప్పొంగి పోతూ వున్నాయి.

"కూర్చోడానికేం గానీండి, మనం బ్రహ్మాండమైన పిక్చరు — టెన్ కమాండ్ మెంట్స్ మళ్లీ లార్జి స్కేల్ లో తియ్యాలండీ. డబ్బు సంగతి నేను చూస్తాను. ఏం మనకేమటుకు లేవా? భారతం, రామాయణం. భారతంలో ఏ ఒక్కఘట్టమైనా తీసుకొంటేచాలు. థండరింగ్ పిక్చరు తియ్యొచ్చు. తియ్యొచ్చు కేమిటి తియ్యాలి" అన్నాడాయన ఆవేశంతో.

నా పక్కనేవున్న ప్రొడ్యూసరుగారు అదోమాసగా నవ్వారు.

"తీద్దాంలే ముందరకూర్చో"అని కూర్చోపెట్టి, "అంతంత పెద్దప్రాజెక్టులు మనమెక్కడ చెయ్యగలమోయ్. తాడు బొంగరం ఒక్కసారి పట్టుకో లేనివాళ్ళం" అన్నాడు.

డైరెక్టరుగారుకూడా ఏకీభవించి, మనం ఈ మామూలు పిక్చర్లు మామూలుగా టైముకి తీసి అవతలపడేస్తే టెన్ కమాండ్ మెంట్స్ లాటివి టెన్ పిక్చర్లు తీసినంతగొప్ప అన్నారు.

* * *

నాకు ఆశ్చర్యం కలిగింది. మనం ఇది చేయాలి అదిచేయాలి అని ఉబ్బొంగి పడుతున్న ఆ యువకుడి ఆవేశం ఏమిటి— ఇటు దానికి అడ్డకట్టలు వేసి, మనం చేయలేము అని నిరుత్సాహపరచే ఈ 'అనుభవం' ఏమిటి! కష్టసుఖాలూ సుడివు బడివుల్లో, ఉపాయాలన్నీ ఆకళింపు చేసుకున్న పెద్దలు, తమకున్న అనుభవంతో ధైర్యంగా ఒకపని చేయగలంఅని చెప్పవలసి ఉండగా, అలాకాక అందుకు విరుద్ధంగా ఇలా ఎందుకు మాట్లాడారు! వీళ్లు అసమర్థులా! ...ఎంతమాత్రం కాదు అని వారిచిత్రాలు నిరూపిస్తున్నాయి.

రోజులు మారిన కొద్దీ, మన పరిశ్రమ వర్ధిల్లి పెద్దది అయిన కొద్దీ వాటితో పాటు వాటికితగినట్లే పరిస్థితులు కూడా మారుతున్నాయి. ఒక పదేళ్ళక్రితం పరిస్థితులను తల్చుకుని, ఈనాటి స్థితిగతులను పరిశీలిస్తే ఈ తేడా బాగా బోధపడుతుంది ఒక్క విషయం. ఫిలిం ఇండస్ట్రీలో ఉండే సమస్యలు అవస్థలూ నిజానికి ఆ ఫిలిం ప్రేక్షకులకు సంబంధించినవి కావు. కాబట్టి ఇవన్నీ ఇక్కడ వివరించి వినిపించడం భావ్యం కాదు. అయినా ఫిలిం పరిశ్రమలో ఉండే సౌకర్యాలను బట్టిపరిస్థితులను బట్టిఇక్కడ నిర్మించబడిన చిత్రాలు కూడా ఉంటాయి కాబట్టి, సంగ్రహంగా వాటికి కారణాలు అయిన స్థితిగతులను వివరిస్తాను.

ఎన్.టి.రామారావు

### నిన్న

పూర్వం-అంటే మరీ ప్రాచీన కాలంలో అని కాదు పది పన్నెండు సంవత్సరాల క్రితం, చిత్రనిర్మాణం ఇంకోవిధంగా ఉండేది. అప్పుడు నటులు చాలా వరకు, నిర్మాత పోషించే బసలలో ఉంటూ వాళ్లతో పాటు తింటూ తిరుగుతూ రోజులతరబడి కథ గురించిన చర్చలు వింటూ దానిగురించి, అందులో తమ పాత్రగురించి ఎక్కువగా ఆలోచించేవారు. రిహార్సలు అనేదికూడా అపరికాలంలో జరుగుతూ ఉండేది. ఆలోచించడానికి కథ తయారై ఉండేది. అర్థం చేసుకోడానికి పాత్రపు నిర్దిష్టమైన రూపకల్పన జరిగి ఉండేది. ఆలోచించడానికి టైమూ ఉండేది. అనుకూలమైన వాతావరణమూ ఉండేది. ఆనాడు నిర్మాతకు తీస్తున్న చిత్రంమీద, చేస్తున్న పనిమీద భక్తిగౌరవాలు ఉండేవి. నిర్మాత, డైరెక్టరూ, టెక్నీషియన్లూ తీసుకున్న కథమీద శ్రద్ధపెట్టి పనిచేసి అన్ని విధాలతోను స్క్రిప్టు వ్రాసుకునేవారు. ఈ చిత్రంలో పనిచేస్తున్న వారందరిభవిష్యత్తూ, ఈ చిత్రం భవిష్యత్తునూ చేతుల్లో ఉందని యూనిట్‌లో ప్రతిఒక్కరూ నమ్మేవారు. అంటే సహృదయంతో నమ్మేవారు; అహంకారంతో కాదు. అలానమ్మి ఆచిత్రం బాగు కోసం తమశక్తివంచన లేకుండా కృషిచేసేవారు. ఒకవేళ అహంకారమే ఉన్నప్పటికీ నిజంగా పనిచేస్తే అదిఉన్నా తప్పులేదేమో.

### ఇవాళ

హాలీవుడ్‌లో ప్రాధాన్యతఅంటే, సినిమాలో విశేషమైన అనుభవం ఉంటుంది. అన్నీ తెలుసుకుంటాడు. డబ్బు పెట్టుబడి పెడుతున్నందుకు, తనకు కావలసినది చెప్పి చేయించుకోగలుగుతాడు. ఈ రోజున తెలుగు పరిశ్రమలో నిర్మాతను హాలీవుడ్ నిర్మాతతో పోల్చడం సులభంకాదు.

సినిమా తీయడానికి పెట్టుబడిపట్టుకురాగలగడమే నిర్మాత అవడానికి ముఖ్యమైన అర్హత అనే పరిస్థితి ఇప్పుడు వుంది. దీన్ని బట్టి నిర్మాతకు సినిమాసాంకేతికబాధకాల గురించిన, అనుభవంగాని, మంచిచెడ్డలను గురించిన ఇంకా చెప్పాలంటే, టెక్నికల్ విషయాలను గురించిన పరిజ్ఞానంగాని ఉండనక్కరలేదన్న అభిప్రాయం



 # తెలుగు సినిమా 

కూడా ఉన్నట్లు కనిపిస్తోంది. ఈ మాటని ఎవరూ ఒప్పుకోనకపోవచ్చు. కాని నిజస్థితి ఒప్పుకొంటుంది. పరిశ్రమ మనుగడకు ముఖ్యులయిన నిర్మాతలపట్ల ఇది విమర్శ కాదు. అందరిపట్లా అంతకన్న కాదు. కాని చాలామంది నిర్మాతగురించి ఈ అభిప్రాయంతో వీ ఉన్నారనీ, ఈ అభిప్రాయంతోనే పరిశ్రమలోనికి వస్తున్నారనీ అనడం అబద్ధం కాదు. కనుక, మన ధోరణులనూ పరిశీలిస్తున్న పెద్దలు కొందరు కూడా ఈవిధంగా అనడం జరిగింది. చిత్రనిర్మాణంమీద ఇంత చిన్నచూపు తగదన్న బాధతోనే నేను ఈ మాట వ్రాస్తున్నాను.

ఇటువంటి దృక్పథంవల్ల జరుగుతున్న దేమిటి?

మంచి కథలు మంచి చిత్రాలుగా రూపొందలేకపోవడం; అలాగే ఎందరో కళాకారుల కృషి సంపూర్ణ ఫలితాలు సంపాదించలేకపోవడం. చిత్రాలు నష్టపోవడం. విమర్శలకు గురికావడం.

దీనికి ఇదొక్కటే కారణం కాకపోవచ్చు. కాని ఇది ఒక కారణం. వందమందితో పని అయినపుడు తొంభై కారణాలు ఉండడం అసహజం కాదు.

ఇంతకీ నేను చెప్పవచ్చిన మాట.... ఈరోజున సినిమా తీయడానికి కథ ప్రాముఖ్యాన్ని, స్క్రిప్టు పూర్తిగా మొట్టమొదటే వ్రాసుకోవలసిన అవసరాన్ని గుర్తించడం లేదు.

సినిమా లక్షలమందిని ఆకర్షించవలసింది కాబట్టి రకరకాల అభిరుచులు లెక్కపెట్టుకొని మూలంగా ఒకదానికో రాయి విసురుతారు. మంచి కథ, సంగీతం, నృత్యాలు, హాస్యం యుద్ధాలూ వగైరాలు.

ఈరోజున, చాలామంది నిర్మాతలు వీటి గురించి కూడా అలాటే పట్టించుకుంటూన్నట్టు కనబడటం లేదు. నాగేశ్వరరావు, రామారావు, రంగారావు, రేలంగి, గుమ్మడి, అంజలీదేవి, సావిత్రి వీళ్ళనే రాళ్ళుగా విసరాలనే అభిప్రాయంతో ఉన్నట్టు కనిపిస్తోంది. ఏదో ఓ రాయి తగలదా జాక్‌పాట్‌కి అని. ఈ దృక్పథవల్ల కథ సరిగ్గా ఉండదు. పాత్రలు సరిగ్గా ఉండవు. చివరికి ఫలితాలూ బాగా ఉండటంలేదు. అంతా లాటరీగా ఉంటోంది. ఒక చిత్రానికి, ఒక నిర్మాతకి దెబ్బ తగిలితే, నిజంగా ఆ దెబ్బ పరిశ్రమకీ, పరిశ్రమ భవిష్యత్తుకీ, కూడా దెబ్బే అని గ్రహించాలి.

అయితే ఒకటి. ఒక చిత్రం ఆరంభించిన తరవాత, విడుదలచేసి లాభం గడించేవరకూ, ఎక్కడ నష్టం వస్తుందో అని భయపడని నిర్మాత ఉండడు. అది నిజమే. అయినా ఈ భయాన్ని ఏమార్గంలోకి మళ్లిస్తున్నారు? భయంకొద్దీ కథ జాగ్రత్తగా తయారుచేస్తున్నారా? భయంకొద్దీ స్క్రిప్టు పూర్ణంగా వ్రాసుకుంటున్నారా? డైలాగులు సిద్ధం చేసుకుంటున్నారా? లేదు. చాలామంది విషయంలో జరిగేది ఇది కాదు. చాలమంది భయంకొద్దీనే ఫలానా కథ మనది అనిముందు నిశ్చయించుకోటం లేదు. హిట్ అయిన పిక్చరులోని, మద్రాస్‌లో ఆడే అమెరికన్ పిక్చర్లలోని, బొంబాయి చిత్రాలలోని మెలికలు, స్టంటులు, సెట్‌లు, పాటలు ఇలాగ ఎందులో ఏది కంటికి నదురుగా ఉంటే అది తీసుకుని ఈ పిక్చరులో కలిపేస్తారు. చివరకి ఫలితం ఎలా తయారవుతుందో వారే ఊహించగలరు. ఊహించేదేముంది - కొన్ని కొన్ని తెలుగు సినిమాలే చూపిస్తున్నాయి. ఇలా అవీ ఇవీ కలగాపులగం చేయడంవల్ల కథ ఒక పద్ధతిలో ఉండదు. అందులో సన్నివేశాలకు సంబంధం ఉండదు. చిత్రం అంతా కలిపి కొన్ని మంచి సన్నివేశాల గుత్తి అవుతుంది. వేటికవి బాగుండవచ్చు కాని అన్నీ కలిపి బాగుండవు. అవలక్షణం కావు.

ఇటువంటప్పుడే నటీనటులకు, రచయితలకు విమర్శలు తగుల్తాయి. ఫలానా ఆర్టిస్టు పాత్రకి చాలా అన్యాయం చేశాడు అని అనుకుంటారు. కాని ఈనాటి ఆర్టిస్టులలో అంత అనుభవహీనులు ఎవరూ? ఎవరూ చేతగాని వారు. నాగేశ్వరరావు, రంగారావు. అంజలీదేవి, రామారావు వీళ్లంతా పది చిత్రాలలో పాత్రలనిండా జీవం పోసి, పదకొండో దాంట్లో పాత్రల్ని ఎందుకు ఖూనీ చేస్తారు? వాళ్లకిమట్టుకు కనీసం వాళ్ల పేరు పోకూడదన్న ఆశ ఉండదా?

అంతకీ, ఇలా అవీ ఇవీ పోగుచేసి అనుకరించడంవల్ల, నటీనటుల దర్శకుల కీర్తి ఎక్కువ కాకపోవడం అలా వుంచి చిత్రాలకు కూడా డబ్బు వస్తున్నట్టు కనబడదు. ఒక్కసారి ఆగి, ప్రజాదరణ పొంది డబ్బు చేసుకున్న చిత్రాలను పరిశీలిస్తే వాటిలో కథలు ఒక మార్గంలో నడిచాయని తెలుస్తుంది. అంతేకాదు. అన్నిటికన్న ముఖ్యంగా వాటిలో మన నేల, మన వాతావరణం, మన సంప్రదాయం, ఆచారాలు, కట్టుబాటులు ఉన్నాయి. మన మనుషులున్నారు, మనం ఉన్నాం. అని కూడా తెలుస్తుంది. ఇలా తెలుగుతనం ఉన్న చిత్రాలే తెలుగు ప్రేక్షక మహాశయుల అభిమానాన్ని సంపాదించుకున్నాయి. అంతే తప్ప ఇంగ్లాండు, సౌరాష్ట్రం, కలకత్తా జీవితాలను ఇందులో ప్రతిబింబిస్తే అవి బాగుంటే బాగుండవచ్చునేమోగాని మన ప్రజల హృదయాలకు హత్తుకోవు. పదహారణాల తెలుగుతనం ఉన్న కథా పాత్రలూ కానప్పుడు, దేశాల సరిహద్దులనూ కాలం సరిహద్దులనూ దాటిపోయే కథావస్తువులు కూడా ఆదరణ పొందుతాయి. అవి ఉత్తమమానవ లక్షణాలు గలవి. కూడా!



యతిరాజ్ ఆర్ట్సు ప్రొడక్షన్సువారి "ప్రియదర్శిని"లో రాజనాల, నిర్మల, సూర్యకళ.



శంభూవారి 'నమ్మినబంటు' చిత్రంలో నాగేశ్వరరావు, సావిత్రి.

భైరవి చిత్రంలో, ఒక సామాన్యుడు సాహసంతో, శౌర్యంతో జీవితంలో విజయం సాధించడం ఉంది. జయసింహలో త్యాగం ప్రధానమైన అంశం. అలాగే నిత్యజీవితంలో అందచందాలను, సుఖదుఃఖాలనూ ఎంతో చక్కగా చిత్రించిన సంసారం, మన దేశంలో అందరికీ పరిచయం ఉన్న ఇల్లరికాల తమాషాలను చూపే ఇల్లరికం, మధ్యతరగతి కుటుంబంలో కష్టసుఖాలను సరదాగా చూపించిన పెళ్ళిచేసి చూడు ప్రజాదరణ పొందడం నిష్కారణంజరుగలేదు; భక్తిరసప్రధానమైన పోతన, రాయలకాలం నాటి సంప్రదాయాల మధ్య నడచిన ప్రణయగాథ మల్లీశ్వరి ప్రజాభిమానం గడించడానికి మన్నన పొందడానికి అదృష్టం కారణం కాదు. వాటి విలువలే. అందువల్ల మన సంప్రదాయానికి అనుగుణమైనది—కనీసం విరుద్ధం కానిది కథావస్తువు అయితే తప్పకుండా రాణిస్తుందని నా నమ్మకం. ఆ ప్రకారంగా, ఇతర దేశాల ప్రాంతాల కథలను ముడివస్తువుగా తీసుకోడం తప్పేమీ కాదు. 'మంచి మనసుకు మంచిరోజులు' చిత్రం ఒక తమిళ చిత్ర కథకు అనుకరణ. అందులో సోదరికోసం సోదరుడి త్యాగం కథావస్తువు. శభాష్ రాముడు చిత్రం 'బడాభాయ్' అనే హిందీ చిత్రానికి అనుకరణ. ఇందులో సోదర ప్రేమ ప్రధానం. ఈ రెండు కథలూ ఇతర ప్రాంతాలవే అయినా మరి తెలుగు ప్రేక్షక మహాశయుల ప్రేమకు పాత్రం అయ్యాయి.

వీటిగురించి ఇంకొక్క విశేషం ఉంది. ఈ చిత్రాలకు కథ స్పష్టంగా ముందే ఏర్పాటు అయింది. స్క్రిప్టు ముందే పూర్తిగా తయారైంది. అందువల్ల చిత్రాలు సూటిగా నిర్ణీత కాలంలో తయారయాయి.

ఇలా అన్నిటికీ జరగటంలేదు. పిక్చరు తీయడానికి డబ్బే ప్రధానం అని నమ్మే వారంతా ఉత్సాహంతో ముందుకు వచ్చి చిత్రాలు ఆరంభించడంవల్ల ఆ దూకుడులో వాళ్ళు చిత్రానికి వెన్నెముక అయిన కథ గురించి శ్రద్ధ వహించటంలేదు. స్క్రిప్టు అనేది అసలే లేదు. డబ్బున్నవాళ్ళంతా నిర్మాతలు అయిపోతున్నారని అనడంలో నా ఉద్దేశ్యం, డబ్బు లేనివాళ్ళు మాత్రమే రావాలని ఎంతమాత్రం కాదు. డబ్బు చాలా ముఖ్యం. తరవాత చూదాం అని మా అందరికీ రుసుములు అరువు పెట్టేసేవాళ్ళు అక్కర లేదు. మాకు పదిరూపాయలు ఇవ్వలేక వాళ్ళు పది పుచ్చుకోవాలి. మాకు ఇచ్చేయుందరే, లక్షలకొద్దీ పెట్టుబడిగల ఈ వ్యాపారంలో దిగడానికిముందే, కొన్నాళ్ళు అన్నీ మెల్లిగా చూసి తెలుసుకుని, డబ్బుని నిమిషాలనూ తూచి తెలుసుకుని, నిముషం విలువ ఎన్ని రూపాయలో గ్రహించి సినిమా ఆరంభించాలి. అప్పుడైతే తీసిన భాగాలనుబట్టి తరువాతి కథ ఆలోచించడం, సెట్టుమీద సీక్వెన్సు గురించి ఆలోచించడం, సెట్టుమీదనే ఆర్టిస్టుకు డైలాగులు ఇవ్వడం జరగడానికి అవకాశం ఉండదు.

కాలంవిలువ ముఖ్యంగా సినిమాలో కాలంవిలువ చెప్పరానంత ఎక్కువైనది. హారతి కర్పూరంలా హరించిపోతుంది. దాంతోపాటు డబ్బూ హరించిపోతుంది. తరవాత, వస్తే లక్షలువస్తాయి. రాపోతే కానీ రాదు. అందువల్ల నిర్మాణకాలాన్ని సాధ్యమైనంత తక్కువగా ఉండేలా చూసుకోవాలి. ఒకప్పుడు సినిమా వచ్చినకొత్తలో హాండ్ క్రాంకింగ్ కామెరాతో షూటింగు జరిపినప్పుడు ఒకచిత్రం 15 కాల్ షీట్లలో అయేది. తెలుగుసినిమా కళ ఉచ్ఛస్థాయిలో ఉన్నప్పుడు ఒక పిక్చరుకు 45 కాల్ షీట్లు పట్టేవి. మాలపిల్ల, మల్లీపెళ్ళి, వందేమాతరం



# తెలుగు సినిమా



ఇవన్నీ 45 కాల్ షీట్‌లలో తయారైనవే!

ఈ రోజున మనం టెక్నికల్‌గా చాలా ముందుకు వచ్చామని గర్వపడుతూ ఉంటాము. ఏం లాభం? ఇన్ని టెక్నికల్ వసుపాయాలూ ఉండికూడా, ఒక పిక్చర్‌కి నూరునుండి నూటయాభై కాల్ షీట్‌లదాకా అవుతోంది!

ఇవి తలుచుకున్నపుడు—

మనం ముందుకు వెళ్తున్నామా? లేక వెనక్కి వెళ్తున్నామా అని నాకు ఆశ్చర్యం కలుగుతుంది. ఈ స్థితికి ఎవరు బాధ్యులు? ఎవరూ కారు; అందరూను...

ఆర్టిస్టులు, డైరెక్టర్లు, ప్రొడ్యూసర్లు, రచయితలూ అందరూ ఇందుకు తలో కాస్తా బాధ్యులే. అందరూ లోబడవలసిన క్రమశిక్షణ ఒకటి ఏర్పాటుచేయడం అందరి బాధ్యతాను. ఈసందర్భంలో ఒకటి జ్ఞాపకం ఉంచుకోవాలి. సినిమాలో నే కాదు, ఇంక ఏ ఫీల్డులోనైనా సరే – మనం ఎవరికో ఏమో ఏమో చేస్తున్నామనుకోవడం, ఎవరినో ఉద్ధరిస్తున్నామనుకోవడం తగదు. అలా నమ్మడం ఆత్మవంచన. ప్రతివాడూ, ఏమి చేసినా మొటమొదట తన సుఖంకోసం, తన సంతోషంకోసం చేస్తాడు. దానివల్ల మరి కొందరు సుఖపడి సంతోషపడితే సంతోషమే. కాని మొదటిది తన విషయమే. మనం ఏమి ఉపన్యాసాలుచేసినా ఇది నిజం అందువల్ల ఇది మనసులో ఉంచుకుంటే, ప్రతిదానికీ మన పదవినిబట్టి మన ప్రాధాన్యాన్నిబట్టి డిమాండ్‌లుచేయడం న్యాయం కాదు. మనకిఉన్న ప్రతి హక్కుకీ పక్కనే ఒక బాధ్యతకూడా ఉంటుంది. బాధ్యత వదిలేసి హక్కు మాత్రం వాడుకుంటాను అది మాత్రం నాకు చాలు సర్దుకుంటాను అంటే జరగదు.

అయితే మనందరం ఈవిధంగా ఎవ బాధ్యత వారు నెరవేరిస్తే ఈ ప్రపంచంలో సమస్యలే ఉండవు. మనం ఇలా వ్యాసాలు వ్రాసి చర్చించుకోవలసిన అవసరమూ ఉండదు...

సినిమాకి సంబంధించినంతవరకూ అందరూ ఎప్పుడూ నెరవేర్చవలసిన ముఖ్యమైన బాధ్యత కాలం విలువను తెలుసుకుని గౌరవించడం. ఆర్టిస్టులు వేళకు రావాలి. కథకులూ, నిర్మాతలూ షూటింగు కార్యక్రమంలో కాస్త ఖర్చు తగ్గించడంకోసం, ముందరే స్క్రిప్టు తయారుచేసుకోవాలి. టెక్నీషియన్‌లూ, దర్శకుడూ అంతా వేళకు సిద్ధంకావాలి. ఇవన్నీ జరిగినపుడు దర్శకుడు ఫిలిం నిర్మాణంలో క్రమశిక్షణను ఇప్పటికన్న ఎంతో ఎక్కువగా అమలు జరపగలడని నా నమ్మకం. ఎందుకంటే, ఎవరు ఎంత గొప్పవారైనా అందరూ చివరికి దర్శకుడి చాలనలో నడవవలసినవారే. సినిమా ఆ వేళ ఒక పెళ్లి అయితే దర్శకుడు దానికి పురోహితుడు; రైలుఅయితే సారథి, యజ్ఞంఅయితే నిర్వాహకుడూ, సభ అయితే అధ్యక్షుడు. అయితే ఈరోజున దర్శకులందరూ అంత గొప్పగా, దర్జాగా తమపాత్రను నిర్వహించగలుగుతున్నారా? లేదు. అందుకు కారణం, సెట్ మీదకు వచ్చాకకూడా ఏం జరగవలసి ఉందో స్పష్టంగా ఎవరికీ తెలియటంలేదు. చెప్పడానికి మన రాజ్యాంగంలా, స్క్రిప్టు ఉండదు...

అలాగే రావలసినవారు ఎవరూ రారు. కావలసినది ఏదో ఉండదు. ఒక పని మేము చేస్తాము అని ఒప్పుకుని డబ్బు తీసుకుని వాళ్లు ఆ పని చేసేటపుడు, అది పూర్తిగా తమ స్వంత పని అని నమ్మి, తమకు డబ్బిచ్చేవాడి మేలు కోరి పనిచేయాలన్న సూత్రం పూర్తిగా అమలు జరగటంలేదు.

ఏడుగంటలకు ఆరంభం కావాలన్న షూటింగు పదింటికి ఆరంభమైనా—

80 కాల్ షీట్‌లలో పూర్తి అవుతుందనుకున్న చిత్రానికి 150 కాల్ షీట్‌లుపట్టినా—

ఆర్నెల్లలో కావలసిన నిర్మాణం ఏడాదికి తెమలకపోయినా,

అందంగా వస్తుందనుకున్న చిత్రం వికారంగా తయారైనా,

లాభం తెస్తుందనుకున్న చిత్రం నష్టం తెచ్చినా,

మెప్పులు కురిపిస్తుందనుకున్న చిత్రం చెప్పులు సంపాదించినా—

వీటన్నిటికీ ఎవరు బాధ్యులు?

ఏ ఒక్కరో బాధ్యులు కారు. ప్రతి ఒక్కరూ బాధ్యులే.

ఈ మాట గుర్తించి, దీని కీలకం కాలం విలువలోనూ, క్రమశిక్షణలోనూ ఉందని గ్రహిస్తే మనం తీసే చిత్రాలన్నీ బాగుంటాయి. అందరి కృషి రాణిస్తుంది. మంచి చిత్రాలు అందించి, మంచి లాభాలూ పొందవచ్చును.

ఇది పాటించకుండా, సినిమా కేవలం లాటరీ అన్న అభిప్రాయంతో ఆరంభించి తీసి, ఆ లాటరీలు ఓడిపోయినపుడు ప్రజలు మనని అర్థం చేసుకోలేదు అని అనుకోవడం కన్న అపరాధం ఇంకొకటి లేదు.

ప్రజలు మనని, మన చిత్రాన్ని అర్థం చేసుకోలేరు అనీ, చేసుకోలేదు అని అనుకోవడంకన్న ప్రజలనే మనం అర్థం చేసుకోలేదనీ. సత్యాన్ని తెలుసుకోలేదని, మన బాధ్యతలను హక్కులను అర్థం చేసుకోలేదనీ అనుకోవడం ధర్మం. 



శంభు ఫిలింస్‌వారి 'నమ్మినబంటులో' రేలంగి, గిరిజ.

# వార్తావరణం

యతిరాజ్ ప్రొడక్షన్స్ వారి చిత్రం 'ప్రియదర్శిని' పదిరీళ్ళు తయారైంది. రామశర్మ, రమణారెడ్డి, రాజనాల, చంద్రశేఖర్, సూర్యకళ, కుసుమకుమారి, రమాదేవి, వెంకుమాంబ మొదలగు వారు నటిస్తున్నారు. కథ, మాటలూ, పాటలూ అనిసెట్టి సుబ్బారావు వ్రాశారు. సంగీతం టి. పూర్ణానందం. దర్శకుడు పి. లక్ష్మయ్య. కెమెరా గోపాలరావు.

* * *

న్యూ ఇండియా పిక్చర్స్ వారు 'ద్రౌపదీ స్వయంవరం' అనే పేరుతో ఒక పౌరాణికం నిర్మించబోతున్నారు. స్క్రీన్‌ప్లే ఇంటూరి వెంకటేశ్వరరావు, మాటలూ పాటలూ గన్నికోటి వెంకటేశ్వరరావు వ్రాస్తున్నారు. దర్శకత్వం, నిర్మాణం గొర్రెపాటి వెంకటేశ్వరరావు నిర్వహిస్తారు.

* * *

గతవారం జి. వి. ఎస్. ప్రొడక్షన్స్ వారి కొత్త చిత్రం గురించిన వార్తలో వారి తొలి చిత్రం 'సొంతవూరు' అనిగమనించ ప్రార్థన.

## వివాహం

సినీ నటుడు జి. ఎన్. (చిన్నకోడలు) స్వామికి చి|| సౌ|| కస్తూరి సుభద్రమ్మకూ ఇటీవల బరంపురంలో వివాహం జరిగింది. గతవారం మైలాపూర్ వుడ్‌లాండ్స్ హోటల్‌లో సినిమా పరిశ్రమలోని వారందరికీ శ్రీ స్వామి విందు చేశారు. తరువాత కుమారి ఎం. సునంద గానసభ జరిగింది.

## నాటకోత్సవాలు

రాజమహేంద్రవరం, లలితకళా నికేతన వారి చతుర్థ వార్షికోత్సవ సందర్భంగా నాటకపోటీలు, ప్రదర్శనోత్సవాలు ఏర్పాటు చేశారు. రాష్ట్రంలోని వివిధ పట్టణాల నుండి నాటక బృందాలువచ్చి ఈ ఉత్సవంలో పాల్గొంటున్నాయి. మామూలు నాటికలూ, నాటకాలూ కాక, ప్రత్యేక నాటక ప్రదర్శనంలో పోటీకి కన్యాశుల్క నాటకంలోని ఆరవ, ఏడవ అంకాలను ఎన్నిక చేశారు. ఉత్సవాలు అక్టోబరు 4 నుండి 8 వరకుజరుగుతాయి. వివరాలకు కార్యదర్శి శ్రీ పీకావుటి శేషగిరిరావు పేరిట నికేతనకు వ్రాయవచ్చు.

## సిపాయి కూతురు

చందమామా ఫిలింస్ వారి జానపద చిత్రం 'సిపాయి కూతురు' ఈ నెల 11 న ఆంధ్రలో విడుదలఅయింది. జమున, సూర్యకాంతం, గుమ్మడి, నాగయ్య, రాజనాల, ఎ. వి. సుబ్బారావు, రమణారెడ్డి, బాలకృష్ణ, పేకేటి శివరాం మొదలగువారు ఇందులో పాల్గొన్నారు. మాటలు కొవ్వలి, పాటలు మల్లాది రామకృష్ణశాస్త్రి, సముద్రాల జూనియర్ వ్రాశారు. సంగీతం సుబ్రహ్మణ్యం రాజా సమకూర్చారు. దర్శకుడు పి చెంగయ్య.

## కే కెండాల్ మృతి

ప్రముఖ బ్రిటిష్‌నటి కేకెండాల్ (రెక్స్ హారిసన్ భార్య) గతవారం తన 33 వ ఏట హఠాత్తుగా మరణించింది. రక్తానికి కాన్సర్ పట్టినట్టు కొన్నాళ్ళ క్రితమే తెలిసినా వైద్యులు, ఆమె భర్త ఈ విషయం ఆమెకు తెలుపకుండా ఉంచి చికిత్స చేయించారు. కెండాల్, బ్రిటిష్ చిత్రం 'జెనివీవ్'తో పైకి వచ్చింది. 'లేడీగోడీవా రైడ్స్ ఎగైన్', 'ది కాన్‌స్టంట్ హస్బెండ్,' 'లెగర్ల్స్,' 'ది రిలక్టెంట్ డెబుటాంటే,' ఆమె ఇతర చిత్రాలు.



## సంగీత సుధాలహరి నాగభూషణం

గాంధర్వమైన గానకళను మానవలోకానికి అందించి తరింపజేసిన మహావాగ్గేయకారులకోవకు చెందిన 'వాగ్గేయకారరత్న' శ్రీహరినాగభూషణంగారు మొన్న సోమవారం ఏడవ తేదీని బందరులో పరమపదించారు. వారి వయస్సు 75.

సంస్కృత, ఆంగ్ల, ఆంధ్ర భాషావిదులే గాక, వేదాంత తత్త్వ మీమాంసల్లో తలపండిన తపస్వి ఆయన. వృత్తిచేత న్యాయవాది. కాని ఆయన ప్రవృత్తిచే గాయకులుగానే దిగంత విశ్రాంతమైన కీర్తినిచేపట్టారు. ఇటీవలి చరిత్రలో ఆయన ఆంధ్రుల సంగీతానికి సంకేతం.

హైందవమత జీవితంలో హరిద్వారం ఎంత పవిత్రమైనదో సంగీతరసప్రపంచంలో 'హరి, ద్వారం' అంత మహనీయులని గానకళావిదుల, రసజ్ఞుల భావం. అంతేకాదు అనుభవం. సంగీతం కోసం పుట్టిన హరి రామయ్యగారి వంశంలో జన్మించి ఇటు వాయులీనం అటుగాత్రం ఈ రెంటితోను రసజ్ఞలోకానికి అలౌకిక రసానందం కలిగించిన రససిద్ధులు వారు.

రాగభూషణులైన నాగభూషణంగారి కచ్చేరీల గూర్చి కథలు ఎన్నో నాడు చెప్పుకొనేవారు.

ఒకప్పుడు తిరుచిరాపల్లిలో దాక్షిణాత్య గాయకవతంసుల సమక్షాన ఆంధ్రగాయకనాయకమణి అయిన శ్రీ నాగభూషణంగారి కచేరీ ఏర్పాటయింది. అది ఆంధ్రులందరికీ ఒక 'సవాల్'గా ఎంచుకోబడింది కూడా! ఉన్నతమై వస్తున్న వరదలా ఆయన కచేరీ సాగిపోతున్న వేళ ఆయన తల్లి చనిపోయినట్టు తంతివచ్చిందట. అమృతరసానందాన్ని అందుకుంటున్న శ్రోతలు మహానవకోశం జారవిడుచుకోలేక ఆయన కచేరీ నాలుగు గంటలూ సాగి జోహారు లర్పించినప్పుడే ఆ తంతి చేతికిచ్చారట. అది ఆయన పట్ల అన్యాయమని రసానుభూతిలో వారికి తోచనేలేదు. త్యాగరాజు పుట్టినచోట మరొక్కమారు ఆంధ్ర సంగీత జయపతాక ప్రతిష్ఠితమైంది ఆనాడు.

శ్రీ నాగభూషణంగారు పరమ నిష్ఠాగరిష్ఠులు. కోర్టులో ఏగడిలోనో కూర్చుని శంకరభాష్యాన్ని గూర్చి అనర్గళంగా మిత్రులతో చెబుతూ దాదాపు 'మాట కచేరీలు' కూడా జరిపిన తత్త్వవేత్త.

ఆయనకు బందరులో అఖండ సన్మానం జరిపినపుడు ఒక దుఃఖావేశంలో మునిగిపోయారట. 'మా తండ్రిఉంటే ఎంత సంతోషించేవాడు' అదీకారణం! ఎంతటి పసి మనస్సు! ఎంత రసావేశం!

1940 లో వీరికి ఉపద్రవమైన పక్షవాత వ్యాధి సంభవించింది. ఆనాటి నుండే ఆయన కారణజగత్తులో తనువు చాలించారు. సంగీత గంగాలహరిని పుడమికి తెచ్చి రసికజనుల శ్రోత్రాలు పండించి తరింప చేసిన స్థితప్రజ్ఞులు. ఆయన 'సంగీతం' ఇక మనకు వినిపించదు.

'సంగీతజ్ఞానము భక్తివినా సన్మార్గము గలదె' యన్న త్యాగరాజువలె భక్తులై రసానంద, బ్రహ్మానందాలు చివరిదాకా అనుభవించి, ఆ త్యాగబ్రహ్మవలెనే అవసాన దశలో సన్యసించి నాదతనుమను నాగభూషణుని కంఠహారమై, విశ్వసంగీతంలో కలసిపోయిన ఈ మహనీయుని కిదే మా అంజలి.

# కారకాల తోరకాలు

(47 వ పేజీతరువాయి)

ఒక ప్రక్క దేశంలో విద్యాప్రమాణాలు తగ్గాయని గోల పెడుతుంటే పరీక్షా విధానాన్ని కూడా ఆస్థాయికి తగ్గించటం శోచనీయం. నాలుగు జవాబులిచ్చి సరి అయినది 'మార్కు' చేయమనటం, తప్పితే 'టెక్స్టు'లో ఎక్కడో గానీ కనుపించని (ఎవరూ ఊహించని) ప్రశ్నలను అడగటం నేటి రివాజు. ఈ విధానాన్ని ఈమధ్యనే విశ్వవిద్యాలయాలలో కూడా (పి. యు. సి. గ్రామరు పేపర్లో) ప్రవేశపెట్టారు. ఈ విధానంవల్ల విద్యార్థులకు పాఠ్యగ్రంథాల కన్నా 'నోట్సులు' ఎక్కువ సహాకారిగా వుండటంలో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు!

శాశ్వత స్థానికంగా పలుకుబడిగల వ్యక్తులు పాఠశాల వ్యవహారాల్లో జోక్యం కలిగించుకోవటం వల్ల ఉపాధ్యాయులకు విద్యార్థులకు గౌరవం పోయింది. నాలుగు 'సబ్జెక్టు'లలో తప్పినా పాసు చేయించటానికి పలుకుబడిగల వ్యక్తి ఎవరో ఒకరు వుంటూనే వుంటారు. అందులో కొద్దిమంది టీచర్లు తమకు వచ్చే జీతాలు చాలకపోవటంతో క్లాసులలో పాఠాలు సరిగా చెప్పక ట్యూషన్లకు రమ్మనటంకూడా జరుగుతూంది.

దీనికితోడు తరగతికిమించిన 'సిలబస్' పెట్టారు. ఇప్పటి పి.యు.సి. కి 'సిలబస్' అంతా చెప్పాలంటే కనీసం 1½ సంవత్సరం పడుతుంది. కాని ఉపాధ్యాయులు దాన్ని విధిగా ఒక సంవత్సరంలో చెప్పాలి. కాబట్టి చాల తక్కువమంది విద్యార్థులు మాత్రమే పాఠాలను అర్థం చేసుకోగలరు. ఇక మిగిలిన వారికి 'మేడ్ ఈజీ' లే గతి!

ఇక 'కో-ఎడ్యుకేషన్': నైతికంగా యిప్పటి విద్యార్థి ఏ స్థాయిలో వున్నది ఆలోచిస్తే విద్యాప్రమాణాలు తగటానికి ఇది ఒక కారణంగా తోస్తుంది. మా కాలేజి (కడప)లో కో-ఎడ్యుకేషన్ లేక ముందు మద్రాసు విశ్వవిద్యాలయంలో, విద్యార్థులు పరీక్షలో ఉత్తీర్ణులయ్యే శాతాన్ని బట్టి ద్వితీయ స్థానాన్ని అందుకొంది. కాని యిప్పుడు (సహ విద్యావిధానం వచ్చాక) శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ఏర్పడినప్పటికీ (మొత్తం కాలేజీల సంఖ్య తగ్గింది) అది కనీసం నాలుగో స్థానాన్ని కూడా అందుకోలేకపోతూంది!

—యస్. యం. (బాషా, బద్వేలు)



# పుస్తక సమీక్ష

## భారతదేశములో శిశుసంరక్షణ

ఇంగ్లీషులో రచన: డా. ఎస్. టి. ఆచార్, తెలుగు అనువాదం: శ్రీమతి ఎ. వి. కృష్ణారావు. ఆదర్శ గ్రంథమండలి, విజయవాడవారు దక్షిణభాషా పుస్తకసంస్థ సహకారమున ప్రకటించారు. వెల రు 1-80; పేజీలు 199.

ఇది కేవలం స్త్రీలకు సంబంధించిన పుస్తకం. పుట్టినది మొదలు పాఠశాలకు పోవు పర్యంతము తల్లి, బిడ్డ పెంపకములో ఎట్టి పద్ధతులను అనుసరించవలెనో పూసగ్రుచ్చినట్లు వ్రాసినారు. ఇందు విషయాలు గ్రామాలలోవారికి కొంతవరకు విపరీతంగా తోచవచ్చు. 3వ అధ్యాయంలో పాలిండ్ల పరిశుభ్రతను గురించి ఏయేమార్గములను 9వ నెల నుంచి అనుసరించవలసింది విపులీకరించారు. చాలవరకు సామాన్యజనానికి అందుబాటులో వుండే పద్ధతులే సూచించారు గ్రంథకర్త. 6వ మాసము గడచినబిడ్డ కేవలము తల్లిపాలపైన ఆధారపడిన సరిగా పెరగలేదు'' ఈ విషయమును మగ ఆడ—అందరు తెలుసుకొని వీలయినంతవరకు బిడ్డకు తల్లిపాలను మాన్పుటలో సహకరించవలెను.

పోతపాలనుగురించి చక్కగా విపులీకరించారు. ఆ సలహాలను అనుసరించుట కష్టమైనపనిగాదు. సూచించిన పద్ధతులను స్త్రీలందరు ఆచరణలో పెట్టుటకు ప్రయత్నించిన కొంతకాలమునకైనను పాత అలవాట్లు పోయి మంచిఅలవాట్లను వాడుకలో పెట్టగలము.

కలిపిన పాలను క్రిమిరహితము చేయుటానికి పాలసీసాలను, తిత్తులను ఎద్విధముగా ఎప్పటికప్పుడు శుభ్రం చెయ్యాలో రాశారు.

ఒక్క విషయం. స్త్రీలకు విశ్వాసం లేదన్నారు. శాస్త్రయుక్తమైన విధానంలో విశ్వాసం లేకపోవడంకాదు. పరిస్థితులు, వాతావరణం అన్నీ వీలుగావుంటే ఎన్ని చర్యలయినా తీసుకోవచ్చు. సరిగా ఇల్లు గుడ్డ లేని నూటికి 70 మంది ఇవన్నీ ఎలా ఆచరణలో పెట్టగలరు? ప్రభుత్వంకూడా కొన్ని విషయాల్లో గ్రామీణుల జీవనప్రమాణం పెంపొందించేందుకు ప్రయత్నం జరపాలి.

'సి' విటమిన్ చౌకగా ఆర్థికపరిస్థితులను బట్టి ఏవిధముగా పిల్లలకు ఇవ్వవచ్చునో (పే. 85) చెప్పారు—టమాటోలు, బత్తాయిలు, కమలాపండ్లు మనకు విలువడవు. ఖరీదు భరించడం కష్టం. తల్లిపాలు 9వ నెలకల్లా ఆపమన్నారు.

ఈలోగా వారికి జావపదార్థాలు అలవాటుచెయ్యాలి. మనదేశంలో మాత్రం స్తన్యం ఒక ఏడాదికైనా ఎందుకు ఆపరో తెలియకుండావుంది. వేరు వుపాయాలు చాలా వున్నా కొన్ని ఇళ్ళలో 18 నెలలవరకు పాలిస్తారు, పిల్లలకు ఒకవైపున అన్నం పెట్టుతూకూడా. ఇంగులో పేర్కొన్న వేరు వుపాయాలను గమనించాలి.

ముఖ్యమైన అధ్యాయం ఆరోది—పిల్లల అంటువ్యాధులను గురించింది. మనదేశంలో అంటువ్యాధులువస్తే రహస్యంగా దాస్తాము. ఇది చాలా తప్పు, ప్రమాదకరము కూడా. మనకు మనమే కీడుచేసుకోవడం కాకుండా ఇతరులకు హాని చేస్తున్నవారమవుతాము. "రోగం రట్టు" అన్నారు. కాని అది పాటించం.

అంటుజాడ్యాల విషయాల్లో జాగ్రత్తగా మెలగాలి. డాక్టరును సంప్రదించాలి. భయపడకూడదు. 185-187 పేజీలలో కొన్ని దక్షిణదేశములోనున్న పద్ధతులను—వాటి మంచిచెడులను ఉదహరించారు. ఇందులోని బొమ్మలు చక్కగా విపులంగా వున్నవి. ఇవి ఎంతో వుపయోగకరము.

ఈ పుస్తకం తల్లులకు ఎంతయినా లాభదాయకమయినది. తప్పకుండా ప్రతి స్త్రీ చదివి ఆవిధంగా ఆచరించడానికి ప్రయత్నిస్తే పుస్తకం రాసిన ఫలితం దక్కుతుంది. బిడ్డల ఆరోగ్యమును పెంపొందించడానికి తోడ్పడుతారు

రా. మూ.

## ★ స్వార్థం ★

తెలిసింది. అదిచాలు.

'నువ్వు ఈఊరి సుబ్బమ్మగారి సంబంధం మన సూరీడికి కుదిర్చావని ఆయన చెప్పేరు. నా మొహంగాని ఆయన కుదర్చడమేమిటి? అప్పుడే అనుకున్నాను. తిన్నగా కనుక్కుంటారా...అంతా రెడీ అయిపోయిందని విని ఆశ్చర్యపోయాను. ఆవిడగురించి బాగా వాకబు చేశాను. ఆ సుబ్బమ్మగారు చాలా గయ్యాళిమనిషిట. ఆ స్తంతా ఆవిడ పేర వుందిట. దమ్మిడీ అడగడానికి అంత వయస్సొచ్చిన కొడుక్కి హక్కు లేదుట. ఎక్కడ చదువు మానిపించేస్తుందో అని వచ్చేభయమట. ఆవిడనోటికి భయపడి సంబంధాలు కూడా రావడం లేదుట. ఇలాంటిదాంతో మన సూరీడు ఏం వేగగలడు? ఈ సంబంధం ఎంతమాత్రం చెయ్యొద్దు. తెలియకపోతే అదోమాట, తెలిసి తెలిసి పిల్లగొంతుక ఎలా కోసుకుంటాము? ఎవరన్ని చెప్పినా ఆఖరికి మీ అల్లుడు చెప్పినా ఎంతమాత్రం లొంగకు. చెల్లాయిజీవితం నిష్కారణంగా నాశనమై పోతుంది...ఏజాతకాలో పడలేదని తోసిపారెయ్యి.

'నే నిలా రాశానని ఎవరికీ—ఆఖరికి ఆయనకికూడా తెలియజెయ్యవద్దు. ఈ ఉత్తరం చదివినవెంటనే చింపెయ్యి.

'ఆయన ఒట్టి బోళామనిషి. అంతలో కోపం - అంతలో సంతోషమూను. ఇది కాదంటే ఆయనకి దూరమౌతానని ఎంతమాత్రం అనుకోవద్దు. ఫరవాలేదు, నేను మరింత దగ్గరౌతాను.

'అయిదువేలు ఇస్తామని మనం ఇదివరకు నలుగురికీ తెలిసేలా వెల్లడి చెయ్యలేదు. చేస్తే లక్షమంది వస్తారు. దాని పెళ్ళికోసం నువ్వేమీ బెంగపెట్టుకోవద్దు.

'చిన్నవాళ్ళం. నీకు తెలిసినవీ తెలియనివీ అనేకం తప్పులు చేస్తూంటాం. మమ్మల్ని మనసారా మన్నించు.' ★

'కవిగారియింట్లో అంతా రచయితలే'

'అలాగా'

'అవును. ఆవిడ నవలలు రాస్తుంది, పాపం ఎవరూ చదవలేరు. వాళ్లబ్బాయి నాటకాలు రాస్తాడు. వేసేవాళ్లు చూసేవాళ్లు మాత్రం లేరు. ఇహ కవిగారు చెక్కులు రాసి పాళేస్తారు.........ఖర్మ ఒక్కటీ 'కాష్' కాదు.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.




"మధురస్మృతి"

చిత్రకారుడు : వెల్లటూరి పూర్ణానందశర్మ—వెల్లటూరు.

**Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.**

# ప్రత్యేక త్రిగుణాచర్యతో

# గూడియున్న మెక్లీన్స్

## పెరాక్సయిడ్ టూత్ పేస్టు



**1**

**చాలా బాగుగా**
*** శుభ్రపరచును!**

ప్రత్యేకంగా మెక్లీన్స్‌లోనున్న 'లైపాయిడ్' సాల్వెంట్ మీ పళ్ల మీద యేర్పడు చుండే - మురికిని క్రిములను గలిగియుండే పాచి పొరను నిర్మూలించును, ఈ పొరను కరిగించుటవల్ల మెక్లీన్స్ మీపళ్లను బాగుగా శుభ్రపరచును.



**2**

**చాలా బాగుగా**
*** తెలుపుజేయును!**

మెక్లీన్స్‌లోనున్న ప్రసిద్ధమైన "పెరాక్సయిడ్" మీ పళ్లకు గల వికృతమైన డాగులను, గారపట్టిన రంగును తొలగించును - అందువల్ల వాటిని మెరిసేటట్లు తెల్లగా జేయును.





**3**

*** బాగుగా కాపాడును!**

మీరు మెక్లీన్స్‌ను స్వయముగా వాడి దానియొక్క సుప్రసిద్ధమైన రుచిని ఆస్వాదనమును కనుగొనండి. ఇది పనుచిగుళ్లను ఉత్తేజ పరచి, దంతక్షయమును కలిగించే క్రిములను నిర్మూలించును.



బాగుగా పరిశుభ్రపరచును + బాగుగా తెలుపుజేయును + బాగుగా కాపాడును.

*ఈ మూడు గుణముల సుప్రసిద్ధమైన కూడిక మీకు త్రిగుణ చర్యను గలిగించును, ఇది మెక్లీన్స్‌లోమాత్రమే ఉన్నది!*

**అతి శుభ్రమైన, అతి తెల్లని, అత్యారోగ్యవంతమైన పళ్లకోసం.. నేడే మెక్లీన్స్ కొనండి!**

MTY-45